


## శ్కాండినేవియాలో విడాకులు

ఐరోపాఖండమునందలి స్వీడను, నార్వే, డెన్మార్కు అనుదేశములుగల భూభాగమునకు సాముదాయకనామము శ్కాండినేవియాఅని. ఆశ్కాండినేవియాభూభాగమునగల విడాకులపద్ధతి నిచ్చట క్లుప్తముగ వివరించుచున్నారము.

వివాహనీతి, విడాకులధర్మము విశేషముగ దూషితముగాకుండగ వివాహన్యాయమును శాస్త్రసమ్మతముగ నిర్వహించుటయెట్లు అనుసమస్య నేటినాగరికదేశప్రభుత్వములనెల్ల ఎదుర్కొనుచున్నది. విడాకు గృహచ్ఛిద్రములకు ప్రత్యక్షఫలమనిగాక చెడ్డతనమునకు ప్రదర్శనశాలయని భావించుట నేటిప్రపంచముయొక్క తీరునుగమనింపని మోఆకులతనము. మతధర్మముచేతను, న్యాయశాస్త్రముచేతను వివాహమును పాయరాని బంధముగ నొనర్పవలయునను సదుద్దేశముగల నైతికులు భార్యాభర్తలు ప్రేమ పెడబాసినవారును, అన్యోన్య గౌరవమును గోల్పోయినవారును అయినను విడివడుటకు ఒప్పుకొనరు. కావుననే నేడు అమెరికను సంఘసంస్కర్తలు విడాకుపొందుటను కష్టసాధ్యముగనొనర్చుటకు ప్రబలప్రయత్నములను కొనసాగించుచున్నారు. శ్కాండినేవియాలో అవలంబింపబడుచున్న పద్ధతివేరు. అమెరికనుపద్ధతికి పూర్తివిభేదముగల పద్ధతి శ్కాండినేవియను దేశములందు నేడు ఆచరణయందుంచబడి పరీక్షింపబడుచున్నది.

ఈనూతనపద్ధతికి ఆచార్యుడు ఎలన్‌కీమహాశయుడు. 'ప్రేమలేని వివాహము వ్యభిచారమే' అని ఆమహాశయుని ఉపదేశసారము. ఆతని నిరంతరాందోళనమునకు ఫలితముగ స్వీడను, నార్వే, డెన్మార్కుదేశముల ప్రతినిధులు 1910-వ సంవత్సరమున సమావేశమై శ్కాండినేవియాలో సాంఘికచట్టనిర్మాణవ్యవహారపరిష్కారమును పర్యాలోచింప ప్రారంభించిరి. ఈపర్యాలోచనము ఎనిమిదివత్సరములపాటు ఎడతెగకసాగెను. 1918-వసంవత్సర

మున ఈప్రతినిధులు ఒకనివేదికను ప్రచురించిరి. వివాహసమస్యలు, విడాకులపద్ధతులు, సాంఘికన్యాయములు అందు కూలంకషముగ చర్చింపబడినవి. ఈనివేదికయందు గావింపబడిన సూచనలప్రకారము స్వీడను దేశము తనసాంఘికచట్టములను మార్పునొందించుకొనెను. అనంతరము నార్వేదేశము స్వీడను అడుగుజాడలను స్వీకరించెను. తుదిని 1922-వసంవత్సరమున డెన్మార్కుకూడ స్వీడను, నార్వేదేశముల ననుసరించెను. ఇట్లు వివాహన్యాయమున శ్కాండినేవియాయందు ఏకసూత్రము నెలకొనెను.

ఈమూడుదేశములలో చట్టనిబంధనలందు సూక్ష్మవిభేదములు లేకపోలేదు. అయినను మూలసూత్రముమాత్రమొక్కటియే. 'వివాహము కేవలము కాంట్రాక్టు. ఇతరమైన కాంట్రాక్టులకువలెనే ఇదియు మార్పునొందవచ్చును. ఈకాంట్రాక్టుకు ఫలమైన సంతానము కాంట్రాక్టుమార్పబడుకాలమున విశేషవిచారణమందును.' ఇట్లని మూలసూత్రము. వివాహము విధినిర్దిష్టము అనువాక్యమున కక్కడచెల్లుబడిలేదు. వివాహము కేవలము మానవుడు నిర్మించిన సంస్థ. కాలము, అనుభవము సూచించుమార్పుల నది లోగొనవలసియుండును. శ్కాండినేవియాయందు విడాకుపొందుటకు సులభమైనమార్గము భార్యాభర్తలు అన్యోన్యము సమ్మతించుటయే. ఈచట్టము గావింపబడకపూర్వము శ్కాండినేవియనుదేశములందు వివాహితలగు స్త్రీలహక్కులు చాల సంకుచితములై యుండెను; విడాకును పొందుట దుర్ఘటమైయుండెను.

భార్యాభర్తలలో ఎవరోఒకరు బుద్ధిపూర్వకవిసర్జనము గావించినట్లు నిర్ధారితమైనగాని పూర్వము విడాకుపొందుటకు అవకాశములేకుండెను. అగుట అప్పుడు విడాకును పొందదలచిన దంపతులు అసత్యమార్గము నవలంబింపవలసివచ్చెడిది. విడాకుపొందుటకు కాలము అనుమతించు పర్యంతము భర్తయో భార్యయో విదేశమున ఉండిపోవుచుండిరి. ఈబుద్ధిపూర్వకవిదేశగమనము కోర్టులో 'బుద్ధిపూర్వకవిసర్జనముగ' నమోదుఅగుచుండెను. అప్పుడు విడాకుకు డిక్రీ అగుచుండెను. ఈనూతనవివాహచట్టము అమలులోనికిరాకపూర్వము స్వీడనుదేశమునందలి విడాకులలో సగము ఇట్టి 'బుద్ధిపూర్వకవిసర్జనము' అను అసత్యప్రకటనముమూలమున పొందినవియే అయియుండెను. ఇప్పుడు అట్టి అసత్యప్రకటనమునకు అవసరములేదు. భార్యాభర్తలు అన్యోన్యము సమ్మతించి బాహాటముగ విడాకుకొఱకు దరఖాస్తులు పెట్టుకొనుచున్నారు.

వ్యక్తులహక్కులను పరిరక్షించుటకును, వివాహన్యాయము సక్రమముగనిర్వహించుటకును, విడాకుపొందు దంపతులయొక్క బిడ్డలక్షేమము అరయుటకును ఈనూతనచట్టమున నిబంధనలుగలవు. కుటుంబముయొక్క ఆదాయము, ఆస్తి వీనివిషయమున భార్యాభర్తలకెట్టి విభేదము కల్పింపబడలేదు. ధనమునార్జించు మగవాడును, ఇలుదీర్చి బిడ్డలను సాకు మగువయు సమానబాధ్యత, సమానమైన హక్కుగలవారుగనే పరిగణింపబడుదురు. భార్యా

భర్తలు అన్యోన్యము సమ్మతించి తమపెండ్లికాంట్రాక్టును రద్దుచేయవలసినదిగ కోర్టువారిని కోరినచాలును. అన్యోన్యము నిందారోపణచేయవలసిన అగత్యములేదు; ప్రశ్నలువైచి గోప్యవిషయములను బహిరంగమొనర్చుటకు కోర్టువారికి అవకాశములేదు. ఇంతమాత్రమున విడాకుపొందుట కారుచౌకఅనుటకును వలనుపడదు. విడాకుపొందుటకు కోర్టువారికి దరఖాస్తుపెట్టినతేదీమొదలు ఒకసంవత్సరమువఱకును వివాహవిచ్ఛేదమునుగోరుదంపతులు వేచియుండవలయును. ఈసంవత్సరకాలములో ఆదంపతులు విడాకునుపొందుటనుగూర్చి నిదానముగ పునరాలోచన గావించుకొనవచ్చును. తొందఱపాటునకేమియు అవకాశము లేకుండును. సంవత్సరముగతించినపిమ్మటగూడ ఆదంపతుల హృదయములు మార్పునొందక విడాకునొందుటకే సునిశ్చితములై యుండుచో డిక్రీ ఈయబడును. ఇట్లు డిక్రీఇచ్చుటలో ఆదంపతుల సంతానసంరక్షణవిషయమున విశేషమైన మెలుకువచూపబడును.

భార్యాభర్తలలో ఒక్కరే విడాకు పొందుటకు దరఖాస్తుచేసినను చేయవచ్చును. వ్యభిచారము, హత్యమొదలగు పెద్దనేరములు, సుఖరోగములు, కుదరనిపిచ్చి మొదలగునవి అట్టిసమయములందు విడాకుహక్కు పొందుటకు కారణములగును. మొత్తమువిూద శ్కాండినేవియను దేశములందు భార్యాభర్తలు అన్యోన్యము సమ్మతించి పొందు విడాకులే హెచ్చు.

నూతనచట్టము అమలులోనికి వచ్చినతరువాత ఈదేశమునందలి విడాకులను పొందినవారిసంఖ్య పెరిగినది. స్వీడనుదేశమున 1923-వ సంవత్సరమునందు నూటికి నాలుగు వివాహములవఱకు మాత్రమే విచ్ఛేదమునందగా 1927-వ సంవత్సరమునందు నూటికి అయిదుకుపైగా వివాహములు విచ్ఛేదమునందినవి. నార్వేదేశమున 1930-వ సంవత్సరమునందు 839 విడాకులు గ్రాంటుచేయబడెను. ఇంతకుపూర్వము ఏఒక్కసంవత్సరమునందును ఇంతహెచ్చుసంఖ్యగల విడాకులు గ్రాంటుచేయబడలేదు. గ్రాంటుచేయబడిన ఈవిడాకులలో 326 భార్యదరఖాస్తుమీాదను, 257 భర్తదరఖాస్తుమీాదను, 256 భార్యాభర్తల అన్యోన్యసమ్మతిమీాదను చేయబడినవి. విచ్ఛేదమునొందిన వివాహములలో నూటికి ముప్పదివఱకు ఆఱుమొదలు పదిసంవత్సరములకాలము నిలిచినవి. విడాకును పొందిన భార్యలలో పెక్కుమంది తమకు ఇరువది ఇరువదినాలుగువత్సరములమధ్య వివాహము ఆడినవారే. విడాకు పొందిన దంపతులలో నూటికి ముప్పదిమందికి మైనారిటీ వెడలని పిల్లలులేరు; మఱిముప్పదిమందికి ఒక్కబిడ్డమాత్రముండినది. కలిగినసంతానమునుబట్టి ఆదంపతులు సుఖమయమైన సంసారమును నిర్వహించుచున్నారని ఊహింపవచ్చును. కాని ఇది ఊహయే కాని నిజము కాదు. సంతానము ఎంతహెచ్చుగనున్న వివాహవిచ్ఛేదము అంతకష్టమగుచున్నదే కాని అది సుఖసంసారమునకు సూచనఅగుటలేదు. ప్రపంచమునందంతను పేదసంసారములే పెద్దసంసారములుగ నుండుచున్నవి. ఈకారణముచేత పేదసంసారులలో పెక్కుఱు వివాహ

బంధమును త్రెంచుకొనగోరియు త్రెంచుకొనజాలక ఆజన్మము మనసుకలయని దాంపత్యమున మ్రగ్గుచు దినములు నెట్టుచున్నారు.

విడాకులచట్టమును విశాలపఱచుటచే స్కాండినేవియాలో ప్రజలయందు నీతి ప్రభ్రష్టముకాలేదు. ఆదేశమున పొందబడుచున్న విడాకులసంఖ్య విశేషముగనున్న మాట నిశ్చయమే. కాని విడాకుపొందుట కష్టసాధ్యమగు అమెరికాసంయుక్తరాష్ట్రమునందలి వివాహవిచ్ఛేదముల సంఖ్యకంటె ఈదేశమునందలి వివాహవిచ్ఛేదముల సంఖ్య మిక్కిలి తక్కువ. క్రిందఈయబడుచున్నపట్టీ ఈవిషయమును తేటతెల్లము గావింపగలదు. ఈపట్టీయందలి అంకెలు 1930-వ సంవత్సరమున గైకొనబడిన జనాభాలెక్కలననుసరించితయారు చేయబడినవి.

| నంబరు. | దేశ నామము | జనాభా | 1929-వ సంవత్సరములో | | |
|---|---|---|---|---|---|
| | | | జరిగిన వివాహములు | పొందబడిన విడాకులు | జరిగిన వివాహములలో నూటికి విచ్ఛేదములైనవి. |
| 1. | అమెరికా సంయుక్త రాష్ట్రములు | 122, 775, 046 | 1, 232, 559 | 201, 475 | 6. 3 |
| 2. | స్వీడను | 6, 120, 080 | తెలియదు | 2, 303 | తెలియదు. |
| 3. | నార్వే | 2, 772, 000 | 17, 752 | 791 | 4. 4 |
| 4. | డెన్మార్కు | 3, 434, 555 | 26, 622 | 2, 265 | 8.2 |

శాసనముచే వివాహబంధములను దృఢపఱుపదలచుట వ్యర్థమైనకార్యమని ఇందు మూలమున విస్పష్టమగుచున్నది.

దంపతులలో ఎవరోఒకరు మూడుసంవత్సరములకాలము బుద్ధిపూర్వకముగ రెండవవారినుండి విడివడి జీవించుచో తక్షణము విడాకు ప్రసాదించుటకు స్వీడనుదేశపు వివాహచట్టము అనుమతించును. వివాహమైనంతమాత్రమున వ్యక్తులు తమ స్వాతంత్ర్యమును గోల్పోవరనియు, భార్యాభర్తలలో ఇరువురకును ప్రత్యేకమైన హక్కులుగలవనియు ఆచట్టము నిర్వచించుచున్నది. సంతానముమీదను, భార్యమీదను, ఆమె ఆస్తిమీదను మగవానికి పూర్ణమైన హక్కునిలుపు ఇతరదేశపుఆచారములు ఇక్కడ చెల్లవు. భర్తఆస్తి భార్యఆస్తికంటె తక్కువదై పోషణకు సరిపోవనిచో భార్య తనఆదాయమునుండి భర్తకు కొంత ఈయవలసియుండును. విడిపోవుభార్యాభర్తలు తమసంతానవిషయమై సముచితమగు ఏర్పాట్లు కావించుటకు కరారుచేయుచో కోర్టువారు తృప్తిపడుదురు. వ్యవహారమును అనవసరముగ పెంచరు. ఇట్టికరారులేనిచో కోర్టువారు ఆసంతానవిషయమై బాధ్యతవహించి ఏదే నొకఉచితమైన పరిష్కారముగావింతురు.

స్కాండినేవియాయందు వివాహన్యాయము భార్యాభర్తలకు వారివారిఆస్తిపాస్తుల యందు ప్రత్యేకబాధ్యతను, ప్రత్యేకమగుహక్కును ప్రసాదించుచుండుటచే **Alimony** (మగనివిడిచి నిర్దోషురాలుగానుండే భార్యకుఇచ్చు జీవనాంశము) సమస్య క్లిష్టముగలేదు. అమెరికాయందు ఈపరిస్థితులులేని కారణమున ఈసమస్య క్లిష్టమై ప్రత్యేకము **Alimony Bureau** అను సంస్థ స్థాపింపబడుటకుకారణమైనది. ఈబ్యూరోవారు సంవత్సరమునకు పది కోట్లపౌనులవఱకుగల ధనమునుగూర్చి పరిష్కారము గావింపవలసిన వారగుచున్నారు.

ఇట్లు స్కాండినేవియను దేశములవారు ఒక్క వివాహానంతరము గలుగు సమస్యలను మాత్రమే పరిష్కరించుటతో తృప్తిపడుటలేదు. వివాహమునకు పూర్వము చూపవలసిన మెలకువలనుగూర్చి కూడ వారు శ్రద్ధచూపుచున్నారు. వివాహము గావించుకొనుటకు చేయు దరఖాస్తులతో వధూవరులు తాము మూర్ఛమొదలగు వంశపారంపర్యముగవచ్చే రోగములులేని వారమని వైద్యునినుండి సర్టిఫికెట్టునుగూడ పంపవలయును.

ఈనూతనచట్టము ప్రజలసమ్మతిని అందినది. ఆచరణయందు అది వారికి తృప్తిగలిగించినది. పాతచట్టము అమలులోనున్నప్పుడుకలుగుచుండిన ఇబ్బందులు ఇప్పుడేమియులేవు. ప్రపంచమునందలి వివిధదేశములందు వివాహవిషయకచట్టములలో స్కాండినేవియనుల చట్టము ప్రశస్తతరముగనున్నదని స్టాన్‌టన్ టిలట్సన్ మొదలగు ప్రసిద్ధసంఘసంస్కర్త లభిప్రాయపడుచున్నారు.

## "ఏది నా గులాబి?"

సహదేవ సూర్యప్రకాశరావుగారు

ఆమె గవాక్షములో కాలు క్రిందకువైచి ప్రక్కగాకూర్చున్నది. సరిగంచుదుకూలము దాల్చినది. తీర్చిదిద్దినట్లున్న ఆమెకనుబొమ్మల మధ్య దోసగింజబొట్టు. చెక్కిళ్ల మవ్వపు సొబగు కనీనికలలో మెఱుగారుచుండెను.

ఆమెకనులలో పరధ్యానము.

ఆమెచేతిలోని గులాబి కరకాంతిని క్రిందు చేసినది. కాని నఖకాంతికి మసకమసక అయినది. సంధ్యారుణకిరణము ఆకులసందులనుండి ఆమె కర్ణికపయిబడి పిసాళించుచుండెను. చెదరని పాపటనుండి ఒక నీలాలకము విడివడి భ్రూనవనాట్యరేఖలతో కలసి నటించుచుండెను. గవాక్షమునుండి ఒక్కొక్కసారి జల్లుగా పవమానము వీవసాగెను. ఆపిసాళి గాలికి ఆమె శుభ్రకార్పాసము, ఆమె నీల కైశికము, ఆమెశాతాంగములు నిలువెల్ల కంపిల్లిపోవుచుండెను.

జుట్టులో ఇమిడీఇమడకఉన్న చెంబేళిరాలి క్రిందపడిపోయినది. ఆమె తెలిసికొన్నదికాదు. కనులు నిమీలితములు. నీలములు. నిట్టూర్పు ధ్వనియేనిలేదు. నీరవము.

చేతిలోని గులాబిరేకులను చిదిమినది. చీలికలుచీలికలు వార చిదిమివేసినది. మఱల ఒకరేకు. ఇంకొక్కరేకు. వేఱొక్కరేకు. మఱి

యొక్క రేకు. తుదకుపుష్పము నామరూపము లను బాసినది. తొడిమ రాలి నేలపడిపోయి నది. ఆప్రసూనరజము ఆమె పదసరోజరజ ములో కలసిపోయినది. తుత్తునియలై చెల్లా చెదరయిన ఆదళములను గాలి తెలియరాని ఏసీమలకో ఎగజిమ్ముకొని పోయినది. ఆమె తెలిసికొన్నది కాదు.

*   *   *

"ఓ, స్త్రీ! ఏమిచేసితివి? నీవేమిచేసితివో నీకేమయిన తెలియునా? అది లోమహర్షణ కార్యమని నీకేమయిన తెలియునా? సుకుమా రులకు క్రొవ్వాడిగోళ్లు ఎందులకు? పుష్ప హృదయములను చీల్చివేయుటకా? నిన్నన వలసిన పనిలేదు.

నీవు పరధ్యానసమాధిలో ఉన్నావు.

అయ్యో! నీగోటిప్రతినొక్కునకు ఆకిశోర ప్రసూనము ఎంతగానిట్టూర్చినది! ఎంతగా కన్నీరోడ్చినది!

చీలికలు చీలికలువార చీల్చివేయుటయే జీవితకార్యముగాగల గోటికొనలకు బాధా నిశితనిశ్వాసములసౌరభము

ఏమి తెలియును?

తప్తజీవితమానాశ్రుపాళికల సౌహార్దము

ఏమి తెలియును?

ఓ, స్త్రీ! నీవుసుకుమారివి. నీహృదయము సున్నితము. చేసేతకోసికొనివచ్చి చేజిక్కించు కొనిన. ఆప్రవాళమనోజ్ఞప్రసూనమునకా అప్రతిఫలము?

అవును లే, నిన్ను అనవలసినపనిలేదు. యుగయుగాంతరములనుండి అనుశ్రుతముగా వచ్చుచున్నది ఈపరమధర్మము."

*   *   *

ఆమె కనులను తెరచినది. నిట్టూర్పులసడి. నేత్రపక్ష్మలింపుల సన్న.

ఆమె గవాక్షముఖముచూచినది. వట్టి బయలు. వెఱ్ఱిబయలు.

ఆమె చేతినిచూచుకొన్నది.

మృదులాంగుష్ఠమునుండి క్రొన్నెత్తురు కొంచెముకొంచెముగ చిందువారుచుండెను.

ఆగులాబీముల్లు గ్రుచ్చుకొన్నది.

ఆప్రసవము నశించిపోవుచు ఆరక్తచిహ్న మును వదలిపోయినది.

ఆమె ఒడినిచూచినది.

"ఏది నాగులాబి? నాగులాబి ఏది?"

ఆమె లేతపెదవులనుండి వెలువడినది.

"ఏది నాగులాబి? . . ."

ఆపలుకరింత కలవరింతఅయినది.

ఆకలవరింత కరుబంతములను కలగింపు పెట్టినది.

రక్తము చిందువారుచున్న అంగుష్ఠమును ఆమెహృదయమునకు హత్తుకొన్నది. హృద యము రక్తాంకితమయినది.

"ఏది నా గులాబి? . . ."

అదితీరనికోరికయై ఆమెహృదంతరములో ఆమరణాంతము నిలిచిపోయినది.

"ఏది నాగులాబి?"

# ఆడువారలసొమ్మిద్ది అట్లతద్ది

కుర్రా వేంకటసుబ్బారావుచౌదరి.గారు

కెంజిగురాకులగేరు హస్తములకు అరుణపుగోరింటనద్దుకతన
కలకలధ్వనులచే విలసిల్లువేకువ చిత్రాన్నములనుభుజించుకతన
మనమున కాహ్లాదమగుచిరుసంధ్యల నుయ్యాలలందుననూగుకతన
అపరరమ్భాదేవులట్లు శ్రేణులుదీర్చి పత్రికై తోటలబారుకతన
కమ్మకస్తూరికాతిలకమ్ముదిద్ది
దాచియుంచినసొమ్మెల్ల దాల్చి మేన
జిలుగువస్త్రంబుధరియించి వెలుగుకతన
ఆడువారలసొమ్మిద్ది అట్లతద్ది.

కలకలధ్వనుల నాకసము మార్మ్రోయ శకుంతసంతానంబుకూయకుండ
రేయెల్లనిద్దురగాయుటచే వెలవెలబోయి చంద్రుండు వెలుగకుండ
బంధవిముక్తినిబడసి సంతసమున అళికుమారకులు తారాడకుండ
అఖిలజీవులకు ప్రాణాధారమొనరించు కర్షకోత్తముడు మేల్కాంచకుండ
భోజనమ్మొనరింపుచు ప్రొద్దుపొడువ
ముసలిమగడొచ్చుననుచు సమ్మోదహాస్య
భాషణంబులగడపు మాపల్లెటూరి
ఆడువారలసొమ్మిద్ది అట్లతద్ది.

సాంఘికాచారదూషణచేయరాదంచు చేడెలకునుబుద్ధిజెప్పునట్టి
విలువైనపసిడిసొమ్ములులేక విలపించుకన్నెలనోదార్పగడగునట్టి
చిత్రమాఖద్దరుచీరెలంపుడటంచు అన్నలకునువార్తలంపునట్టి
అమ్మాయియుద్యాపనముదీర్పగావలె ధనములేదేయనిగోణుగునట్టి
కూతులకుస్నానమొనరించి కురులుదువ్వి
కీలుజడవైచి కాటుకగీలుగొలిపి
వాడవాడలతిరుగాడి వచ్చునట్టి
ఆడువారలసొమ్మిద్ది అట్లతద్ది.

అవ్యక్తమధురగానముబాడు గోపబాలకులు గోవులనుమరల్చువేళ
వలయాకృతిగవ్యూహములుబన్ని పక్షులు దివిని సంతసమునదిరుగువేళ
పశ్చిమాచలమున భానుండు సహజశీతలకరచ్ఛాయచేదనరువేళ
ఘ్రాణించుపుష్పసౌరభముమ్రుచ్చిలి మందమారుతం బుప్పొంగిపారువేళ

కరమునందలిగాజులు కాలియందు
యలును ఘల్లని|మ్రోయ నుయ్యాలలూగి
పరమహర్షంబుబొందు మాపల్లెటూరి
ఆడువారలసొమ్మిద్ది అట్లతద్ది.

తళతళల్లాడుఖద్దరుచీరెధరియించి కాంతులీనెడుకంచుకంబుదొడిగి
ప్రాచీనహైందవపద్ధతికనువగుపారాణి పదముల బాదుగొలిపి
కలకలలాడుచువిలసిల్లు నెమ్మొగమ్మునను కుంకుమబొట్టును స్మరించి
కన్నుబున్ననుయత్తగారిమాటెదురాడజాలక నమ్రతజాటుచుండి

అనుగు నెచ్చెలులనుగూడి యట్లుబంచ
వీథులందునదిరుగుచు విస్మయంపు
భక్తిభావాననొప్పు మాపల్లెటూరి
ఆడువారలసొమ్మిద్ది అట్లతద్ది.

## ప్రేమాంజలి

ఊటుకూరు సత్యనారాయణరావుబహద్దర్ జమీందారుగారు

నీకయి కన్నువిచ్చిగమనించుచునున్నది కోరకమ్ము సం
ధ్యాకమనీయకోమలసుధామయమూర్తివి మల్లికాసతీ!
తాకవు బుజ్జగింపవు వృథా యిటుపాడతి మంటికొగిలిక్
వేకువ నిద్రగూరితివా విస్మృతపూర్వవియోగగీతికై.

అచిరుపాపలేనగవు నందు చెమర్చెను సృష్టి, తేనియల్
తాచవిచూడనో పెదవి తారుచునున్నది, మూగవోయి యో
గాచరణప్రసక్తి వివశాత్మకమైన కనుల్ తెమల్చుచుం
రాచరికమ్మువోయిన ధరాపతికింబలెజార్చెనశ్రువుల్.

కలువపడంతిమేనిపయి గంధపుపూతలనోసరిల్లి ని
ర్మలధవళాంశుబాహుపరిరంభణ మత్తిలియున్న చంద్రుడుం
వెలవెలవోయె నీకునయి వెచ్చగనూర్చు వసంతు సోగక
న్నులను ప్రవాళరక్తిమ కనుంగొని చిత్తము రేవ మల్లికా!

శాంతిగంభీరతావకేక్షణములందు నిత్యసౌఖ్యమ్ముగని పూలు నెత్తిపైన
హృదయమున నద్దుకొనెనంట ఎదురువోయి ఎంతకృశియించె నీకు వసంతమూర్తి.
ప్రేమతో మల్లికాపాదరేణువొకటి శీర్షమందుంచి త్రిజగతీసేవ్యమాన
మాపవిత్రసామ్రాజ్యభద్రాసనమ్ము ఏలుకొనుమో ప్రభూ! యంచు నేడ్చునతడు.

# పాతసాంప్రదాయం

కె. కుటుంబరావుగారు

౧

బతికిఉండగా శేషగిరిరావుగారు కలెక్టరీ చేశాడనీ, మధుసూదనరావు బి.ఏ. పరీక్షలో మొదటి క్లాసులో మొదటవచ్చేడనీ కాదు మధుసూదనరావుకు సోమసుందరంగారు పిల్లనిచ్చింది.

శేషగిరిరావుగారూ, సోమసుందరంగారూ చిన్నతనంనించీ ప్రాణస్నేహితులుగా ఉండేవారు. ఇద్దరికీ వివాహాలయినా, సంసారాలునెత్తినిపడ్డా, ఉద్యోగాల్లో ప్రవేశించినా, ఎడబాటుకలిగినా వారిమధ్యఉన్న బంధం తెగలేదు. ఎవరో వారిద్దరిస్నేహితంచూచి అన్నట్టు ఒకరు భార్యా ఒకరు భర్తా అయిపుట్టినట్టయితే అంతఅన్యోన్యంకలదంపతులు వేలుమడిచి చూపటానికి ఉండేవారుకారు. వారు ఒకొరికొకరు వ్రాసుకునే ఉత్తరాలు చదివితీరాలి.

శేషగిరిరావుగారు చనిపోయేసమయానికి ఆయన రిటైరయినాడు. సోమసుందరంగారు పట్టణంలో ఒక న్యాయమూర్తిగా ఉంటున్నాడు. శేషగిరిరావు మరణవార్తవిని సోమసుందరంగారు దుఃఖించక "ఇక మాకు ఒకరికొకరంకలిసి ఉండడానికి ఏమీ అభ్యంతరంలేదు. కాని వాడిచేతిమీదుగా కావలసిన కార్యాలు ఒకటిరెండు అట్టేఉండిపోయినాయి. వాడికొక్కడేకుమారుడు. నాకొక్కతేకుమార్తె. దేవుడు మమ్మల్ని వియ్యంపొందమని ఏర్పాటుచేశాడు. ఇప్పుడైనా మించిపోయిందిలేదు. ఈక్షణంనించీ మధుసూదనరావుకు నేనేతండ్రిగాఉండి, ఇప్పుడు శేషగిరి తనకొడుక్కు చేసుకోలేని సహాయం నేచేస్తాను." అనుకున్నాడు.

శేషగిరిరావుగారికి పిత్రార్జితం ఒకసెంటుభూమికూడాలేదు. ఆయనస్థితిలోఉన్న మానవుడెవడైనా బాగాగడించి ఉండును. కాని ఆయనసంపాదనకు కనబడుతూన్నది ఎనిమిదెకరాలు మాత్రమే. ఆయన చనిపోయే సమయానికి మధుసూదనరావు బి.ఏ.లో చేరటానికి సిద్ధంగాఉన్నాడు.

ఈసమయంలో మధుసూదనరావుకు సోమసుందరందగ్గిరనుంచి ఉత్తరంవచ్చింది. ఆఉత్తరంచూచి మధుసూదనరావు ఆశ్చర్యపడ్డాడు.

"నీతండ్రి నాకు ప్రాణసమానుడు. నీభవిష్యత్తును గురించి నీతండ్రి ఏమేమిప్రయత్నాలు చేసేవాడో అవన్నీ నేనుకూడా చెయ్యటానికి నీకేమీ అభ్యంతరం ఉండదనుకుంటాను. నీతండ్రియందు నీకెంత నమ్మకం ఉన్నదో నాయందుకూడా అంతనమ్మకంఉంటే నాకు చాలాసంతోషంగా ఉంటుంది."

సోమసుందరంగారిని మధుసూదనరావు ఒకటిరెండుసార్లు చూచేడు కాని ఆయన అతని మానసిక ప్రపంచంలోకి ఇంకారాలేదు. ఈ ఉత్తరం చూడగానే మధుసూదనరావుకు ఆయనయందు ఒకవిధమైన పక్షపాతం అభిమానంకలిగింది. ఆయనచెప్పినట్టు అక్షరాలా చెయ్యాలనిపించింది. తనతండ్రే సోమసుందరంగారి రూపకంగా తనకు సలహాఇస్తూన్నట్టుగా ఉన్న దతనికి.

ఇంతకూ ప్రస్తుతం సోమసుందరంగారు మధుసూదనరావుకు ఇవ్వదలచిన సలహా ఏమిటంటే, అతను మెడ్రాసులో తమఇంట్లోఉంటూ బి.ఏ. చదవాలని. మధుసూదనరావు మారుచెప్పకుండా ఆయన ఆహ్వానం స్వీకరించేడు.

అతను బి.ఏ. చదివిన రెండేళ్లూ సోమసుందరంగారింట్లో అల్లుడికిజరిగినట్టు జరిగింది. మొదటినించీ మధుసూదనరావుతో సోమసుందరం తనకుమార్తె లీలావతిని అతనికిస్తానంటూనేవచ్చేడు. చిన్నకారువారా ఇంట్లో ఎవరూ లేకపోవడంచేత లీలావతి మధుసూదనం ఒకరికొకరు తప్పనిసరిగా స్నేహితులైనారు. తనకు లీలావతినిచ్చి చేస్తానని సోమసుందరం అంటూండటంవల్లనో, లీలావతి అప్పటికే పన్నెండేళ్లునిండినపిల్ల

కావటంచేతనో మధుసూదనరావామెను కొత్తలో తప్పించుకు తిరిగేవాడు. కొద్దికాలంలో ఆబిడియం పోయిందతనికి. దానికి కారణం సగం లీలావతి తనతో స్వేచ్ఛగామాట్లాడటంకూడా కావచ్చును. అదీకాక అతనామెకు రోజూ ఉపాధ్యాయత్వం చెయ్యవలసివచ్చింది. అంతవరకు ఇంటిదగ్గిరచదివి ఆకిందటి సంవత్సరం లీలావతి నాలుగోఫారంలో ప్రవేశించింది అశకొద్దీ.

సోమసుందరంగారింట్లో అంతా నూతనసాంప్రదాయం. మొదట్లో ఈపద్ధతంతా మధుసూదనానికి కొత్తగాఉన్నా త్వరలోనే అతను దీనికి అలవాటుపడిపోయినాడు. రెండేళ్ళుగడిచినతరవాత అతని కీపద్ధతే బాగాఉన్నట్టు తోచింది.

మధుసూదనరావు బి.ఏ. పూర్తిఅయింది. కోలిచినట్టు లీలావతి స్కూలుచదువూ పూర్తిఅయిపోయింది. మధుసూదనరావుకూ, అతనితల్లికీ, తదితరబంధువులకూ ఏవిధమైన అభ్యంతరంలేకపోతే అవేసవిలో మధుసూదనరావుకు లీలావతినిచ్చి చేస్తానన్నాడు సోమసుందరం.

"పిల్ల పెద్దదని మీబంధువులు అభ్యంతరం చెప్పవచ్చును. కాని ఒకసంగతిమాత్రం ధైర్యంగా చెప్పగలను. ఇప్పుడు శేషగిరి బతికిఉంటే నీకు తప్పక లీలను చేసుకుంటాడు. నీకనుమానం అక్కర్లేదు. ఏవిషయంలోనూ వాడికొకఆలోచనా అంటూ ఉండేదికాదు. నీకిష్టమయితే నాకింకొకరి అభిప్రాయంతో పనిలేదు. అదీకాక ఇప్పుడు రజస్వలానంతరవివాహాలు అనేకం జరుగుతూనేఉన్నాయి. మనవారు అమోదిస్తూనేఉన్నారు. ముందు నీ అభిప్రాయం చెప్పు."

"నాకేమీ అభ్యంతరలేదు లెండి!" అన్నాడు మధుసూదనరావు ఆలోచనతో.

"నీకేమాత్రం అనుమానమున్నా నానిర్బంధంలేదు సుమా. నాపద్ధతులు లోకంయావత్తూ ఆమోదిస్తుందనుకోనూ అనుకోను, ఆమోదించటం నాకు ఇష్టమూలేదు. నాకుమాత్రె విషయం నాకుగల నమ్మకాన్నిబట్టి ఇంతకాలం వివాహంచెయ్యలేదు. అందుకని అందరూ లీలమాదిరిగా ఉంటారనీ నేనూహించుకోను. ఇంకొకరెవరైనా కొత్తసాంప్రదాయంతెచ్చి పెడితే నేనాగ్రహించుకోను. కాబట్టి నీకేమాత్రం ఇష్టంలేకపోయినా—"

మధుసూదనరావు నవ్వి తలఊపుతూ "నాకభ్యంతరమేమిటికి నాకుచాలా ఇష్టంకూడాను. మాబంధువుల విషయమే—"

"వారనుమతించరేమో మరి!"

"ఇది నావివాహం."

"మంచిది. పెద్దవారి నెదిరించటం తప్పే కాని, మన మంచిచెడ్డలను సుఖదుఃఖాలను తృణీకరించే వారిని నిరసించటమే నాకు మంచిపద్ధతిగా కనిపిస్తుంది. ఇంకొకవిషయం చెబుతాను. వివాహాలమీద అంతులేని ధనవ్యయం నాకిష్టంలేదు. వివాహానికి స్వయంగా నువ్వేమీ డబ్బుఖర్చుపెట్ట నక్కర్లేదు. ఈ డబ్బంతా నీదే అవుతుంది. నీకయ్యేఖర్చుకూడా నేనేపెట్టి నాకుతోచినపద్ధతిగా వివాహంచేస్తాను. నీకు సమ్మతమేనా?"

"మీఇష్టం."

"సరే! ఒకపనిచెయ్యి. లీలయినప్పుడు ఈవివాహానికి లీల అభిప్రాయంకూడా కనుక్కో. నేనూ కనుక్కుంటాను. శతవిధాలదాని కింకొకఅభిప్రాయంఉండకూడదు."

మధుసూదనం లీలావతి అభిప్రాయం అడిగేడు. ఆమె ఏమీచెప్పలేదు. కాని ఆనాడు వెన్నెలలో ఆమె ముఖంలో, కళ్లలో అతనికేమి కనిపించిందో కాని ఆమెకు వివాహం ఇష్టమైనట్టు మధుసూదనరావు తృప్తిపడ్డాడు.

మర్నాడే తెలిసినవారువచ్చి ముహూర్తం ఏర్పాటుచేశారు. ఆరాత్రి మెయిలులో సోమసుందరం మధుసూదనరావూ ముఖ్యులయిన బంధువులనూ, స్నేహితులనూ స్వయంగా ఆహ్వానించటానికి బయలుదేరేరు.

లోకానికి నోరూరుకోకపోవటం సహజమే కాబట్టి మధుసూదనరావు భవిష్యత్తునుగురించి రకరకాల ఊహాలు అతనిచుట్టాల్లో బయలుదేరినాయి. "మధుసూదనరావుకు సోమసుందరం కుమార్తెనిచ్చి చేస్తాడేమో?" "ఎక్కడైనా బావాఅనుకాని వంగతోటదగ్గిర మాత్రంవద్దు! ఏమిచూచి ఇస్తాడండీ కుమార్తెను? చెప్పండి!" "నిజమే! అసలాపిల్లకు-పెద్దదయేవరకూ వివాహంజరగదు! అప్పుడాపిల్ల ఏ ఐ. సి. ఎస్.నో చేసుకుంటుంది కాని మన వాడిముఖం చూస్తుందా? ఏదోచదువనుకూడా చదువుతున్నదట?" "అయితే మధుసూదనరావును అక్కడికి ఎందుకు రమ్మనిపిలిచేడు?" "పిలిచాట్టయ్యా! నీదో ధోరణి! శేషయ్యకూ ఆయనకు స్నేహితం కాబోలు! లాంఛనగా రమ్మనిఉంటాడు. మనవాడు అన్నదేచాలునని వెళ్లికూర్చున్నాడు శలవలకైనా ఇక్కడికి రాకుండా! వాణ్ణిఅక్కడ ఒకకుక్కకింద చూస్తూండరూ?" "బి. ఏ. పరీక్షలయినాయిగా వస్తాడేమోలే! ఈసారి తెలుస్తుంది సంగతంతా!"

అనుకున్నప్రకారం రానేవచ్చాడు. మధుసూదనంపక్కన సోమసుందరం ఉండటంచూచి బంధువర్గం చాలా ఆశ్చర్యపడ్డది. సోమసుందరం మధుసూదనరావుచేత ముఖ్యులనందరినీ పిలిపించి, అందరి ఎదటా సంగతియావత్తూ బయటపెట్టేడు. బంధువర్గం కొయ్యబొమ్మయిపోయింది. ఆశ్చర్యం, కోపం, అసూయ ఇన్నీ ఒక్కొక్కరిలో పొంగిపోతూకూడా సోమసుందరం ఎదట తలఎత్తలేక పోయినారు. ఒక్కరూ మాట్లాడలేదు! లోపల అందరూ ఈవిపరీతపరిస్థితికి ఆశ్చర్యపడేవారే. ఒకచెంప ఈరజస్వలానంతరవివాహప్రయత్నానికి మండిపడేవారే; ఒకమూల మధుసూదనం అదృష్టానికి అసూయపడేవారే.

అందరిదారీ ఒకటి హనుమాయమ్మగారిదారొకదారి. ఆమెకు రజస్వలానంతరవివాహాలు ఇష్టంలేదు. ఆమెకు కొత్తసాంప్రదాయాలు తెలియవు. ఆమెభర్తకూడా తన అభిప్రాయాలకు ఆమెను బద్ధురాల్నిగా చెయ్యక ఆమె ఇష్టంవచ్చినట్టు పోనిచ్చేడు. ఆమెకు సోమసుందరాన్నిచూస్తే అమితగౌరవంఉన్నది. ఆమెకు కుమారుడిఅదృష్టాన్ని చూసి అసూయలేదు. కాని ఆమెకు ఈవివాహం ఇష్టంలేదు. ఎంతమాత్రమూలేదు! కుమారుడితో ఆమాటఅనేటందుకు అవకాశందొరకలేదు. ఆమెమాట్లాడకుండా ఊరుకున్నది. ఆమెను సోమసుందరం తమ వెంటనే రమ్మన్నాడు. ఆమె అన్నిటికీ అంగీకరించింది.

మధుసూదనరావు సోమసుందరం అన్నమాటలనుబట్టి వివాహం తేలికగా జరిగిపోతుందనుకున్నాడు. కాని చాలా జయప్రదంగా జరిగింది. అనేకమంది పెద్దలువచ్చి మధుసూదనరావునూ, లీలావతిని శ్లాఘించి వెళ్లేరు. మధుసూదనరావునైపున వచ్చినవారు అతనితల్లీ, స్నేహితులూ, ఒకరిద్దరు బంధువులూ మాత్రమే! మధుసూదనరావు పరిపూర్ణంగా తృప్తిపడ్డాడు!

## ౨

బి. ఏ. పరీక్షలో మధుసూదనరావు అద్భుతంగా ప్యాసయినాడు. అతని ఉపాధ్యాయులతన్ని ఇంకా చదువమని ప్రోత్సాహించేరు. అతనికీ చదువుఆపుదామనిలేదు. కాని తల్లికూడావచ్చిఉంటే బాగుంటుందని అతనికితోచింది. సోమసుందరంకూడా ఆమెను తీసుకొనిరమ్మని సలహాఇచ్చేడు.

మధుసూదనం స్వగ్రామంవచ్చేడు. అతనక్కడేఉన్న పదిగంటల్లో తల్లిరానని చెప్పటం, బంధువులు కోటికివచ్చినట్టుపేలటం అంతాఅయింది. "ఇన్నాళ్లు కనిపెంచినతల్లి విషమైందే? ఇంతకాలంనించిఉన్న బంధువులకన్న ఇవ్వాళవచ్చినమామగారెక్కువయినాడా? ఆయనవచ్చి అందర్నీపిలిపించటం! ఎంతఅవమానం?

వాడువచ్చేరా? రాలేదా? అని విచారించకుండా! మూడుముళ్లూ వేయించి—రజస్వల అయిన పిల్లకు! హరి! హరి!—" వారిమాటలు మధుసూదనం లెక్క చెయ్యలేదుకాని అతనితల్లివిషయమే అతనికి చాలా బాధాకరంగా ఉంటూవచ్చింది. ఆమెకెందు కంతకోపం?

మధుసూదనం తిరిగివచ్చి జరిగినదంతా సోమసుందరానికి చెప్పేడు. ఆయన తలఆడిస్తూ "నేను మొదటనే ఊహించేను. దీనికి సిద్ధంగాఉండాలినువ్వు!"

లీలావతికిమాత్రం మధుసూదనం నిజంచెప్పలేదు.

"అత్తగారు రాలేదేం? నాకు అత్తగారిదగ్గరఉండాలని చాలారోజులనించి మనసుగా ఉంది! అత్తగారు తల్లితరవాత తల్లికాదూ? నేను మాఅమ్మను ఎరుగను!" అన్నది లీల.

"మాఅమ్మకు ఉన్నచోటు కదలటమంటే ఇష్టంలేదు!" అన్నాడు మధుసూదనం.

"ఎవరైనా ఈపెళ్లికి కోప్పడ్డారా? నిజంచెప్పండి!"

"కోప్పడ్డమెందుకు? మావాళ్లకిష్టమే."

"అయితే ఎవరూవచ్చేరు కారేం?"

"దూరమని."

"నాకుమనఊరుపోదామని ఉన్నది."

"పోదాంలే."

"ఎప్పుడు?"

"ఇప్పుడేనా?"

"చిత్రం! నేనన్నానా ఇప్పుడేనని? ఎప్పుడన్నాను."

"ఎప్పుడో పోదాంలే."

"వేసవిలో పోదామా?"

"సిమ్లా అనుకున్నావా ఏమిటి?"

"అయితే చలికాలంలో."

"అబ్బ! మాట్లాడకు, లీలా! చిరాకుగాఉన్నది."

డిశంబరు సెలవులిచ్చేరు. మధుసూదనరావుకు స్వగ్రామంపోవటం ఇష్టంలేదు. లీలావతి పోదామని బతిమాలటం మొదలుపెట్టింది. హనుమాయమ్మగారికి ఒంట్లోసరిగాలేనట్టుకూడా తెలిసింది. వెంటనే మధుసూదనరావు భార్యతో ప్రయాణమైనాడుస్వగ్రామంకు. దారిలో అతనుభార్యతో "ఒకటిరెండు రోజులుండి తిరిగి మెడ్రాసు పోదామంటే మాత్రంవీలుపడలేదు. సెలవులల్లా అక్కడేఉండాలి!" అన్నాడు.

"నేనన్నా. చూడండి." అన్నది లీలావతి.

కొడుకునూ కోడల్నీచూచినప్పుడు హనుమాయమ్మకు సంతోషమేమైనాకలిగితే అదిపైకికనిపించలేదు. ఎవరో బంధువులువచ్చినట్టు ఆమెవారికి కాళ్లుకడుక్కోటానికి నీళ్లిచ్చి, కూర్చోబెట్టి మర్యాదచేసింది.

హనుమాయమ్మఒంట్లో నయంగానేఉంటూన్నది. ఈసారి మధుసూదనరావును ముఖాన ఎవరూ ఏమీ అనకపోయినా అతని ఆందోళనతగ్గలేదు. ఇంకొకరికి తనమీదకోపంఉన్నదని అతనికిభయంలేదుకాని, తనవల్ల ఎంతమంది మనశ్శాంతి భంగమవుతూన్నదోనని భయంమాత్రం అతనికున్నది. తనతల్లే తనతోసరిగామాట్లాడదు.

వారంరోజులు గడిచేయి.



## రాష్ట్రేతరాంధ్ర నారీసమితి

(ఆద్రా, బి. యన్. ఆర్.)

### కార్యనిర్వాహక సంఘ సభ్యులు

మొదటివరుస వెనుక నిలచినవారు:—ఎడమనుండి. శ్రీమతులు 1. దేవరకొండ భారతమ్మగారు (కమిటి మెంబరు) 2. ఇవటూరి భ్రమరాంబగారు (కమిటి మెంబరు) 3. నుల్లంపల్లి మహాలక్ష్మమ్మగారు (కార్యదర్శిని)

రెండవవరుస కుర్చీలపై కూర్చున్నవారు:—శ్రీమతులు 1. నేమాని వరహాలమ్మగారు (అధ్యక్షురాలు) 2. గరిమెళ్ల దొడ్డమ్మగారు 3. జయంతి వసుంధరమ్మగారు (ఉపాధ్యక్షురాలు)

మూడవవరుస క్రింద కూర్చున్నవారు:—శ్రీమతులు 1. పర్థిపర్తి శకుంతలాదేవి (కార్యదర్శిని) 2. చామర్తి జానకమ్మగారు (కమిటి మెంబరు)






# సందేశః

సాహిత్యవిద్యాప్రవీణః
బులుసు వేంకటరమణార్యః



క. లాలయ, నిజసంతానవ
దాళీసంతానమపి సుధాంచితదృష్ట్యా
పాలయదాసీః కృపయా
లీలాకలితే! సుమంగళే! గృహాలక్ష్మీః.



క. మాకుర్వహితంకంచిత్
స్వీకురుపతివచనమేవ శీలవతి! ముదా
లోకప్రశస్తిమేవ స
దాకలయారుంధతీయథాగృహాలక్ష్మీః.

క. గర్వంమావహకాంతే!
గుర్వాజ్ఞామేవశిరసి గురుభక్త్యా స్వీ
కుర్వాత్మరమణమేవా
ఖర్వప్రేమ్ణాభజస్వ కంజదళాక్షీ!



గీ. రక్షితవాఙ్మయలక్ష్మీః
వీక్షామాత్రాత్త సుందరీలక్ష్యా
దీక్షాంకురుతత్పరనే
లక్ష్మీంతే దిశతిసైవ గృహాలక్ష్మీః.





ఒకరాత్రి భోజనాలవేళ హనుమాయమ్మ పీటలువేస్తూ దూరంగానిలబడివున్న కోడల్నిచూచి "కాస్త మంచినీళ్లయినా పెట్టరాదా? వంటలూవడ్డనలూ చెయ్యకపోతేమానె!" అన్నది పరుషంగా. లీల ఒక్కసారి భర్తవైపుచూచి, నీళ్లుపెడుతూ, చిన్నబుచ్చుకున్న గొంతుతో "నేనింకా వంటాఅదీ నేర్చుకోలేదు. కాని నాచేతనయినపని చెయ్యనా? అడగడానికి మీకుస్వతంత్రంలేదా!" అన్నది.

"చదువుకున్నవాళ్లకు నేనెక్కడ సమాధానంచెప్పగలను?" అన్నది హనుమాయమ్మ ఎగతాళిగా.

ఆరాత్రి లీలాక్షి భర్తఎదుట తలఎత్తలేదు. మధుసూదనరావు భార్యను దగ్గిరికితీసుకుని ఆమెతలమీద ముఖంపెట్టి మృదువుగా "లీలా! కోపంవచ్చిందా మాఅమ్మ అన్నమాటకు?" అన్నాడు. ఆమె సమాధానం చెప్పలేదు.

"నేనేంచెయ్యను? లీలా! నామనస్సెంతకష్టపడుతూన్నదో ఎరుగుదువా? ఆమె అనేమాటలు పాటించకు."

లీల తలఎత్తి తడికళ్లతో అతనివంక చూచి "నాకామెనుచూస్తే కోపంలేదు. ఆమెనుచూస్తే ఎంతో అభిమానంనాకు. అలాంటప్పుడు ఆమెను లెక్కచెయ్యకపోవటం తృణీకరించటంకాదా? నేనలా చెయ్యలేను. ఆమె నన్నర్థంచేసుకోలేదే అని నాకు చాలాకష్టంగాఉన్నది. ఆమాటలింకొకరంటే నేనునిజంగా లెక్కచెయ్యను."

"నిన్నర్థంచేసుకుంటే ఆమెనిన్ను నెత్తినపెట్టుకోదా నామాదిరిగా? అర్థంచేసుకోవాలని ప్రయత్నం చెయ్యదు. అదీచిక్కు."

"అసలు తప్పుమీది."

మధుసూదనం నవ్వి "ఏమిటది?" అన్నాడు.

"కోప్పడనంటే చెబుతాను."

"నిన్ను కోప్పడతానా?"

"అయితే, చూడండి. ఆమెఎదుట మీరు నామీద అభిమానంచూపుతే ఆమెకూ నామీద అభిమానం ఏర్పడుతుంది. ఆమెఎదుట మీరు నాకుదూరమైపోతారు. ఒక్కసారి నావంక బాగాచూడనైనాచూడరు. అవునా?"

"అదా నవ్వుకనిపెట్టింది. నువ్వన్నమాటలవల్ల ఒకఆలోచన తట్టింది. ఇంతకన్న మంచిఉపాయం చెబుతానువిను."

"చెప్పండి. చూతాం."

ఎవరో వినేటట్టు మధుసూదనరావు ఆమెచెవిలో రహస్యంగా చెప్పేడు. ఆమె సరిగా వినిపించుకోకుండానే "వద్దు! వద్దు!" అన్నది నవ్వుతూ.

"కాదు! అదేఉపాయం."

"కాదు!"

"అవును?"

"కాదు!"

"లీలా!"

"అబ్బ! నామాటవినండి. అదినాకుబాగుండదు."

"రెండురోజులు చూడు."

"పోనివ్వండి. మీఇష్టం."

"నీకిష్టంకాదూ?"

"ఎంతపట్టుబడలేరే? నాకిష్టంకాకుండా ఉంటుందా మీకిష్టమయితే? అదిసరేకాని సాయీాడ అత్తగారు చాలామాటలు చెప్పేరు అందరితోనూ."

"ఎప్పుడు?"

"సాయంత్రం."

"ఏమని?"

"అత్తగారన్నారుకదా—మీచుట్టాలెవరో చాలామందివచ్చేరు లెండి సాయంత్రం మీరులేనప్పుడు—వారితో అత్తగారన్నారు 'వారంరోజులనించీ వంటనేనేచేస్తున్నాననుకోండి! వంటచేస్తాననకూడదాఅది?'—నేను!—'అదేవా? ఒక్కపనిలోకిరాదమ్మా! చెప్పకుండేనమ్మరు!' అన్నారు. అందరు 'నమ్మకేం? మాకు మాత్రం తెలియదా ఏమిటి?' అన్నారు. కాదుకాని అత్తగారేంమాట్లాడుతున్నా నాకు తమాషాగాఉంటుంది. నన్ను ముఖానఅనకపోతే నాకేంకష్టంగాఉండదు. మీతోడు! నాకామెనుచూస్తే కోపమన్నమాటరాదు. తొందరపడి అన్నారేఅని కష్టంగా ఉంటుందికాని."

"నాఉపాయంతో అన్నీవదులుతాయి, చూడు."

3

మర్నాడుదయంఅయింది.

హనుమాయమ్మగారు కోడలుపనిలోనికి రావటంచూచి లోపల ఆశ్చర్యపడి, పైకిసగందెప్పగా సగం నిజముగా, "అప్పుడేఏంతొందరలే! మెల్లిగా నేర్చుకుందువుగాని పనులు. ముందిగనే పెద్దపనులుచేస్తే నువ్వు చేసినట్టూకాదు, మళ్లీనాకు చెయ్యటం తప్పదు." అన్నది.

లీల తలవంచుకుని సమాధానంచెప్పలేదు. హనుమాయమ్మ తృప్తిపడ్డది. త్వరలోనే ఆమెతృప్తిపడటానికి ఇంకొకకారణం లభించింది.

హనుమాయమ్మ కోడలిమీద అదుపుచేసి తృప్తిపొందుదామనే స్వభావంకలది కాదు. ఆమె అభిప్రాయం స్త్రీ భర్తకూ, అత్తగారికీ భయంభక్తీచూపించి సేవచెయ్యాలని. ఆమె అవిధంగానే ప్రవర్తించింది. మొదటినుంచీ ఆమెఅనుమానం లీలావతి ఇంకొకలోకంతో సంబంధించిన మనిషనీ; ఆమెసరియయిన కోడలూ, భార్యాకాదనీ; అత్తగారికీ భర్తకూ మించిపోతుందని.

ఈవారంరోజుల్లో లీలావతి ప్రవర్తన ఆమెఅనుమానాన్ని రద్దుచేసేమాదిరిగాలేదు. కాని ఈవిషయం సగం అనుమానంతీరింది ఈరోజున—తనకు సంబంధించినంతవరకు తీరినట్టే. మధుసూదనరావేస్థితిలో ఉన్నాడు? ఆమెచేతులో కీలుబొమ్మ అయిపోయినాడా? కొద్దిసేపట్లో ఆఅనుమానంకూడా తీరింది.

ఆరోజల్లా మధుసూదనరావు భార్యవిషయం చాలాచిరాకుతో ఉన్నాడు, ఉన్నట్టుండీ అయినదానికీ కానిదానికీ విసుక్కుంటూ. లీలావతి నోరుతెరవలేదు. హనుమాయమ్మకు పెద్దబరువు వదిలినట్టుంది. అన్నమంతా పట్టిచూడనక్కరలేదు. లీలావతి చాలాసాధువు.

హనుమాయమ్మకే చిత్రంగా, ఆమెకు కోడలిమీద ఆకాస్తఅనుమానం పోగానే కోడల్ని చూస్తే చాలా అభిమానంకలిగింది. ఆమె తనకోడలుకద! అప్పుడే ఎంతమందోతనకు "నీకోడలెంతచక్కనిదమ్మా! పూర్వపుణ్యం! రవ్వలాంటిపిల్ల! బుద్ధికూడామంచిదై లేనా—" అంటూంటే తానువారికడ్డంవచ్చి "బుద్ధికేం

గాని పనివిషయంలో —" ఏమేమిటో అన్నది. అనంతా ఇప్పుడెందుకు? తనదే పొరపాటు! "మంచిబుద్ధిమంతురాలయితే పనిపాటలకేం! దానికి పని చెయ్యవలసిన అగత్యం ఏమిటి? పిల్ల కాస్త గారాబంగా పెరిగిందేమో, పనిపాటా చేతకాదు!"

ఆరోజు ఇరుగుపొరుగులతో తన కోడలి విషయం ముచ్చటించేటప్పుడు హనుమాయమ్మ గారి ధోరణి వైవిధంగా ఉన్నది.

రెండుమూడురోజుల్లో హనుమాయమ్మ పూర్తిగా మారిపోయింది. పూర్వకాలపువారికి భార్యాభర్తలకు ప్రేమనేది ఎక్కువగా చూడరు. వారికి భార్య పడుతూండటం భర్త అంటూండటం సహజంగా ఉంటుంది. అందువల్ల కుమారుడు కోడల్ని కసరటం ఎక్కువయినా హనుమాయమ్మ ఎక్కువ పట్టించుకోలేదు. ఆమెకు కొడుకు నటిస్తున్నాడని అనుమానం కూడా పోలేదు. తల్లి చూస్తుండగా అతను భార్యవైపు చూచి కూడా ఎరగడు. ప్రేమపూర్వకంగా మాట్లాడి ఎరుగడు.

నానాటికీ మధుసూదనరావు ఆగ్రహం ఎక్కువకావటం మొదలుపెట్టింది. హనుమాయమ్మ కొడుకును చూచి ఆశ్చర్యపడటం మొదలుపెట్టింది. ఎన్నడూ అతనంత కోపం ఎరగడు. ఏమిటీ ఉపద్రవం? నిష్కారణంగా కూడా! చివరకు ఆమెకు కొడుకును చూస్తే ఒక విధమైన భయం ప్రారంభమయింది. కోడలు ముఖం చూడగానే ఆమెకు ప్రేమ పొంగిపోయేది. కొడుకూ కోడలూ ఒకచోట ఉంటే, ఎప్పుడేమంటాడో అని ఆమె ఏదైనా పనిమీద పంపేసేది. మధుసూదనరావు భార్యను అసందర్భంగా తప్పులు పట్టేవాడు. తప్పుకాదని లీలవైపున తల్లి వాదనకొస్తే అతను పశ్చాత్తాపపడక "అయితేమాత్రం?" అనేవాడు.

కొడుకూ కోడలూ వచ్చి ఇరవై రోజులయింది. హనుమాయమ్మకు కోడలంటే ప్రాణమయిపోయింది. ఇప్పుడామె కోడలి విషయం అందరితో చెప్పటం "ఏమోననుకున్నాను. దానికి పాపం నోట్లో నాలిక లేదమ్మా." అని.

ఒకరాత్రి మధుసూదనరావు భోజనం చేసి ఎక్కడికో వెళ్లేడు. ముఖం మటమటలాడుతూ ఆరోజల్లా అతను భార్యమీద మండిపడుతూనే ఉన్నాడు.

హనుమాయమ్మ మనస్సులో ఏదో దిగులు బయలుదేరింది. పదిగంటలయింది. లీలావతి వెళ్లి పడుకున్నది. అరగంట గడిచింది. చరచరా మధుసూదనరావు ప్రవేశించేడు.

"అమ్మా!"

"ఎక్కడికి పోయినావురా? నాయనా!"

"ఎక్కడికీ లేదు కాని నాకు బయట మంచం వేస్తావా?"

"అదేమిట్రా?"

"నేను లోపల పడుకోలేకుండా ఉన్నాను — దోమలు!"

"చా! అన్నీ పట్టిదే! వెళ్లి పడుకో!"

"నీకు తెలియదమ్మా!"

"ఒకసారి ఇట్లా కూర్చో!" మధుసూదనరావు తల్లి మంచంమీద కూర్చున్నాడు.

హనుమాయమ్మ పదేళ్లకుమల్లే కొడుకు తల చేత్తో నిమురుతూ, "పాపం, దాన్నెందుకురా మరీ అంత వ్యధ పెట్టటం. నిజంగా అది చేస్తున్న తప్పొకటి చెప్పు! అది ఎంత అమాయకురాలు! చిన్నప్పుడెంత నెమ్మదిగా ఉండేవాడివి! ఆ నెమ్మది ఏమయిపోయిందిరా? నాయనా! నామాట వినవూ?"

"వింటాను!" అన్నాడు మధుసూదనం. అతని కళ్లు నీళ్లతో నిండినాయి. అటువంటి తల్లి! ఆమెను మోసగించవలసి రావటం! లేకపోతే ఈ విరుద్ధసాంప్రదాయాలు ఏవిధంగా కలవను?

"జల్లిలో పలపడుకో!"

మాట్లాడకుండా మధుసూదనరావు లోపలికి వెళ్లేడు. లీలావతి మంచంమీద బోర్లాపడుకున్నది.

మధుసూదనం ఆమెను వెల్లికిలాతిప్పి "లీలా! ఏమిటది? ఏడుపే? నాకు నిజంగా కోపంవచ్చిందనే? నువ్వు నిజంగా అంతఅమాయకురాలివా?"

లీల కళ్లుతుడుచుకుంటూ "అదికాదు. పాపం ఆమెతో ఎలా అబద్ధాలాడేరు? అంత మంచిమనిషి లేరు. మీరు ఒంటరిగాఉంటే నన్నింకా కోప్పడతారని ఈసారి ఆమెకూడా మనతో వస్తానన్నారు."

"ఛేష్! నేను చెప్పలేదూ నాఉపాయం పారుతుందని?"

"ఇక మీఉపాయం మాని నేను చెప్పినదికూడా చేసిచూడండి!"

"సరేఅయితే!" అంటూ మధుసూదనరావు భార్యను చేతుల్లోకి తీసుకుని ముద్దుపెట్టుకున్నాడు.

## కుసుమాకుమారి

మునుమూరి పేరయ్యశాస్త్రిగారు

జనులకుముక్తినిచ్చుటకు జన్మముఁబొందిన దేవదేవుడే
యనుటకుచాతురత్వము సమంచితభావము ముక్తిమార్గమ
కనులకుగట్టుచందముసఁగల్గఁగ మాహరనాథపత్ని ని
న్ననయముగొల్చి మ్రొక్కెద మదంబరో! నన్నుకృతార్థజేయుమీ!

సోనాముఖీపురీశోభాయమానంబు వెలుగొంద నచ్చోట వెలసినావు
నీదులీలలుఁజూపి నీవెలక్ష్మివియంచు దెలుపఁజేసినయట్టిధన్యవీవు
భక్తిమార్గముజూపి భక్తులనెల్లర గారవించినయట్టికాంతవీవు
నాస్తిక్యభావంబు నాశమొందగఁజేయ జన్మమొందినయట్టిజననివీవు
వేయిమాటలదేలనో వినుముతల్లి
ప్రజలపాపంబుదీర్పగా భర్తతోడ
ఇలను కుసుమాకుమారివై యిట్టితతుల
వెలసియుంటివినీవు నావేల్పుతల్లి!

సిరివయియుండిదేశమున శీలతబొందగలేదటంచు మ
మ్మరయగ ముక్తినిచ్చుటకు మాకుసుమాకుమారివై
నిరతముభర్తతోడ దివినింవెలుగొందకకొన్నినాళ్లు యీ
కరణిగకాలముంగడుపగా మముసేలెడి తల్లిగావుతన్.

తల్లీ! గావుము నీపద
సల్లాపంబులెనిజంబు జన్మతరింపన్
యిల్లాలివి హరనాథకు
గొల్లంననుగావుమింక కుసుమకుమారీ!

ఎందేదైవముగగ్గెనంచు భువిలోనేదైవప్రత్యక్షముం
బొందజాలనిమాదుబోంట్లకు సుఖంబున్ గండ్లకుంగాంచు నిన్
డెందంబందుననిల్పి మానసికధాటిన్ గొల్వలేకింక నీ
మందాలంకృతమోహవస్యులమె నీమాహ్యజన్మార్థముల్.

# "ముష్టి"

జి. రామస్వామిశాస్త్రి గారు

వెర్రివెయ్యివిధాలు అనిపెద్దలు చెబుతారు. నామతానికి ముష్టి మూడువేలవిధాలని తోస్తుంది. నవ్వకండి. మీామనస్సులు నొవ్వనియ్యకండి. నేను నెయ్యమే ప్రధానముగా నీవ్యాసము వ్రాస్తూన్నాను. నామీాదకయ్యానికి రాకండి. 'ముష్టి' అంటే ఏమిటో తెలుసునా మీాకు? ఒకవ్యక్తినుండి మరియొకవ్యక్తికి ఉచితంగా పొందు ద్రవ్యవస్తురూపకమైనఉపకారము. దీనిని అవలంబించుట చాలకష్టము. ఇప్పుడు ప్రపంచంలో అందరికన్నా లోకువెవరు? ముష్టివాడు. వాళ్లూకొన్నిచోట్ల తిరుగబడుతున్నారులెండి. ముష్టివాళ్లను జనాభావేస్తే ఎంతసంఖ్యవస్తుందో మీారొకసారి ఆలోచించుకోండి. ఇంతమంది ముష్టివాళ్లుండడానికి కారణం మనకెందుకుగాని వాళ్లనిగురించి కొంచెం చెబుతానువినండి. ముష్టివాళ్లు ఎవరు? ఎట్లాఉంటారు? ఎప్పుడువస్తారు? ఎందుకువస్తారు? వీట్లకి సమాధానం ప్రతివారు చెప్పకలరా?

ముష్టివాళ్లు అనేకరకాలు. వీధులవెంట 'అమ్మగారీయిల్లు ధర్మలోగిల్లు' అంటూ సంచులు బుజాన్ని వేసుకొని కర్ర గడ్డంక్రింద పెట్టుకొని వచ్చేవాళ్లొకరకం. 'వెందుకైనవ్రుంచీ నావూబ్రందికానలో' అంటూ చినిగిన పట్టుపంచి నడుముకి చుట్టుకొని శెమ్మాకొయ్య, చిరతలు వగైరాపట్టుకొని వచ్చేవాళ్లు మరొకరకం. కరక్కాయి, జీడిగింజలు, సూదులు అమ్ముతూ ముష్టిఎత్తే మనుష్యులు వేరొకరకం. 'దశరథనందన సీతారాం, జానకిరమణా సీతారాం' అంటూ గ్యాంగుకిందబయలుదేరి డబ్బిచ్చినదాకా కొట్టుకిఅడ్డనించునేవాళ్లొక రకం. గంటకొడుతూ కావిడిబుజాన్ని పెట్టి 'అన్నంకూర వగైరావేయువచ్చు' అనేవాడొక రకం. ఒళ్లుకరుచుకునే వాడొకడు. త్రాడుపుచ్చుకొని డబ్బిచ్చిందాకా కొట్టుకునే వాడొకడు. బళ్లకడ్డంగా బజారులో ప్రాకుతూ ముష్టిఎత్తేవాడొకడు. వీళ్లందరు సాధారణమైన ముష్టివాళ్లు.

ఇంకొకరకం చూడండి. గుమ్మందగ్గరకొచ్చి ముష్టి అడుగడు. 'సీతారామాభ్యాం నమః,అమ్మా!యీావాళ ఫలానా ఫలానా'అంటాడు. మనంముష్టి పెడతాము. అమ్మాఅనడం ఎందుకంటే తల్లి ముష్టిబాగా పెడుతుందిట. అందుకనే ఉపనయనంలో తండ్రిముష్టికంటే తల్లిముష్టి ముఖ్యమట. చూడండి బ్రాహ్మణులకు అప్పటినుండీ ముష్టిమొదలు. ఇది మత సంబంధమైనముష్టి. 'పంతులూ పొడుముచేశావా?' అనిగాని 'పొడుముకాయతీసుకొని వచ్చేవా?' అనికాని అడుగుతారు. పొడుముచేస్తే వారికేమి? చెయ్యకపోతేవారికేమి? దాని అర్థంపొడుముకావాలన్నమాట. 'బ్రదర్!గుడ్మార్నింగ్. కాఫీపుచ్చుకున్నావా? వెడదామా?' అంటేపై దానివలెనే కాఫీయిప్పించుమని అడగడం. పిల్లవాడికి వివాహంచేసుకుంటాననో, గుడి కట్టిస్తాననో చందాలువసూలుచేయుడం, ఆచందాసొమ్ము నూటికి నెలకు రు 3-2-0 చొప్పున

వడ్డీకి వెయ్యడం. ముష్టిఎత్తి గుడికట్టిస్తేనేగాని ముక్తిలేదా? ఇది అసాధారణపుముష్టి. పని కట్టుకొని పంతులుగారింటికి వెడతాడు ఒకశ్రఘంఘు. 'ఏమోయి!పనిమీదవచ్చేవు?' అంటారు పంతులుగారు. 'అబ్బే ఏమిలేదండి చూచిపోదామని వచ్చేను' అంటాడుశ్రఘంఘు. తరువాత బాతాకానీలో ఏదాలాభంగా 'యీవాళ రామనాథశాస్త్రి సంజీవరావు సావిత్రిటండి' అంటాడు. దీనర్థంతీసుకొనివెళ్లమని. ఇదిమోడరన్‌ముష్టి. శర్మ 'ఒరే!సూర్యం! యీబంగినిపల్లి పళ్లు చాలాబాగా ఉంటాయిరా. మొన్న డజనుపళ్లు తీసుకున్నాను. యీవాళ ఎలా ఇచ్చేరు' అంటాడు. సూర్యం డజను రు 3/చొప్పున పట్టుకొనివెళ్లుతుంటాడు. పైదాని అర్థం మీరుకనిపెట్టినారా? మొన్న శర్మ పళ్లుకొనలేదుకాని ఇప్పుడు సూర్యందగ్గర ఒకటో రెండో పళ్లు లాగాలని యీఎత్తు. ఇది లౌక్యమైనముష్టి.

ఇంకా చాలారకాలు ఉన్నాయి. అవన్నీ చెబితే గ్రంథం చాలాఅవుతుంది. కాబట్టి కొన్నిమాత్రమే వ్రాస్తాను.

ఆఫీసులో ఒకనికి మంచిపనిఉన్నకాగితంకావాలి. 20 సార్లు అడుగుతాడు. గుమాస్తాగారు: 'యేమిటయ్యా! ఇప్పుడు అర్జంటు పనిఉన్నది. మళ్లీరావో' అంటారు. మళ్లీ వచ్చాకా 'వీలవలేదు. దొరగారికి కాగితం అర్జంటుగాపంపాలి' అంటారు. ఈయన ఒక దూటబిళ్ల తెచ్చి'హిరణ్యరూపస్య'అంటే కాగితంతక్షణంవస్తుంది.దొరగారూలేదు.అర్జంటూ లేదు. దీనికేమి పేరుపెడదాము? అదిమీరే ఆలోచించుకోండి. ఆముక్కమీరే వేసుకోండి. ఇది—ముష్టి. మళ్లీమీకు జ్ఞాపకంచేస్తాను. ఇది చమత్కారానికి వ్రాసేనుగాని ఎవరిని ఉద్దేశించివ్రాయలేదు. కోపముంచకండి. మనలో మనమాట. ఇటువంటివి ఇప్పుడంతటా జరుగుతూనే ఉన్నాయి. 'ఏమండోయి! మామగారు! ఆకాగితంమనదగ్గరలేదు. ఆగుమాస్తాగారి దగ్గరఉన్నది. మనదగ్గరఉంటే మీకేమి అభ్యంతరం. అగుమాస్తాగారికి కొంచెంభ్రమఉంది. రెండేనాళ్ల స్తేనేగాని 'బాగుండదు' అనిచెప్పి నమ్మించి కొంచెంపరిచయం, మొహమాటం ఉన్నవాళ్లదగ్గిర తీసుకుంటారు. ఇదిమొహమాటంముష్టి.

అన్నిటకన్న శిరోమణిలాంటిది ఒకటిచెప్పి ఇంకచాలిస్తాను. క్లబ్బులు వగైరాలో పదిమంది పెద్దలు బల్లచుట్టూ కుర్చీలమీద కూర్చుంటారు వారందరివలె ఈయన సూటు, హ్యాటు వేసుకొనివస్తాడు. కుర్చీలో కూర్చుంటాడు. తక్కినవారి హ్యాటులు బల్లక్రిందనో, హ్యాటుస్టాండునో పెడతారు. ఈయన హ్యాటు బల్లమీద పెడుతాడు. న్యూస్ పేపరు అందరిలాగా చదువుతూ పంట్లాము జేబులోనుంచి లైసెన్సు తీసిచూపిస్తాడు. ఎవరికి తోచినది వారుహ్యాటులో వేస్తారు. వేసిందాకా పేపరుచదువుతాడు. వేయడంఅయిపోయిన తరువాత పేపరు బల్లమీదపెట్టి, డబ్బు జేబులోపెట్టి, హ్యాటు నెత్తినిపెట్టి, వారందరకు సలాం పెట్టి నడుస్తాడు. ఇదిలైసెన్సుముష్టి. ఇంతటితో విరమించి ఇంకాపీలైతే మరొకసారైనా వ్రాస్తాను. క్షమింపుడు.

# గృహజ్వాల

దువ్వూరి వేంకటేశ్వరశర్మగారు

౧

సత్యప్రకాశుని జన్మోత్సవమందు వానితండ్రియగు లాలా దేవప్రకాశుడు చాలాద్రవ్యముఖర్చుపెట్టి బంధువులు, మిత్రులు, ఇతరగ్రామస్థులను ఆదరించి ముదమునొందెను. సత్యప్రకాశునకు బాల్యప్రాయములోనే విద్యాభ్యాసము మొదలిడిరి. అనుదినము పాఠశాలకు వెళ్లుటకు, సాయంకాలము షికారుతిరుగుటకు ఒక చిన్న యానముయేర్పడెను. నౌకరుపిల్లవాడు అతనిని పాఠశాలకు శ్రద్ధాభక్తులతో తీసుకొనివెళ్లి సాయంకాలము మరల గృహమునకు తోడ్కొనివచ్చుచుండెను. బాలుడు యెంతో గుణవంతుడు; సుందరమైనస్వరూపముగల వాడు. పున్నమచంద్రునివలె గుండ్రనిమోము, విశాలమైనమస్తకము, నీలకమలములవంటి నేత్రద్వయము, పండినలేతతమలపాకులవంటి అధరము, పుష్టిగా యుక్తమైన శరీరసౌష్ఠవముతో సొంపారుచుండెను. ఆతనిని చూచినవారినోటినుండి "దీర్ఘాయుష్మాన్ భవ" అనే ఆశీర్వచనాత్మకవాక్యములు నిష్ప్రయత్నముగానే వచ్చుచుండెను. ఈవిధముగా నిత్యాభివృద్ధిపొందుచుండెను సత్యప్రకాశుడు.

వర్షాకాలసమయమున గంగానది అతిఘోరఝంకారవముతో ఉత్తుంగతరంగములను చూపుచూ అతి గర్వముగా, ఎదుటఉన్నవారిని నిర్లక్ష్యబుద్ధితో సులభముగా తొలగించుచూ తన ఐశ్వర్యము చూపుచుండెను. దేవప్రకాశుడు తనప్రియురాలయిన నిర్మలనుతోడుకొని ఒకపర్వదినమున గంగాతీరముచేరెను. నిర్మల అనిర్మలమైన ఆజలములో సంతోషముతో ఉప్పొంగుచూ జలక్రీడలుసలుపసాగెను. కొంత సమయానంతరమున దేవప్రకాశుడు భార్యను స్నానము ముగించమనగా ఆమెకు వినువుతీరక "నేను గొంతుకలోతు నీళ్లలోకి దిగి నిర్భయముగా స్నానముచేయగల"నని జవాబుచెప్పి లోతునీళ్లలోకి దిగెను. భర్త అనేక సారులు మందలించెను కాని మృత్యుదేవత తలపైతాండవమాడుసమయమున ఆమాటలనామె ఏలపాటించును? ఒకక్షణములోనే జలక్రీడ మృత్యుక్రీడాయెను. ఈతరాని ఆయబల ఒకసారిమునగగానే ధారావేగమునకాగలేక ఒక్కకేకవేసి సర్వకాలమునకు తరంగములతో క్రీడించుటకుబోయెను. దేవప్రకాశుడు నీటిలోదుమికి వెతకసాగెను. కాని వ్యర్థము. పల్లెవాండ్రును ఇతరులును వెతికివెతికి నిరాశులైరి.

దేవప్రకాశుడు ఇంటికిరాగానే కొమారునిజూచి దుఃఖముపట్టజాలక అతని కౌగలించి దుఃఖింపసాగెను. తండ్రివాలకముజూచి సత్యప్రకాశుడు "అమ్మ యేది?" అని ప్రశ్నింపగా ఆమెను "గంగాదేవితో కేళీవిలాసము సలుపుటకు ఉంచివచ్చితి"నని జవాబుచెప్పెను. కొంతసేపు బాలుడు తండ్రిముఖము వీక్షించుచుండి భావముగ్రహించి "అమ్మా! అమ్మా!" అని యేడ్వసాగెను.

౨

మాతృహీనుడైన బాలుడు సర్వజనులకు ప్రియమైనప్పటికిని దీనుడే. ఎంత ధనహీనసంసారములో ఉన్నప్పటికి తల్లిఒడియందు ఆమె ప్రేమసాగరములో ఈదులాడుచూ జీవనముగడుపువాడిజన్మ ఆనందమయమని నమ్మవచ్చును. కాని సత్యప్రకాశునికి ఈసుఖవంచనమేకాక దైవాధారముకూడా దూరమాయెను. ఈశ్వరునకుకూడా ఈ తల్లిలేనికొడుకుయందు అసహ్యముకలిగెను; అందుచే తల్లిలేని ఆశిశువు రెక్కలేనిపక్షివలె నుండును.

సత్యప్రకాశుడు ఏకాంతప్రియుడాయెను. అతనికెల్లపుడు ఒంటరిగాకూర్చొనుట, తిరుగుట, నిశ్శబ్దమైన కాననమందు వనలక్ష్మితో తన హృదయవేదన వెల్లడించుచూ కాలముగడుపుట అభ్యాసమాయెను. తల్లి

ప్రేమ లేనపుడు సకలసంసారమునందుకూడా విరక్తిగల్గెను. తండ్రిహృదయమందుకూడా సత్యప్రకాశునికి నిర్మించిన స్థానము తొలగెను. అతడు ఒక నూతనసంసారముయొక్క సుఖస్వప్నమును చూచుచుండెను. లోకములో ఎచ్చటనైనా భిక్షుకుని నిరాకరించేవారు కాన్పడెదరుగాని ప్రేమించు తత్వజ్ఞానులు కాన్పడరు.

ఇట్లు ఆరుమాసములుగడచెను. ఒకనాడు సత్యప్రకాశుని ముఖమండలము గ్రహణమువిడచిన చంద్రునివలె కాంతినొందెను. సంతోషము మరల వసంతవృక్షమువలె పత్రపుష్పాదులతో ప్రకాశించెను. కారణమేమి? ప్రేమచే మర్మాహతుడైన సత్యప్రకాశుడి హృదయతటాకము మరల నవాగతమాతృప్రేమ జలపూరితమాయెను. తాను మరల తల్లిప్రేమకు పాత్రుడగునని తెలిసి సంతోషమునొందెను. తాను పోగొట్టుకొన్న అపూర్వజీవనము మరల కాన్పడునని తలచెను. పూర్వమువలె తల్లి తన్ను ప్రేమించి, ఎత్తుకుని, అన్నము తినిపించి, సంరక్షణచేయుననియు తాను ఈసారి తల్లితో ఏవిషయమునుగుఱించియు అధికప్రసంగముచేయక ప్రేమపాత్రుడగుదుననియు తలచెను. వాని ఆనందసాగరమందు అనేకకల్పనాతరంగములు లేచి మరల పడిపోవుచుండెను. నూతనమాత ఇంటికివచ్చుటకుపూర్వము అనేకఉత్సవములుజరిగెను. సత్యుడు వానినన్నింటినిజూచెను. క్రొత్త విలువైన దుస్తులు అనేకముస్తాబులతో కొంతకాలముగడిపెను. తల్లినిచూచి సంతోషించెను. సుందరలావణ్యమయమైన శరీరము కాంచనభూషణములతో అలంకరించబడెను. ఆమె కొంగుపట్టుకొని సత్యుడు సంతోషముతో 'అమ్మా!' అని గట్టిగా అనెను. ఎంతకాలమునకు అతడు "అమ్మా!" అనుశబ్దమును ఉపయోగించక ఇదేసమయమని తలచి మరీగట్టిగా 'అమ్మా' అనిఅరచెను. ఆశబ్దములోఉన్న మధురిమ, ప్రేమ, శక్తి, ఆనందము వర్ణించతరముకాదు. కాని హా! ఏమి వైచిత్ర్యము? ఈశ్వరుడు మానవునితలంపులు ఎల్లకాలము దీర్చడు. మనుష్యుడు ఒకటితలచిన దైవము మఱియొకటి తలచుచుండును. అసుందరాంగికి ఈమధురశబ్దము కఠోరకుఠారాఘాతమువలె తగిలెను. ఆమెకు ఈసంబోధన అసహ్యమాయెను. ఆమె యౌవనముయొక్క సుఖస్వప్నములను చూచుచుండెను. ఉప్పొంగివచ్చుకోపము నాపుకొనలేక ముఖముచిట్లించుకొని "నన్ను అట్లు పిలువవద్దు" అని పలికెను.

సత్యప్రకాశుడు అత్యాశ్చర్యముతో ఆమెవైపు చూచుచూ నిర్ఘాంతపోయెను. తన కల్పనాశక్తిచల్ల నిర్మించిన మేడలు ఇసుకగోడలవలె కూలిపోయెను. దుఃఖము పొర్లిపొర్లివచ్చెను. అశ్రుబిందువులే దానికి సాక్షి. పెళ్లికూతునిముసలమ్మ పిల్లను మందలించి "అట్లు చేయవద్దు. పిల్లవానిహృదయమునొచ్చు"నని బోధించెను. కాని ఆదేవప్రియమాత్రము తనకి "అమ్మా!" అను సంబోధనముకూడదని చెప్పి వెళ్లిపోయెను.

## 3

ప్రపంచములో 'సవతి' అన్నశబ్దమే కర్ణకఠినముగానున్నది. కారణము తెలియదు. అందులో ఉన్న అసహ్యము, దురభిప్రాయము దానిని దరికిచేరనీయదు. అందులో సవతిపిల్లలగతి ఇక చెప్పనక్కరలేదు. దేవప్రియ ఎట్లనో కొంతకాలము అట్లనె గడపెను. తాను గర్భిణి అవునంతవరకు సత్యునితో అపుడపుడు మాటలాడుచూ కన్పడెనుకాని ఇప్పుడు అదియు అరుదాయెను.

సుఖదుఃఖములు త్రాసుపళ్లెమువలెనుండును. ఒకచోటనే రెండును హెచ్చుచూ తగ్గుచుండును. సత్యప్రకాశునికి తమ్ముడు గల్గెనని సంతోషము నాలుగురోజులనుండి ఉండెను. కాని తమ్ముని మోముచూచుట లభించలేదు. ఒకనాడు తల్లిఒడిలోఉన్న బాలునిచూచుటకు ఈతడు అతిఉత్కంఠతోవెళ్లి పైనకప్పినబట్ట తీసెను. వెంటనే పుట్టలోఉన్న త్రాచువలె బుసకొట్టి ఆమె "నిద్రపోతున్నవానిని లేపకు" అని కసరెను. బాలుడు సత్యప్రకాశుడు ఏమిచేయగలడు? ప్రపంచకలక్షణములు తాను ఏమియు నెరుగడు. ఈవ్యవహారములు చూచి తనకు శాంతినిచ్చేది తన ఏకాంతస్థానమని తలచి అక్కడికివెళ్లి కన్నీరుచే వచ్చినదుఃఖమును కడుగు

కొనెను. తమ్మునియందు ఉన్న ప్రేమచూపుటకుకాని, తాను శిశువును ఎత్తుకుని ముద్దులాడి అభిలాషతీర్చుకొనుటకుగాని వీలులేకపోయెను. మరియొకనాడు ఉదయము తల్లి గృహకృత్యములు చేయుచుండగా సత్యప్రకాశుడు గదిలో పరుండియున్న బాలునిద్దగ్గరకుపోయి తనకరువుతీరినట్లు ముద్దులాడి ప్రేమాశ్రువులు వాని బుగ్గలపై రాల్చి ఇన్నాళ్ళకు లభించినఫలమును త్వరలో వీడలేక ఎత్తుకొని ఆడింపసాగెను. బాలుడు తనకూడా ప్రేమచూపించుటకు ఏడ్పుతప్ప వేరే మార్గములేదని తలచి ఏడ్వసాగెను. ఇంతలో తల్లివచ్చి కోపాగ్నిలో రెచ్చిబారి, సత్యుని నిర్బంధించి అవతలికి లత్తమిచ్చి చెను. శిశువుయందు ప్రేమచేతనా ఆమె సత్యుని వానిదగ్గరకుచేరనీయదు? కాదు. కారణమువేరు. ఈపిర్యాదు తండ్రివిని శిశువును ఏలయేడ్పించితివని సత్యప్రకాశుని అడిగెను. అతడు "నేను ముద్దులాడుచుండగా అతడు ఏడ్చెను. నేను కొట్టలే"దని జవాబుచెప్పెను. అతనిపలుకులు అబద్ధమని తండ్రి వానిని తాడించెను. ప్రేమకు మూలమునందు పుట్టిన ఈ తాడనరే సత్యప్రకాశుని జీవనమునకు మార్పుగల్గించినదాయెను.

## ౪

మార్పు త్వరలోనే కావచ్చును. నాశనముకూడా త్వరలోనే కావచ్చును. ఆనాటినుండి సత్యుడు ఇంటిలోఉండుటకుకూడా అసహ్యముకల్గి పరాయివానివలె ఆకలివేసినపుడు భోజనమునకు ఇంటికివచ్చి వెళ్లిపోవుచుండెను. ఎక్కడఉన్నది, ఎక్కడపడుకొన్నది విచక్షణ తలిదండ్రులకుఅనవసరమాయెను. చదువుకూడా పూర్తిఅయెను. కట్టుకొనుటకు బట్టలుకూడాదొరుకుట అరుదాయెను. అయినారి వీధులే అతని నివాసస్థానములాయెను. క్షుద్రవర్గమునుయావత్తు మిత్రవర్గమాయెను. మలినవస్త్రములు, దుర్భాషలు మొదలైన దుర్వ్యసనములు అభ్యాసమై చరిత్రము మారిపోయెను. ప్రజలుకూడా నిందింపసాగిరి.

ఈలోనితమ్ముడు జ్ఞానప్రకాశుడు గురువువద్ద విద్యాభ్యాసము చేయుచుండెను. సత్యునిహృదయము మరుభూమివలె ప్రేమహీనమైపోయెను. కాని అందులో తమ్ముడుపయిఉన్న ప్రేమ ఒకపచ్చనిబైలువలె మెరయుచుండెను. ప్రేమాభివృద్ధి ఉభయదిక్కులయందు సమానముగా పెరుగుచుండెను. జ్ఞానుడు తనతలిదండ్రులతో సత్యునికి బట్టలు మొదలగునవి ఇమ్మని పోరాడుచుండెను.

ఒకనాడు తండ్రి సత్యునిపిలిచి పాఠశాలకు పోకపోవుటకు కారణము అడుగుచుండెను.

దేవ:—సత్యమా! నీవు స్కూలుకు ఎందుచేత వెళ్లుటలేదు?

సత్యః:—స్కూలులో జీతముకట్టనందున జుర్మానా వేసినారు; సొమ్ము బాకిఉండుటచేత క్లాసుకువెళ్లనను ఉండనిచ్చుటలేదు.

దేవ:—జీతము ఏల యివ్వలేదు?

సత్యః:—క్రితంసారి జీతము ఇచ్చేసమయమున చందాదారులు కొందరువచ్చి అడుగగానే నేనువారికి ఇచ్చితిని.

దేవ:—నీవు జీతముకట్టక చందా ఏలయిస్తివి?

సత్యః:—తమ్ముడు ఇచ్చినపుడు నేనును అడుగగా లేదనిచెప్పలేక, చెప్పినను మీకు అవమానమని తలంచి ఇచ్చివేస్తిని.

దేవ:—వాడికి నీకు సాటెట్లు? వాడినిచూచి నీవు ఈర్ష్యనొందుచున్నావు. నీకు నేను ఇక చదువు చెప్పించలేను. ఒకక్లాసులో రెండుమూడేండ్లు ఉన్న డబ్బు ఖర్చుపెట్టుటకు నాకు శక్తిలేదు. నీకు చదువుయందు జ్ఞానుడికున్నంత శ్రద్ధయైనలేదు.

సత్యః:—చదువు నాఅదృష్టంలోనే లేదు. ఏమిచేయను?

దేవ:—నీ అదృష్టంలో మరి ఏమి ఉన్నది?

సత్యా:—ఈస్థితిలో 'ముష్టి' తప్ప వేరే ఏమిలేదు.

దేవ:—అట్లయిన నీవు ఈరోజునుంచి ఆపనే చేయుము; నీగుణములుకూడా మారినవి. రేపటినుండి స్కూలులో పేరు కొట్టివేయించెదను.

ఇంతటిలో లోనుండి దేవప్రియ వచ్చి రాజుతున్న అగ్నిలో నెయ్యిపోసి జ్వాలచేసెను. ఆమె ఇట్లు అనెను:—నీవు సిగ్గులేక మాటకు జవాబుచెప్పుచున్నావా?

సత్యా:—(ఇట్టిమాటలు సహించలేక) నాకు దిక్కుఉన్ననూ దిక్కులేని అనాథులవలె అయిపోతిని. నాకు భిక్షాటనే జీవితోపాధి అయినప్పుడు ఇట్టిసుఖము ఏల అనుభవించుదును?

దేవప్రియ:—రోజా ఏమి అనలేక ఊరకుండుటచే పౌరుషము ఎక్కువయినది. నీమాటలు నేను సహించలేను.

దేవప్రకాశుడు కోపముతో వెళ్లిపోయెను.

ఈచిత్రకథ సత్యప్రకాశుని ఆత్మకు ఒకపాఠము నేర్పెను. వాడు ఇక ఒకనిమిషమైనా అచ్చటనిలుచుటకు ఇచ్ఛలేక ప్రయాణము నిశ్చయించెను. వయస్సుకూడా 16 వత్సరములాయెను. ఇట్టిజీవితముకన్న ఎచటనైనా పనిచేసుకొనిసంపాదించుట మేలనితలచి ఒకనాడు మధ్యాహ్నము అందరునిద్రించుచున్న నిశ్శబ్దసమయమున సత్యప్రకాశుడు తమ్మునివద్దకువచ్చి "వెళ్లివచ్చెద"ననెను. జ్ఞానుడు దుఃఖముతో కన్నీళ్లుకార్చుచూ "ఎక్కడికి? నీవువెళ్లవద్దు. అమ్మతో చెప్పెద"ననెను. సత్యుడు వానిని ఓదార్చి "నీవు చెప్పనవసరములేదు. అట్లు చేసిన నీకు తెలియకుండా వెళ్లిపోవలసివచ్చును. నాఅదృష్టమునునిరీక్షించుటకు వెళ్ళుచున్నాను. ఎచ్చటనైనా స్థిరపడిన నీకు తెల్పెద"ననెను. ఇట్లుప్రసంగించి సోదరునికౌగలించుకొని వీధిబాటను నడచిపోయెను. జ్ఞానుడు అతడు అదృశ్యుడగువరకు అటుచూచుచుండెను. ఏమిచేయగలడు? జీవితము దైవాధీనము.

ఇట్లు బయలుదేరి కొన్నిరోజులకు సత్యప్రకాశుడు కలకత్తాజేరెను. కొద్దిరోజులు ఎచ్చటనోగడిపి ఒక తపాలాఫీసువద్ద ఉత్తరములువ్రాసి డబ్బుసంపాదించుటకు మొదలుపెట్టెను; కొద్దిదినములు రోజుకు ఒక రూపాయవరకు సంపాదించెను. మరల కొంతడబ్బును వంటవండుటకు, తిండికి ఖర్చుపెట్టి తక్కినసొమ్మును పోగుచేసి ఒక చిన్నచిల్లరసామానులదుకాణము తెరచెను. దానితో కాలముగడుపుచూ ఇతరస్నేహితులతో తిరుగుచూ దుకాణముమీదవచ్చిన డబ్బుఅంతా సొదరుకు ఖర్చుపరచుచుండెను. తాను ఇట్లు బ్రతుకుచున్న సంగతి తమ్మునకు స్కూలువిలాసమునకు ఒకపత్రముపంపెను.

ఇట్లుఉండగా అతనికిఒకనాడు తమ్మునికి ఏదైనా కానుకపంపుదమని ఆలోచనగల్గెను. దానికి డబ్బు కావలసి తాను సొదరుఖర్చుమాని తిండికికూడా మితమైనఖర్చుచేసి నాలుగు నెలలకు 50 రూపాయలు పోగుచేసి ఒకగడియారముకొని పంపెను. ఆదినము వానికిగల సంతోషమునకు మితిలేదు. ఆకానుక తమ్ముడు పుచ్చుకొని ఎంతసంతోషించునో అది ఆలోచించుకొనుచూ తానుకూడా సంతోషభరితుడాయెను. నిస్వార్థమైన ప్రేమసౌఖ్యము వర్ణనాతీతము. కాని ఒకక్షణాంతరమందు తన తలిదండ్రులు జ్ఞప్తికివచ్చి విచారసాగరములో కూలెను. ముఖ్యముగా సత్యుని ప్రాణాధారము జ్ఞానప్రకాశుడే అని చెప్పవచ్చును. అతనిజీవమే ఇతని జీవాధారమువలెనున్నది. అతడులేనిచో ఎంతకాలమునకుపూర్వమునో ఈతడు అంతరించి ఈప్రపంచకమునే విసుగుచెంది వదలియుండును.

## ౬

ఒకనాటిసాయంకాలము దేవప్రకాశుడు తనభార్యతో జ్ఞానుని వివాహముగురించి మాట్లాడుచుండెను. జ్ఞానుడుకి అన్నగారికి వివాహముకాకపూర్వము చేసికొనుటకిష్టములేక అయిదువేలరూప్యములు కట్నమునిచ్చుటకు సిద్ధముగానున్న సంబంధమునుతిరగగొట్టెనని తల్లికి కోపమువచ్చెను. "జ్యేష్ఠపుత్రుడు కలకత్తాలో వివాహమాడి సంసారనిర్మాణముజేసియేయుండును. కావున ఆతనికి వివాహముజేయుట అనవసర"మని తల్లి పలికెను. జ్ఞానుడికికోపమువచ్చి లేచిపోయెను. ఎంతబోధించినను తనమాట జ్ఞానుడు తప్పలేదు.

ఏమియు ఉపాయముతోచక సత్యుడిని రమ్మనమని ఉత్తరంవ్రాయుటకు దేవప్రకాశుడు నిశ్చయించుకొనెను. కాని ఇదివరకు యెన్నడు ఒకఉత్తరమైనావ్రాయనందున ఏమితలచునో అనేసిగ్గుచే వకసారి వెనుకకుతగ్గెను. కాని మరల తానుచేసినతప్పుకు క్షమార్పణకోరుచూ తనుపిల్చుటచే వచ్చుటకు ఇష్టములేకపోయినను జ్ఞానుడి ప్రేమకొరకైనను ఈవివాహబంధనములోపడుటకు నిరోధించి ఉత్తరమువ్రాసెను.

సత్యుడు ఈపత్రముచూచుకొని ఏమిచేయుటకును నిశ్చయించలేకపోయెను. చివరకు తండ్రిపేర ఒక ఉత్తరము, తమ్మునిపేర ఒకఉత్తరమున్ను వ్రాసెను. అందున తండ్రి ఇంతకాలమునకు తన్ను తలచినందుకు సంతోషించినట్లు, తమ్ముడి వివాహము తను రాకపోయినను తప్పక చేయమనిన్ని, తానువచ్చుటకు వీలులేకపోయినందుకు క్షమించమనిన్ని, ఉత్తరముతో పంపిన అయిదువందలరూపాయలు తమ్ముడికి కానుక ఇమ్మని వ్రాసిపంపెను. తల్లిగారికి నమస్కారములుకూడా వ్రాసెను.

ఈఉత్తరముచూచుకొని దేవప్రకాశుడు సిగ్గు, గ్లానితో పీడితుడై దుఃఖించుచుండగా భార్యవచ్చి "విషకుంభపయోముఖం" అన్నమాటను సమర్థిస్తూ సత్యుడి ప్రేమ కేవలము డాంబికమనిచెప్పి ఆ విచారభావమును తొలగించెను.

జ్ఞానప్రకాశుడు తనపత్రము చూచుకొని, దుఃఖించి, కలకత్తావచ్చి అన్నగారిని తీసుకవెడుదమని ప్రయాణమాయెను. కాని తలిదండ్రుల ఆగ్రహమునకు మీరలేక మానివేసెను. పైగా తల్లి ఆమె బ్రతికినంతకాలము వాడు ఇల్లుకదలనని ప్రతిజ్ఞ చేయించుకొని బంధునిగాచేసెను.

ఇట్లు కొంతకాలముగడచెను. జ్ఞానుడు ఆచార్యపరీక్షలో ఉత్తీర్ణుడై ఒకపాఠశాలలో అధ్యాపకుడుగ ప్రవేశించి కాలముగడపుచుండెను. వానితల్లి చుట్టుప్రక్కల ఇండ్లలోజరిగే శుభకార్యములుచూచి తాను కోడలిసుఖమునకు వంచింపబడెనని దుఃఖిస్తూ, ఆదుఃఖమునకు మూలకారణము సత్యుడు బ్రతికివుండుటయేఅని వానిని నిందిస్తూ కాలయాపనచేయుచుండెను. నిత్యము దేవీపారాయణకన్న ఎక్కువనిష్ఠగా సత్యప్రకాశునకు నాశనసూచకమైన ఆశీర్వచనములు ఇచ్చుచుండెను.

సత్యప్రకాశుడు పూర్వమువలె జ్ఞానుడికి వివాహముచేసుకొనుటకు ఆగ్రహముచూపుచూ భావపూరితమైన లేఖలువ్రాయుచుండెను. కాని ఈఅధ్యాపకునకు అవి చెవిటివానికి శంఖవాద్యప్రాయమాయెను. అపుడపుడు సత్యప్రకాశునికి ఈఒంటరిజీవితముచే విసుగుపుట్టి ఇంటికివెళ్లి నూతనసంసారస్థాపనజేయుటకు బుద్ధి కలుగుచుండెను. కాని ఆగృహాగ్నిజ్వాలకన్న ఈజీవితమే సుఖతరమనితలచి మరల దైవము తనకుఅంతేఇచ్చెనని ఊరకుండుచుండెను.

ఈవిమర్శ కొద్దికాలమువరకుజరిగెను. సంధ్యాకాలమున తనఇంటిఎదుట మంచముపైకూర్చుని ఆలోచించుచుండగా తపాలావాడు వచ్చి రెండుఉత్తరములు ఇచ్చెను. అందులో ఒకటి తమ్ముడువ్రాసినది. చదువుకొని సంతోషించెను. రెండవది విప్పిచదువగానే ముఖము తెల్లబారి, దుఃఖమేఘము వచ్చి మోమునువ్యాపించెను. కండ్లనుండి అశ్రుధారలువచ్చెను. హృదయముకొట్టుకొనుటకు మొదలుపెట్టెను. పత్రము చేతినుండి క్రింద

పడెను. అతనికి తెలియదు. కొంతసేపటికి జ్ఞప్తికివచ్చి "హా దైవమా! నీవేసాక్షి. నాకు తమ్ముడియందున్న ప్రేమ పట్టి ఆడంబరమా? అది వానిని నాశముచేయుటకు చేసినదా? వాడినాశనము నాకు సుఖకరమా?" అని దుఃఖింపసాగెను. సత్యుని హృదయమందు ఇంతపనిచేసిన పత్రము వానితల్లియగు దేవప్రియ వ్రాసినదే. ఆమె చేసిన నాశనపూర్వకమైన ఆశీర్వచనములు ఉత్తరముద్వారా వీనికంపెను. ఇంటివద్ద తిట్టినచో వీనికి వినపడదనితలచి స్వంతముగా ఒక పెద్దకవరులో తనయావత్తుకోపముతీరునట్లువ్రాసిపంపెను. ఆరోజు మొదలు నిత్యము ఒకటిరెండుపత్రములు సత్యునికందుచుండెను. అతడు పత్రముచదువకపూర్వమే తునకలుచేసి అగ్నిలో అదుర్లేఖనితో చెడినకాగితము పవిత్రముచేయుచుండెను.

౭

ఇప్పుడు సత్యునికి ఒకవిధమైన మనోరోగము. దుకాణముముగించి ఇంటివద్దనే పడుకొనియుండి ఏదో దీర్ఘాలోచనలో మునుగుచుండెను. వానిజన్మలో జరిగినయాపత్సంగతులు ఛాయాపటములవలెఆడుచుండెను.

ఇట్లు ఒకనెలగడచెను. ఒకనాడుసాయంకాలమున 6 గంటలకు తలుపువద్ద పిలుపు వినబడెను. పరిచిత స్వరము. సత్యునిగుండెలు దడదడలాడెను. తలుపుతెరచుటకు లేచెనుగాని రెండునిమిషములు అక్కడే నిలబడియుండెను. ఎట్లో వెళ్లి తలుపుతెరచెను. ఎదుట జ్ఞానునిస్వరూపము కాన్పడెను. సత్యుడు అది నిజమా లేక కలయా అని దగ్గరకివెళ్లి కౌగలించుకొనెను. రెండుమూడునిమిషములయనంతరమున తెలివివచ్చెను. సోదరులు ఇద్దరు వేరుపడినతర్వాత అరుఏండ్లకు కలుసుటకు ఇదే మొదటిసారి. ఎన్నిసారులు మాట్లాడుటకుప్రయత్నించినను మాట రాలేదు. అన్నగారి శరీరస్థితిచూచి తమ్ముడు అతిదుఃఖించెను. వాని మలినవస్త్రములు, శుభ్రముగాలేనిగృహము, ఒకచీకటిగదిలో మిటమిటలాడుచున్నదీపముచూచి అశ్రువులు తుపానుచేపీడితమైన సముద్రపుకెరటములవలె ఉప్పొంగివచ్చుచుండెను.

అప్పుడు సత్యప్రకాశుడు వానిని ఓదార్చి ఇంటియొక్క యోగక్షేమములు అడుగుచూ మంచముమీద కూర్చుండపెట్టెను. వీని దీనఅవస్థ చూచినకొలది అతడు ఏడ్చేగాని మాటలేదు. సత్యుడు ఇట్లు ప్రశ్నించెను: నీవు వచ్చేదనని తెలియపరచనైనా లేదేమి?

జ్ఞానుడు:—నేను వ్రాసితినిగాని అందలేదు కాబోలు.

సత్య:—కావచ్చును. నేను దుకాణమునకు వెళ్ళుటలేదు. ఇంటివద్ద అంతా క్షేమమా?

జ్ఞానుడు:—తల్లిగారు స్వర్గస్థులైనారు.

సత్య:—(ఆశ్చర్యపోయి) శ్రీహరి! ఏమంటివి? వారికి ఏమిజబ్బుచేసెను?

జ్ఞానుడు:—జబ్బులేదు. మందుతినెను.

సత్య:—తండ్రిగారు కులాసాగానున్నారా?

జ్ఞానుడు:—కుశలమేగాని ఇంకా గతించలేదు.

సత్య:—అదేమి? జబ్బుగానున్నరా?

జ్ఞానుడు:—"అమ్మ విషము మ్రింగినపుడు ఆయన ఏదో మందు నోటిలోపోసినపుడు ఆయన రెండు వ్రేళ్ళు అమ్మ కొరికివేసెను. అందుచే శరీరమందు విషమువ్యాపించి ఆసుపత్రిలో అంత్యఘడియలులెక్కపెట్టుకొనుచున్నాడు." అనగానే సత్యుడు ఒకనిట్టూర్పువిడచి "హాదైవమా! గృహజ్వాలచే గృహముభస్మమైనదా?" అనెను. తిరిగి రెండవరోజు ప్రాతఃకాలమున ఇద్దరుసోదరులు కలకత్తానుండి పయనమాయిరి.

—ప్రేమచంద్రునికనువాదము.

# మొల్ల

## ౧

### శ్రీ రాయశర్మ గారు

తరములవెన్క విద్యకులతః పతితుండని కుంభకారునిన్
దక్షియని యేదినాల నవతారముదాల్చితో! నీవు రాఘవే
శ్వరుచరితమ్ముఁవంటి రసవత్కృతి నేఁగతి వ్రాసినావొ! బం
ధురకవితామహత్వపరితోషితసర్వరసజ్ఞశేఖరీ!

పదపదమున్ సుధల్ చిలుకు పద్యములెన్నని చూపవచ్చు, కా
వ్యధవుఁడు, కావ్యవస్తువొకడై పరికింపఁగ రామమూర్తి యె
ట్టిదయిన పారవశ్యము ఘటిల్లెనొ నీకు; అనుభూతివేద్యమా
నది యిటువంటిదంచు తలమా పలుకన్? కవితామనోహరీ!

కలశకృదన్వవాయమున కారణసంభవవైన శారదా
లలనవు నీవు నిక్కము; కులాలకులమ్మున కేమి, యాంధ్రలో
కులకనియేమి, యాభరతకుంభిని కే యొకమాపులేని ని
స్తులితయశమ్ము చేకురెనుమా! నినుగూర్చి సాహితీమతీ!

ఖలమతి రాక్షసుండు మహికన్య బలాత్కృతి సేయుపట్ల; భూ
తలపతి రాల్గరుంగ బహుధా విలపించెడుపట్ల; సంగర
స్థలినసృగాక్తదేహులు నిశాటవనాటులు పోరుపట్ల; ను
త్తలపడకుండ నెంతకవితాబలమోగద యూఁచికొంటి కో
మలివయిగూడ అబ్రముసుమా! యది దివ్యకవిత్వమోహినీ!

క్రమములెఱుంగనట్టివి యలంకరణమ్ములు; అయత్నపుంఖితా
తిమృదులముల్ పదమ్ములు; సుధీమహితమ్ములు వర్ణనమ్ములు; అ
ర్ద్రిమధురమా మనోజ్ఞకవితారచనాఢ్య; కులాలవంశర
త్నమయిన యట్టిమొల్ల చరణద్వితియమ్మున కంజలించెదన్.

## ౨

### కవిభూషణ, శతావధాని దోమా వేంకటస్వామి గుప్త గారు

అవనీకామినివయ్యు, వేల్పుల కశక్యంబైన పీయూషధా
ర వెసంబోలెడు లీలమైఁదనర శ్రీరామాయణంబొయ్య వ్రా

సీ విశేషప్రమదం బిలాజనతకుం జెన్నారఁగాఁ జేసి
పాత్రవు నీవైతి విహాపవర్గసుఖమార్గప్రాప్తికిన్; మొల్లరో!
గమ్మనఁ గమ్మవాసనలు గ్రమ్మెడి మల్లెలు మొల్లలొప్పు మా
ల్యమ్ములో? చందనాగురువనాంతరహారిమనోజ్ఞవాతపో
తమ్ములో? వేల్పుబువ్వకును దమ్ములో? నీకవనమ్ము? లమ్మ! మేల్!
కుమ్మరిపిల్లవయ్యు నిలకుమ్మరి పెమ్మిడినావు; మొల్లరో!
మొల్లా! కుమ్మరిపిల్ల పీనుటకుంబోల్పొందెడిం గారణం
బు లెక్కింపంగనైన, నొక్క తెలుఁగొప్పున్ రామచారిత్రకాం
డోల్లాసోరుఘటంబులం గొలిచి పీయూషంబు నందించినా
విల్లీలం గులపద్ధతిన్నిలుపవో? పృథ్వీజనం బెన్నఁగన్!
కుమ్మరిచేయఁగుండ, లవికొన్న జనమ్ములు కొందఱేరో మో
దమ్ముగ డింత్రు వాన; సముదారసుధారసధారఁ గేరునం
దమ్మునఁ బోల్చు రామసుకథామృతమొప్పుఘటమ్ము నీవు గో
ల్పమ్మహిమండలము సకలమ్ము ముదమ్మునిశమ్ముగాంచెడిన్.

నాకవనమో? నీకవనమో?
నాకవనముదనుపు నటుఁజనన్ గానీ నీ
లోకము నాలోకంబున్
వీఁకముదావహము సేయు నీకవనమనన్.

ఆకల్పంబుగ నాంధ్రభారతికమూల్యాలంక్రియా వైఖరిన్
నీకావ్యంబగు రామచంద్రకథ వన్నెన్ వాసియుంగొల్పుచున్
వీఁకన్ జ్ఞానవిహీనమానవుల కుర్విం దెల్వినిం గూర్పుచున్
శ్రీకళ్యాణదమై చెలంగుటకు సందేహంబు లేదంబరో!

## గృహలక్ష్మి ప్రశంస

గాలి బాలసుందరరావుగారు

అరుగుదెంచెదవు ప్రతిమాసాదియందు
ఆంధ్రసాహిత్యలక్ష్మి మహాదరమున
ముదితలకుబంపుకానుకల్ మోసుకొనుచు
స్వాగతము నీకు గృహలక్ష్మి! స్వాగతమ్ము.
ఆదరించెడువారు లేకుండువలన
స్త్రీయసాభాగ్యగరిమ గోల్పోయినట్టి

ఆంధ్రవనితలరచన నీయుండవలన
క్రొత్తక్రొత్తవికాసమ్ము గూర్చుకొనును.
కాలగత్యానుసారియై చాలవరకు
యెండిపోయిన స్త్రీలసాహిత్యవల్లి
పల్లవించెను నీదయ, తల్లతాభి
వృద్ధియొనరించుమమ్మ పుష్పించువరకు.

# అంతర్ధానం

శ్రీమతి వెంపటి జానకీపురుషోత్తముగారు

"ఇదుగో, గంగమ్మా! గోదావరివొడ్డున ఈమధ్యవచ్చిన స్వాములారు బాగా చదువుకున్నాడటగా" అన్నది ద్వారక.

"ఇంతేనా నీవువిన్నది? చదువేకాదు జబ్బువాళ్లకి మందులుకూడా యిస్తాడట" అన్నది గంగమ్మ.

"సంతానములేనివాళ్లకి తాయెత్తుకూడా యిస్తాడట. ఎంతమందికో అనేక గ్రామాల్లో దాఖలా కన్పించిందిట కూడాను" అన్నది మరొకావిడ లక్ష్మీబాయమ్మ.

"మనంప్రశ్నఅడిగితే సమాధానము చక్కగా చెపుతాడని అంటారు. ఆయన యెప్పుడూ ఏకాలం సమాధిలో వుంటాడటండీ, విన్నారా?" అన్నది యొకవితంతువు.

"ఒకటేమిటి ఆయనసర్వవేత్త. భూతభవిష్యద్వర్తమానాలు అన్నీ తెలుసాయనకు. అట్లాంటివారి పాదాలకురోజూ నమస్కారంచేస్తూవుంటే జన్మతరిస్తుంది" అన్నది ఓముసలమ్మ.

గోదావరివొడ్డుననున్న ధవళేశ్వరంలో ఒకరోజు తెల్లవారేటప్పటికి వీధిలో అమ్మలక్కలంతాచేరి అక్కడమఠంలోదిగిన స్వాములవారిని గురించి యింట్లోపనులు వదిలేసి యిట్లాచిత్రవిచిత్రాలుగా చెప్పుకుంటున్నారు. ఊరందరికి మరొకవిషయమేదీ పట్టలేదప్పుడు.

*　　　*　　　*　　　*

ఈవిషయం ఆవూరిపెద్ద భీమయ్యగారుకూడా విన్నారు. అటువంటిస్వాములారు కొన్నాళ్లు తన యింట్లోవుంటే తనయిల్లూ, తనపూర్వులూ, తనూ, అంతాతరిస్తారని స్వాములార్నియింటికి పిల్చుకొస్తానని తనుస్నానంచేసి, విభూతిపెండెకట్లుతీర్చి, మఠానికేసివెళ్లి, స్వాములారి పాదాలకు నమస్కారంచేసి నిల్చున్నాడు. ఇంకాయోగంలోంచి కళ్లుతెరవలేదు స్వాములారు. పలకరిస్తేవారియోగానికి విఘ్నంకలుగుతుందేమోనని వూరుకున్నాడు భీమయ్య. పోనీ తనక్రిందకూర్చుందామన్నా వారిఅనుజ్ఞలేందే కూర్చుంటే యేం తప్పో అని, చాతకపక్షిచకోరానికోసం నిరీక్షిస్తూవున్నట్టు స్వాములారు యెప్పుడుయోగంవీడి కళ్లు తెరుస్తారా అని నిరీక్షిస్తున్నాడు భీమయ్యగారు. మధ్యాహ్నం రెండుజాములకి సమాధిలోంచి నేత్రాలువిప్పేడు స్వామి. ఘనమైన భక్తిశ్రద్ధలుకనపరుస్తూ మళ్లీసాష్టాంగంపడిలేచేడు భీమయ్యగారు. కూర్చోమని సౌజ్ఞచేశాడు స్వాములారు. భీమయ్యకూర్చున్నాడు. "తమరు మాయింటికివిజయంచేసి తమరు ఈగ్రామంలోవున్నన్నాళ్లూ మాయింట్లోనేవుండి నన్ను కృతార్థునిచేయవలె"అని ప్రార్థించేడు.

"మేము సర్వసంగపరిత్యాగులం. ఇళ్లల్లోవుండం. మాకీగోదావరివొడ్డున చాలాసౌఖ్యంగావుంది" అన్నాడు సన్యాసి.

"పోనీండి క్షమించండి. అట్లాగైతే భిక్షకేనా దయచేయమని నాప్రార్థన"అన్నాడు.

"నేను భోజనంచెయ్యను. భిక్షకొరకు వెదుక్కుంటూ పోయేదీలేదు" అన్నాడు స్వాములారు.

"మరియేంపుచ్చుకుంటారు?" అన్నాడు సవినయంగా భీమయ్య.

"క్షీరం, ఫలం" అన్నాడు కాషాయాంబరి.

"అవేపట్టుకొస్తాను" అని, స్వాములారు వేదాంతం వ్యాఖ్యానంచేస్తూవుంటే కొంతసేపు విని యింటికి వెళ్ళిఆయనకు పాలు, పండ్లు పంపేడు భీమయ్య. అప్పటినుంచి నిత్యము స్వాములారికి పాలు, పండ్లు ఎక్కువ సప్లయి భీమయ్యగారిదే.

*　　　*　　　*　　　*

స్వాములారు మధ్యాహ్నం ఒంటిగంటలగాయతూ సాయంకాలం నాలుగుగంటలవరకూ ప్రజలతో మాట్లాడుతారనీ, తక్కినకాలమంతా యోగంలోవుంటారనీ వదంతిపడ్డది. అంచేత జనంయింట్లోపనులుతొందరగా చేసుకునో, చేసుకోకనో పన్నెండుగంటలనుంచీ నిత్యం మఠానికివెళ్లడం ప్రారంభించేరు. కొంతమంది ఆయన వేదాంతంచదువుతూంటే వినడానికని, మరికొందరు రోగాలకు యేంమందుచెపుతారో అని, కొంతమంది ముసలమ్మలు కోడళ్లకుగాని, మనుమరాళ్లకుగాని సంతుకలగడానికి తాయెత్తుయిస్తారేమోనని, యింకా కొందరు ముందు తమకేమి అదృష్టంరానున్నదో ప్రశ్నలువేసి తెలుసుకుందామని, అంతా పండ్లు పుచ్చుకుని వెళ్లి ఆయన ముందుపెట్టి నమస్కరించినుంచునే వాళ్లు. ఆయన వచ్చినవారిని అంతాకూర్చోమనిచెప్పి యెవరే దడిగినా శాంతంగా అందరికీ జవాబుచెప్తూవుండేవాడు. నాలుగుగంటలుకాగానే అంతా స్వాములారివద్ద శెలవుతీసుకొని వెడుతూ ఆయన సాక్షాద్విష్ణుమూర్తేనని, లేకపోతే యిన్నిసంగతులు తెలియడంకష్టమని, ఆయన వ్యాఖ్యానంచేస్తూవుంటే ఆయనవాగ్ధారవింటే పారవశ్యంకలుగుతుందని ఆయన్నిగురించి శ్లాఘిస్తూ వెళ్లేవారు. స్వాములారి గొప్పతనం, ప్రతిభావిశేషం ధవళేశ్వరంచుట్టుపట్లంతా వ్యాపించింది. ఎక్కడెక్కడ నుంచీకూడా తీర్థానికివచ్చినట్లు ప్రజ రావడం మొదలెట్టేరు. ధవళేశ్వరంఅంతా యెక్కడచూచినా జనంతో కిటకిటలాడుతోంది.

* * * *

"ఇదుగో భాగీరథమ్మా రోజూ చెప్పాలనుకుంటాను. సమయానికిజ్ఞాపకంరాదు" అన్నది లక్ష్మీబాయమ్మ.

"ఏమిటీ? ఇప్పుడు జ్ఞాపకంవచ్చిందిగా చెప్పు" అన్నది.

"రోజూ నీవు వేదాంతంవినడానికి వెడుతున్నావుగా?" అన్నది.

"ఆఁ, వెడుతున్నా."

"ఇంట్లో రోజూ నీకోడలు నీతోపోట్లాడుతోందికదా? కొడుక్కి నీమీదక్రోధం ఏర్పడుతోందికదా? ఈసంగతి స్వాములారితో చెప్పకపోయినావా?" అన్నది.

"అదే ఆలోచిస్తున్నా నేనూను."

"ఆలోచనలెందుకూ? మొగవారు కోపంచేస్తారనా?"

"అదికాదు. ఈపోట్లాటలకి స్వాములారేం చేయగలుగుతారని."

"ఇంతమందికి యెన్నివిషయాల్లోనో చెప్పగాలేంది నీకుచెప్పరూ? ఏదోచెప్తుతారు వెళ్లు."

"అయితేవెళ్లి అడక్కనుక్కుంటాను మరి."

* * * *

చిన్నపిల్లలదగ్గరకీ, స్వాములారివంటి పెద్దవాండ్లదగ్గరకి రిక్తహస్తాలతో వెళ్లకూడదని రెండుబత్తాయి పండ్లు, నాలుగు గన్నేరుపువ్వులు తీసుకుని భాగీరథమ్మవెళ్లి స్వాములారి ముందుంచి ఆయనపాదాలకు మ్రొక్కింది.

"కూర్చోండి" అన్నాడు స్వాములారు.

కూర్చుని "నాదొకమనవి" అన్నది.

"అభ్యంతరంలేదు చెప్పండి."

"నాకోడలు రోజూ నాతోపోట్లాడుతుంది. నాకుమారునికి నామీద క్రోధంపుట్టింది. పోట్లాట లేకుండావుండేటట్టు విభూతికాని మరేదైనాయిచ్చి అనుగ్రహించాలి."

"దీనికి విభూతికాదు."

"మరేమి సెలవు?"



మద్రాసున కల్లంగడుల వేలముపాట పికెటింగు
జూలై 30-వ తేది
నాయకురాలు శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు



రైలుపట్టాలను తొలుగుట



శ్రీమతి మేరీజాన్‌కన్యగారు బి.యె.

లండను విశ్వవిద్యాలయమున బి.యస్. ఆనర్సుపట్టమునుపొందినది.

తిరువనంతపురము మహారాజాకళాశాలలో బి.యె. పట్టమునుపొందినది.



భూ లో క గం ధ ర్వు డు

మానవుడు రెక్కలతో ఆకాశమున ఎగురుచున్నాడు.

అమెరికాఖండమున ఆకాశవిమానచోదనమున అతిఖ్యాతిగన్న అడాల్ఫ్ వమాడ్సు గారు బ్రూక్లిన్ మైదానమున రెక్కలుకట్టుకొని పైకి ఎగిరిన వింత.

భాగీరథమ్మగారి ఒంటిమీది నగలుచూచేటప్పటికి సాములారికి ఆలోచనపోయింది.

"దీనికి ఒక జపంవుంది. అది నేర్చుకుని నిత్యం చేస్తూవుంటే ఇట్లాంటి గృహచ్ఛిద్రాలువుండవు."

"అయితే ఆజపం నాకుచెప్పండి చేస్తాను."

"ఇప్పుడుకాదు. రాత్రి. నక్షత్రాలురావాలి. ఏదైనాపుణ్యస్రవంతిలో అర్ధరాత్రివేళ ఏకాంతంగా నుంచుని నేర్చుకోవాలి. చాలాకష్టం" అన్నాడు సన్యాసి.

"ఫరవాలేదు. ఎట్లాగైనా పాట్లాటతగ్గలేచాలు. తమయాజ్ఞ. నేనురాత్రి పన్నెండుగంటలకువస్తాను."

* * * *

తెల్లవారుతోంది. కాకులుకూస్తున్నాయి. అప్పటికప్పుడే పురజనమంతాస్నానాలకి గోదావరికి వెడుతున్నారు. వీరంతా గోదావరిలో దిగేటప్పటికి జలంలో ఒకశవం తేలుతోంది. ఆశవాన్ని పట్టుకుని వొడ్డుకు తీసుకొచ్చి చూచి ఆశ్చర్యపోతున్నారు. "ఇదేమిటి? భాగీరథమ్మర్రా. ఎట్లాచచ్చిపోయిందీ? అయ్యో! అయ్యో! ఒంటిని ఒక్కవస్తువేనాలేదే. వుస్తేనాకనపడదే. వస్తువులేమైనాయిచెప్మా" అంటూ అందరు తలోమాటా మొదలుపెట్టేరు. "ఒంటినిండా వస్తువులతో రొప్పుసూవస్తూవుంటే పార్వతీదేవిలాగుం డేది" అని కొంతమంది విచారపడుతున్నారు. ఈసంగతి భాగీరథమ్మగారి భర్త విన్నాడు. అతనువచ్చి శవాన్నిచూచి నిర్ఘాంతపోయి అవురుమన్నాడు. ఆవిడ గోదావరి కెప్పుడువచ్చింది అని అంతాఅడిగేరు. "స్వాములవారిదగ్గిర జపం నేర్చుకువస్తానని రాత్రివెళ్లింది. యేమోయింకారాలేదనుకుంటున్నాను. నాకొంప తీశావురా స్వామి!" అన్నాడు. "ఇంకేమి? స్వాములార్ని అడిగితే అంతా తెలుస్తుంది" అని అంతా మఠానికి బయల్దేరి వెళ్లేరు. అక్కడికివెడితేయేముంది? మఠం శూన్యం. వస్తువులతోకూడా స్వాములారంత ర్ధానంఅయినాడు. జనంఅంతా "ఈహత్య స్వాములారిదే. సొమ్ముకోసం యెంతమోసం యెంతమోసం"అని ముక్కుమీద వేలువేసుకున్నారు.

## అత్తింటికి పయనము

కందుకూరి రామభద్రరావుగారు

కురులుసవరించి, చేమంతివిరులుదాల్చి,
నుదుటఁ గుంకుమచుక్కను బదిలపఱచి,
రమ్యముగఁదీర్చి క్రొత్తచీరనుధరించి
భర్తతో బాల నౌకపైఁ బయనమయ్యె.
తనయనంపఁగఁ దల్లి రేవునకువచ్చి,
నావనాలుగుబారలు నడిచినంత
"అమ్మ! నేనుండు: జాగ్రత్త" యనుచుఁజెప్పె
నశ్రువులనద్దుకొనుచుఁ జేలాంచలమున.
బాలకందోయినుబుకు బాష్పములడంపఁ
బక్ష్మములనప్పళించు నవ్వలికిఁదిరిగి,
పొంగిపొరలెడిదుఃఖము మ్రింగుకొనును
భర్తచూచిననలుగునఁట భయముకలన.
తరణికిరణములకుఁ బాణితలమునడ్డి
అంతకంతకుదూరమై యరుగునావ
వైపునకెజూచుమాత రెప్పలనునిలిపి
ఆశఃపిల్లన్నఁబ్రేమ యేఁలతివకైన.
చూచుచుండంగఁ దనతల్లిచుక్కయగుచుఁ
బ్రక్కవస్తువు లందానవాలులేక
పోయిననుబాల ఆవైపెపొంచిచూచుఁ
దల్లికోలకయి; ప్రేమయెంతటిదో కాని!
మగనికౌగిలిసుఖమునెమ్మదిఁదలంచి
భర్తతోనేగ సంతసంబరముపడియుఁ
గంటతడిపెట్టె నాబాల కడకదేమొ!
పుట్టినిల్లన్నఁదీపి యేపొలఁతికైన.

# మా సింహంపిల్ల

శ్రీమతి ప్రాతూరి లక్ష్మమ్మగారు

మాసింహమును ఒకరోజు నేను నావొళ్లో కూర్చుని పిలిచేను. 'సింహం నీపేరేమిటిరా?' అన్నాను. 'నాపేరా? నాపేరుసింహం' అన్నాడు. 'అకాదు. నీపేరు సింహంపిల్ల' అన్నాను. 'కాదుకాదు నాపేరు సింహామే' అన్నాడు. నాకు సింహంనోట్లోనుంచివచ్చే ప్రతిమాట చాల ముద్దువస్తూయుంటుంది. చివరకు సింహంయేడ్చినా నాకెంతో ఆనందంగాయుంటుంది. ఆతెల్ల ముఖము, ఆచక్రములవంటికళ్లు, కొంచెంఎర్రగావున్న జుట్టు, చిన్నక్రాపింగు, యిటు అటు దొంగచూపులు చూస్తూ యేడుపురాకపోయినా తెప్పించుకోవలెనని ప్రయత్నముచేయుచున్న మాసింహంపిల్ల ముఖము చూస్తె నేనేలాంటిస్థితిలోయుంటానోనాకే తెలియదు. అందువల్ల నాకేమీ తోచనప్పుడల్లా సింహాన్ని పిలిచి నీపేరు సింహంపిల్లఅంటాను. కాని సింహంపిల్లా అనడానికి వప్పుకోడు సింహం. అక్కడనుంచి మొదలు పెడతాడు తనముద్దులపంచాంగం. 'నిన్ను తాతయ్య యేమని పిలుస్తారురా?' అన్నాను. 'నన్ను తాతయ్య సింహాము అంటాడు' అన్నాడు. 'నిన్ను అమ్మ యేమని పిలుస్తుంది?' 'అమ్మనన్ను నరసింహామూర్తి అంటుంది.' 'చూడు, నాన్న యేమని పిలుస్తాడు?' 'నాన్న నన్ను దొరాఅంటాడు' 'చూడు, సింహం నేనునిన్ను ఏమని పిలుస్తానురా?' సింహం యిటుఅటు దొంగచూపులు చూచి 'నన్ను సింహంపి......ల్లా అంటావు' అని



సింహంపిల్ల, వ్యాసకర్త్రి.

నావళ్లోపడుకుని నవ్వటం మొదలుపెట్టేడు. మేమంతాకడుపుబ్బేటట్టు నవ్వేము. మేమున్న చోటికి సింహంబామ్మవచ్చింది. 'సింహం మీనాన్ననితీసుకుంటాను. నాది మీనాన్న' అంది. నావళ్లోనవ్వుతుపడుకున్న సింహం సింహంపిల్లలాగు లేచింది దౌర్జన్యంగాను. 'అయి వద్దు వద్దు నువ్వు చీతక్కయ్య నాన్ననితీసుకో' అన్నాడు. కాదు 'మీనాన్న నెతీసుకుంటాను' అంది బామ్మ. 'వద్దు బామ్మ వద్దు' అనిబామ్మకేసి చిన్నచూపుచూశాడు. ఆచూపుతోనే బామ్మ లొంగిపోయి సింహామును తనదగ్గరకు లాక్కుని రెండుముద్దులు బహుమతియిచ్చింది. మా సింహం యేడుపుయెక్కడ వినపడ్డాసరె తాతగారు యెంతజపంలోవున్నా పిలచి ఒకపీట వేసి యెదురుగుండా కూర్చోపెట్టుకుంటారు. ప్రతిరోజు సింహం ప్రొద్దున్నలేచి పళ్లుగిల్లుతోముకుని యెంతచలికాలమైనా తండ్రితో చన్నీళ్లుస్నానంచేస్తాడు. వాళ్లమ్మలేవడం ఆలస్య

మయితే అరివాణం, ఉద్దరిణా, విభూదిపండు తండ్రిపీటవద్ద పెడతాడు. తండ్రి పారాయణచేసుకునె పుస్తకాలు తీసుకొస్తాడు. ఒకపీటవేసుకొని విభూదిపిండికట్లుపెట్టుకొని బాసినపెట్టేసుకుని తను ఒకఉద్దరిణ పంచపాత్రనీళ్లు పెట్టుకొని తండ్రితోసమంగా పంచపాత్రలో నీళ్లన్ని తాగుతు కూర్చుంటాడు. తండ్రిజపం ఆలశ్యమగుతే అల్లరిమొదలుపెడతాడు. వీడల్లరిచూచి తండ్రి కోప్పడుతాడనివాళ్లమ్మ 'సింహం చూడు కొబ్బరికాయపట్టుకెళ్లి నాన్నగార్కియ్యి'అంటుంది. అక్కడినుంచి గబ గబ పరుగెత్తుకువెళ్లి వడమటింటిలో తట్టలోవున్న కొబ్బరికాయఒకటి పట్టుకువస్తాడు. నాన్నదగ్గరపెడతాడు. కాస్సేపువూరుకుంటాడు. నాన్నజపం అప్పటికికాదు. ఆపళంగా తండ్రిపక్కనునుంచొనిచూస్తాడు. అప్పటికీ పలకరించకపోతే తనచెయ్యిఒకటి తండ్రిమెడమీదవేసి ఒకచేత్తోగడ్డంపుచ్చుకొని 'నాన్నోయి!నాన్న!పలకవేంపడకవేమెనాన్న, గొబ్బడికాయకొట్టవే'అంటాడు. వాళ్లనాన్నయికవీడిచేతిలోపడలేక అప్పటికింకా జపంపూర్తి కాకపోయినా కొబ్బరికాయకొట్టి నైవేద్యంపెట్టి నాలుముక్కలు వీడికిపెట్టిపంపుదామను కుంటాడు. కాని సింహంవూరుకోడు. తండ్రిని నీవుకూడాతినవెఅంటూ తనచిన్న చేతులతో తండ్రినోట్లో పెడితే యికసింహంపిల్లచేతుల్లోనుంచి తప్పించుకోలేక నవ్వుతుంటూ సింహంను యెత్తుకొని గొబ్బరిముక్కలునమలుతు తండ్రికొడుకులు ఉదయంయెనిమిదిగంటలయ్యేటప్పటికి బయిటకువస్తారు. మాసింహంకబుర్లవల్ల వాళ్లనాన్న, బాబాయి తమప్రయాణపు అడావిడిలోసర్దుకోకుండా మరచినవి జ్ఞాపకమొస్తూయుంటాయి. సింహానికి బాబాయిఅంటె చాల ప్రేమ. బాబాయి ఒకరోజు జరుగురుపనిమీద ప్రయాణమయి సూటుబూటువేసుకు వెడుతున్నాడు. సింహంగబగబవచ్చినిలవేసాడు. 'బాబాయి!నాకుడబ్బుయియ్యవు? కాని డబ్బు యియ్యవు?'అని మూలుగుతునుంచున్నాడు. అప్పుడు బాబాయి తన నాలుజేబులువెతుక్కున్నాడు. కానిమనిపర్సులేదు. సింహంనిలవేసినందుకు అదివర్కువిస్సుక్కున్నా ఇప్పుడుసంతోషించి మోటారుఅందదేమొ అని అడావిడిగావున్నా చిక్కిందిసింహంపిల్ల చేతులోకనుక యింట్లోకివెళ్లిపర్సుతీసుకొచ్చి సింహానికి కానిఇచ్చేడు. సింహం తూరీగలాగపరుగెత్తుకెళ్లి పిల్లలందరికి చూపించేడు. చీమలబారులాగ అంతా బాబాయినిచుట్టేశారు. అందరికి తలో డబ్బు యిచ్చి యింకొకటి యింకొకటిఅని కొసురుతున్న పిల్లలను వదల్చుకు యివతలపడ్డాడు. ఒక బారెడుదూరంవెళ్లేటప్పటికి బొజ్జాడించుకుంటూదొర్లుకుంటూ సీతయ్య పరుగెత్తుకువచ్చింది. 'నాకేవి నాన్నడబ్బులు'అంది. కానిఇచ్చేడు. సీతక్కయ్యతృప్తిపడలేదు. చిన్న మొత్తువేసాడు. సీతయ్యాచూడు 'నీకు దవసంకావాలా చామంతిపువ్వులా'అన్నాడు. సీతక్కయ్యముఖంవికసించింది. 'నాకు రెండూకావాలి నాన్న'అంది. 'సరె నీకురెండూతెస్తాగాని ప్రస్నకి చెప్పకు వెళ్లు'అన్నాడు. ఒకపరుగునవెళ్లిపిల్లలతో ఆటలలోపడింది. ఇవాళ మోటారు అందుతుందా లేదా అన్నసంశయంతో త్వరగావెళ్లేడు బాబాయి.

—ఈవ్యాసముయొక్క మొదటిభాగము మేమాసమున ప్రచురింపబడినది.

# గులాబి

వి. యస్. గిరిగారు

చల్లనిగాలిసోకింది. హాయిఅనిపించింది. కళ్లువిప్పిచూసేను మెల్లిగా. సౌందర్యమైనప్రకృతి అవుపడ్డది. అదివరకట్లాచూడకపోవడంచేత అదే నాపుట్టుకనుకుంటా. క్రమముగావొస్తోంది నాకుడివేపునుంచి వెలుగు. రానురాను ఆదిక్కున ఎఱ్ఱనిబింబం వొకటి భూమిలోంచిలేచినట్టు లేచిందిపైకి. ఆబింబంనుంచే వెలుగంతా వెగజల్లబడుతోంది. మరికొంచం సేపట్లో ఆకాంతం అదీపోయి బట్టబయిలు అయింది.

నాల్గుదిక్కులా మళ్లీచూసేను. నేనొక్కర్తెనేకాదు నాచుట్టుప్రక్కల అనేకులున్నారు నాలాంటివాళ్లు. నాకన్నచాలా పెద్దవాళ్లు, నాయీడువాళ్లు, కళ్లుతెరవక పచ్చనిపచ్చడాల ముసుకులోంచి యింకా తొంగి చూస్తోన్నవాళ్లుకూడావున్నారు. మరికొందరి రూపంవునికి నాదిమల్లేనే వున్నాయి. కాని వర్ణభేదంమాత్రం వుందిఎఱ్ఱగా, పచ్చగా, తెల్లగా. మరికొంతదూరాన యింకా కొందరున్నారు. అయినా వాళ్లరూపంవునికి అన్నీవేరు. వాళ్లజాతే వేరు.

దూరంనుంచి ఒకాయన మమ్మల్నందరినీ పరీక్షిస్తోవస్తోన్నాడు. కొందర్నికోస్తోన్నాడు అమాంతం. నాకుభయమైంది నన్నుకూడా కోస్తాడేమోనని. నాదగ్గిరికొచ్చి తనచల్లనికత్తితో కదిలించేడునన్ను. నాపక్కనవున్న నాతోబుట్టువు నొకామెని, చాలాపెద్దామెని కోసి బుట్టలో వేసుకొన్నాడు. చాలామంది తమదుర్దశకి ఏడుస్తోవున్నారుదాంట్లో. ఆకోసినతావుల్లోంచి అశ్రుబిందువులు కారుతోన్నాయి. నన్ను చూసి అన్నారువాళ్లు: "నీక్కూడాయిట్లాంటివిధే రానుందమ్మా! ఎందుకుపుట్టావమ్మా? నువ్వుకూడా మామల్లే చావడానికి!" అంటూకంట తడిపెట్టుకొన్నారు. ఎందుకుపుట్టేనా నిజంగా అని విచారించా. అయినా నాచేతులో యేముందిపుట్టడానికి, పుట్టకపోవడానికి? నన్నుపుట్టించమని తపస్సుచేసి బతిమాలానా! ఎట్లా కావాల్నంటే అట్లాఅవుతుంది. ఏంచేస్తాం! తప్పించుకొని పారిపోవడానికి వీలుందాఏమైనా?

వృద్ధిఅయినకొద్దీ క్షీణిస్తోందివెలుగు. ఆయెఱ్ఱనిబింబంమరొకవేపున మళ్లీమాయమవుతోంది భూమిలోకి. కిందివేపున చిన్నకొమ్మలమధ్యవున్న నారపుడకలచిక్కులో ఒకచిన్నపిట్టవొచ్చికూచుంది.

మరలచీకటయింది. దూరంనుంచి ఒకాయనవడుస్తో నాదగ్గిరికొచ్చి రాతిమీదకూచున్నాడు. పొద్దుటాయనమల్లె మోటుగాలేదు. చాలాఅందంగావున్నాడు. గుడ్డలుగూడా చాలామృదువైనవి. అయినా గుడ్డలమీద వొంటిమీద యేమాత్రం లక్ష్యంలేనట్టు ఆలోచిస్తో కూచున్నాడు. చాలాసేపయింది. పెద్దగాలొకటి వీచింది. ఆగాలిచేత ఆయన తలకిదగ్గిరిగాజరిగానేను. నావేపుచూశాడు. ఆచూపుల్లోనే లలితత్వం, విచక్షణాజ్ఞానం, నాయందలిప్రేమా అన్నీ ఇమిడివున్నాయి. మృదుత్వంగానన్ను చేతితోతాకేడు. ముద్దుపెట్టుకున్నాడు. ఎందుకు నామీదింతదయ ఈయనకి?

కోసేడు. అట్లాచేస్తాడనుకోలా. నాబాధ ఆయనకి తెలియకా? అయినా అవల్లటివాడి బుట్టలోపడ్డ దానికన్న ఈనాగరికునిచేతుల్లో పడడం నయమని తృప్తిపొందా.

పెద్దబంగళాలోకి తీసికెళ్లేడు. ఎటుచూసినా గోడలూ, పటాలు. కిటికీల్లోంచిగాలివస్తోన్నా బిగబట్టినట్టుందిగాని స్వేచ్ఛగావీచడంలేదు. ఒకబల్లమీద నన్నుంచి దీపంవెలుగులో ఒకకాగితంమీద యేమో రాశేడు. దాన్నిచించి ఇంకోమాటురాశేడు. ఆకాగితాన్ని నన్ను ఇంకొకకాగితపుసంచిలో కుక్కేడు. నారెక్కలన్నీ అణిగిపోయాయి. చాలానొప్పిపెట్టింది. ఏంచేయను భరించక? ఖర్మం!

చాలాసేపున్నా ఆసంచిలో. సంచికదిలింది. రెండుమెత్తనివేళ్లు మెల్లగానన్ను సంచిలోంచిబయిటికి తీశాయి. చాలావెలుగుంది. కాని అది చాలాచల్లంది. ఆకాంతిని వెగజల్లే ఆబింబంఎఱ్ఱగాలేదు. తెల్లగావుంది.

గాలిరివ్వునవీచడంమాని తెలియనట్టు మెల్లిగాకదుల్తోంది. నన్ను సంచిలోంచి తీసిన ఆరెండువేళ్లు చాలా అందమైనవి ఆమెవి. ఆమెదేహపువన్నె మృదుత్వంచూసి సిగ్గేసిందినాకు. నన్ను తనపక్కన రాతిమీదుంచి ఆకాగితం చదివింది. చప్పున నారెక్కలన్నీ నొప్పిపెట్టేట్టు తనపెదిమలకి నొత్తుకుందినన్ను. ఆమెత్తని పెదిమలసందులోంచి వొచ్చేకమ్మనివాసన నావాసనకన్న యెన్నోయిమ్మళ్లు తియ్యగావుంది. నాలుగైదుసార్లు నన్నుముద్దుపెట్టుకొని నారెక్కలాగ సన్నగావున్న తనచెంపకి అణిచికూచుంది కొంతసేపు. పైనుంచి సన్నని వుడుకునీళ్లధార వొహటివొచ్చి నన్నుతడిపింది. తిరిగిచూస్తే ఆధార ఆమెకంటిలోంచి వొస్తోంది. ఈమెకూ దుఃఖమేనా? యెందుచేత? నాకు అంటే విధిలేదుకాని యీమెకేంఖర్మం?

చాలాసేపు అట్లాగేకూచుంది ఏమోఆలోచిస్తో. ఎవరోవొచ్చినట్టు చప్పుడయింది. ఆకాగితాన్నినన్ను తనపట్టురవికలో దాచుకుంది. ఆవెచ్చనిదేహం నావొంటికి తాకేటప్పటికి హాయివల్ల వొళ్లుగగురుపొడిచింది.

ఆదేహపుకదిలికచేత ఆవెచ్చనిమెత్తదనంకిందిచప్పుడుచేత ఆమెవొకచోట వుండలేదనీ, ఆమెకు మనోస్వస్థతలేదనీ తెలిసింది. ఆవొచ్చినవ్యక్తి కఠినంగా ఈమెని మాటలాడినట్టు ఆరవికలోంచి విన్నా కొద్దిగా. అలసటచాత అప్పుడప్పుడు ఆమెవొంటిలోంచి సన్ననితడివొచ్చి నారెక్కలకితాకింది. చాలాసేపు యాక ఇంకోదేహంవొచ్చి నన్ను ఆమెదేహానికి అణిచింది. ఆదేహంలోంచికూడా అట్లాంటిచప్పుడే వొస్తోంది. ఆమెవేళ్లు నన్ను నాపక్కని కాగితాన్ని బైటికితీశాయి. ఆమెదేహానికి అతుక్కోడంచాత నారెక్క ఒహటివిరిగి అక్కడేవుండిపోయింది. వొక్కసారి స్వచ్ఛమైనగాల్ని చాలనిపించేట్టుపీల్చా.

నన్నీమెదగ్గిరికి పంపినాయన ఈమె పెద్దచెట్టుచీకట్లోవున్నారు. ఆచెట్టుకొమ్మలసందులోంచి ఆతెల్లని బింబం తొంగిచూస్తోంది. నామీదలక్ష్యమేలేదు వాళ్లకి. ఆచెట్టుమొదట ఆకాగితంమీదవుంచింది నన్నామె.

ఏంచేయను! జరిగేశక్తివుంటేనా నాకు అమాంతంఅక్కణ్ణుంచిలేచిపోయి మళ్లీనాతావుచేరేదాన్ని. లేకపోతే యెవరికీ అవుపడకుండా పొయ్యేదాన్నియెక్కడికైనా. మాయమయ్యేదాన్ని. భూమ్యాకాశాలు కలిసినట్టు అవుపడేచోట ఆమెత్తదనంవుందిచూడు అక్కడ ఆమెత్తదనంలో అణిగిపొయ్యేదాన్ని. అప్పుడు నాకీబాధలన్నీ తప్పేవి. వీళ్లకంటికే దుర్లభమయ్యేదాన్ని. ఏజన్మాన యేంపాపంచేశానని యిట్లాబాధించాలి వీళ్లునన్ను. ఆయననన్నుకోసేటప్పుడు ఒహచిన్నముల్లు తనవేలుకితాకితే చప్పునవేలునిఝాడించి ఆముల్లుకోసి తన వేలుకేసిచూశాడు యెగాదిగా. అంతమాత్రపు బాధనే తను భరించలేకపోతే నన్ను తామిట్లా నలిపేస్తే నేనెట్లాభరించగలనని విచారించవద్దూ?

మళ్లీ తీసికెళ్లింది. ఆమె నన్ను ఒహ చీకటిపెట్టెలో దాచింది. ఈకష్టకాలంలో నేనొక్కర్తనేగాకుండా ఆకాగితాన్నికూడా నాతోజతచేసిందిపాపం. అయినా ఆకాగితంతో నాకేమీ లాభంలేకపోయింది. దానిస్థితిగతులను తెలిసికొనినావిషయం కొంచం చెలిబుచ్చుకొనడానిగ్గూడా అవకాశంలేదు. ఒకచోటవున్నామంటేవున్నాం. అంతే.

నీరసంయెక్కువయింది ఆహారంయేమాత్రం లేకపోవడంచేత. పీల్చడానికి గాలికూడా దుర్లభమయిందాచీకటిపెట్టెలో. చచ్చిపోయినట్టున్నాదాంట్లో.

చాలాసేపయాక మళ్లీబయటికి తీసిందినన్నామె. ఆకాగితాన్నికూడా దీపంవెలుగులో ఒహబల్లమీద వుంచింది. ఆబల్లకు ఆమెకెదురుగా సన్నగా పెద్దగాయేదోవుంది. దాంట్లో ఆమె నేను కాగితం దీపం అన్నీ అవుపడ్డాయి. దాంట్లో చూసింతరువాత తెలిసింది నారూపంయెంతమారిపోయిందో. రక్తంయేమాత్రం లేకండా అయింది. జీవితంమీది ఆశేవొదిలిపోయింది.

ఆమెకేసిచూశా మవ్వేకదా నామృత్యుదేవతవిఅని. ఈకాగితంలో చూస్తే ఇంకోహృదాంట్లో యేదో రాస్తోంది. ఆరెండుకళ్లలోంచి నీటిధారలు కారుతోన్నాయి. ఆపెదిమలు వణుకుతోన్నాయి. ఏమవుతోందోఆమెకు నాకుతెలీలా. నీళ్లుకారే ఆచెంపదగ్గరైనా నన్నువుంచులే బావుండేది. ఆకాస్తతడైనా పోయేది. కాని ఆమెకి నేనిప్పుడు అవసరంలేకుండా అయ్యాను. ఆకాగితంవేపుచూస్తే ఆవేశంతో రాస్తోంది. చెంపవెంబడిజారి కాగితంమీదపడే కంటినీళ్లమీదకూడా దృష్టిలేదామెకి. నీళ్లుకారుతోన్నాయన్న విషయమే తెలీనట్టుంది.

తనహృదయావేదన మనోస్థితినంతా ఆకాగితంమీద చక్కగా చిత్రించాలని ప్రయత్నిస్తోంది. కాని ఆచిత్రము తగినట్టుకుదర్డంలేదు. బాధపడుతోంది. రాస్తోంది. ఆదితృప్తికరంగా లేకపోవడం తెలిసికొని కొట్టేస్తోంది. ఆలోచించిమళ్లీ రాస్తోంది.

ఇట్లా ఒహసారిరాసిందాన్ని కొట్టేసి అకస్మాత్తుగా నావేపుచూసింది. తనయెడమచేతిని నావేపు జాచింది. నన్ను తనచెంపకి అద్దుకుంటోందిగాఁవును నాఅదృష్టంపండిందిగాఁవును అనుకున్నా. కదిలించింది. అబ్బా! మనంతలంచే దొహటిజరిగేదొహటి. నారెక్క నొహదాన్ని పూడబీకింది. నాలికతోనోట్లోకి తీసికొని చప్పరించింది. ఇంతక్రూరంచేస్తుందని యెప్పుడూ అనుకోలా.

ఒహటీ ఒహటీ రెక్కలన్నిట్నీ ఊడబీకితిన్నది రాక్షసిలాగ. అప్పుడుకాని ఆమెరాతపూర్తికాలా. కాగితాలన్నీ తీసికొని లేచిపోయింది. ఆబల్లమీద రెండుపుస్తకాలు నేనే మిగిలాం. నారూపాన్నిచూసుకుంటే దుఃఖంఆగిందికాదు. పెద్దని అందమైన ఆకారమంతా మాయమయ్యి నగ్నంగా నేనే మిగిలాను. నాసురూపమంతానశించిపోయాక నే నెవరికికావాలి?

దీపంఆరిపోయింది. మళ్లీచాలాసేపుచీకట్లోవున్నా.

క్రమంగా కిటికీలోంచి తెల్లనికాంతిరావడం ఆరంభించింది. కాంతిని యెగజల్లే ఆయెఱ్ఱనిబింబంకూడా అవుపడ్డదాకిటికీలోంచి. నేనుపుట్టినవాడు ఆబయిల్లో యీసమయాన యీయెఱ్ఱనిబింబంవెల్లిన సమయాన నాకెంతఆనందం అనిపించింది! ఈవాళయెట్లా మారింది నాదశ!

వెలుగుచాలావొచ్చింది. ఒహాయన—నల్లనాయన వొచ్చాడు. చేతులలోవున్న ఒహపెద్దగుడ్డతో ప్రతి వొస్తువుని తుడుస్తోన్నాడు. అన్నిట్నీతుడిచి నేనున్నబల్లదగ్గరికి వొచ్చేడు. ఆపుస్తకాల్ని తుడిచి భద్రంగా ఒహపక్కనవుంచేడు. ఆగుడ్డను బలంగాబల్లమీదకొట్టి నన్నుగూడా కొట్టాడు. దూరానద్వారందగ్గిర పోయి పడ్డా. ఏందశనాది! ఏకోచెత్తఅనుకున్నాఁడుగావును? అక్కడ ఆబల్లమీదవుండడానికి అనర్హురాలినను కున్నాడుగావును! వొస్తోన్నాయి. ఆమోటునల్లనికాళ్లు నాదగ్గిరకొస్తోన్నాయి. తొక్కుతాడు. తప్పదు. అబ్బా, అబ్బా! ఇట్లారాసుందా నాఅంతం?

## జానకిమనస్సు

అధికార్ల సూర్యనారాయణరావుగారు బి.యె;బి.యల్.

గాలివీచుచునుండ గదలుపర్ణంబు
వెలుగుక్రమ్ముచునుండ వికసనుపుష్పంబు
వాసంతమలరింప బాడును పికంబు
నన్నుగాంచిననవ్వు నాచెలిముఖంబు.

రాజుపొడమినఁబొంగు రత్నాకరంబు
రవిబాలుఁడుదయింప రగులును నభంబు
నవనవాంగకమెన్ను కవితనయనంబు
సఖునివలపెంచు నా జానకిమనంబు.

# బాండుఫీల్డుకన్య

న్యాపతి కృష్ణారావుగారు బి.యె;బి.యల్.

(అంగడివీథినుండి మంత్రివర్గమునకు)

నేడు ప్రజాస్వామికప్రభుత్వము ప్రపంచమునంతటను వెల్లివిరియుచున్నది. అట్టి ప్రభుత్వమునం దెల్లరకు అనగా (స్త్రీపురుషులిర్వురకును) సమానమగు అవకాశములు కల వనుటకు సందియములేదు. ప్రస్తుతము పురుషులతోబాటు స్త్రీలు సరిసమానముగ వర్తించుట దీనికి తార్కాణము.

"ఇంగ్లీషుప్రభుత్వమునందు మంత్రివర్గములో పదవికొనుటకు నేటికి బాండుఫీల్డు కన్యకు యోగముపట్టెను. అట్టి ఉన్నతోద్యోగములు స్త్రీలయొక్క ఘనతను చాటుచుండుటచే తన అయ్యది ప్రాముఖ్యమువహించును. అంగడివీథులందు కృషిచేసెడి వ్యక్తి నేడు మంత్రివర్గము నలంకరించుటవలన జనసామాన్యమున కామెయందు మిక్కుటమగు ప్రేమ కల్గెను. ఆమెనుబోలెడి వ్యక్తి మఱియే యితరరాజకీయపక్షమునందును కానము.

బాండుఫీల్డుకన్య పార్లమెంటులోనికి వచ్చుటకుపూర్వము చాలకాలము స్త్రీలతో కలసిమెలసి కష్టప్రయాసపడి పనిచేసెను. స్త్రీల వర్తకసంఘోద్యమమునందు మేరీమేకార్తరుతోను, ట్రకువెలుకన్యతోను బాండుఫీల్డుకన్య ప్రథమప్రచారకురాలయ్యెను. వర్తకసంఘ విషయమై కష్టపడిపనిచేసి జయముగాంచుటవలన సంఘమామెయందు సానుభూతి కనపరచినది. వర్తకసంఘములమూలమున స్త్రీలను కట్టుబాటులోనికి తెచ్చినకారణమున స్త్రీలు పడుచున్న బాధలును, కొన్ని అన్యాయములును తగ్గినవి. మేరీమేకార్తరువలె మేలైన కట్టుబాటుశక్తియు, సుసాను లారెన్సుకున్న మేధాశక్తియు, సాంఘికవ్యాపారములలో సిడ్నీ వెబ్బుకున్నంత నేర్పును బాండుఫీల్డుకన్యయందు లేకున్నను ఉద్రేకపూరితములగు ఉపన్యాసములే ఈమె విజయభేరులయ్యెను. ఉత్సాహజనితమైన యుపన్యాసములమూలమున వినువారలను తనతో నేకీభవింపచేయు శక్తి ఆమెయందుకలదు. ఆమె ఉపన్యాసములన్నియు భక్తిపూరితములై, మహోద్రేకమునుకలిగినవి. ఆమెచెప్పువిషయమందు విశ్వాసము, వర్ణనాశక్తి, యుత్సాహము నిండాఱియుండును. వాదించుటామెకు సహజముకాదు. ఆమె యభిప్రాయములన్నియు సత్యములేయని ఆమెనిశ్చితము. ఆమె యూహాలన్నియు ఆమెహృదయగహ్వరమునుండివెడలు అగ్నిజ్వాలాపూరితములైనవని సభాసదులకెల్లరకు తోపకమానదు. ఆమె గొప్ప ప్రచారకురాలును, ఉపన్యాసకురాలునె కాని నిర్మాతయును, మంత్రాంగవేత్తయును గాదు. బహుసూక్ష్మవిషయములనన్నిటిని పొందుపఱచి దూరదృష్టితో సిద్ధాంతీకరించు నేర్పు ఆమె యెరుగదు. ఇచ్చినసామగ్రితో మంత్రివర్గమున ప్రవీణతతో పనిచేయు కుశలత ఆమెకు కొరత. కచేరిలోకన్న ఉపన్యాసపుగద్దెపై నెక్కుడు తెలివితేటలు ఆమె కనపరచును. తదితర ఉపన్యాసకులంబోలె నొక యూతపదమునుగొని దానిని చమత్కార

ముగ నుపయోగించుశక్తి ఆమెయందుకలదు. కాని ఏదైన విధానమేర్పరచుట ఆమె వలను పడదు. అందువలననే పరికరవిషయమందు విజ్ఞానమామెకు తక్కువఅయ్యెను. ఒకసమస్యను గైకొని దానిని ముక్కముక్కలుగ విడదీసి పరీక్షించెడి వస యామెకు లేదు.

పార్లమెంటులో బొండుఫీల్డుకన్య తక్కినవారితో సరిసమానురాలుగాదు. ఎల్లపుడును తన ఉద్యోగశాఖనుండి వకాల్తీపుచ్చుకొని మాట్లాడినటుల కనుపడును. ఉద్యోగస్థుని ధ్వని ఆమె వచనములందు వినబడును. విచక్షణచేసి త్రాసుపై తూలచినటుల చెప్పుట ఆమె నేర్వదు. విమర్శల నేమిసేయవలెనో కూడ ఆమెకు తెలియదు. తన నిశ్చితాభిప్రాయములకును, ఆలోచనలకును సరిపడిన విషయజ్ఞానము ఆమెకు తక్కువ. తత్కారణమున తనశాఖయందు వ్యవహరించుతరి బొండుఫీల్డుకన్య యించుక విహ్వలయగుచుండును. ఎల్లపుడు క్షమార్పణార్హురాలుగ కన్పడును. సంఘమునుద్దేశించి ఎద్దియైన చేసినపుడు ఆమె యించుక కళవళపడును. తనశాఖయందుండు విజ్ఞానవంతులు వక్కాణించిన దాని నామె యొక్కచో విమర్శించనేరదు. ఒక్కచో తృణీకరింపనేరదు. ఫలితము తన ప్రతివాదులయెడల శక్తిహీనురాలుగను, స్నేహితులపట్ల లజ్జావతిగను చూపట్టును. తనమిత్రుల ఆశయములతో సానుభూతి చూపునుగాని తనపైబడు విమర్శనపుపోటుల నెటులతప్పించుకొనుటయో ఆమె ఎరుగదు. అందుచేత నేటికి రెండున్నరసంవత్సరములనుండియు మంత్రివర్గమునఉన్నను ఆమె స్త్రీలలో ఖ్యాతిగాంచిన ఒక వ్యక్తియని తప్ప మఱి ఎవ్విధముననను ఇతరులెఱుంగరు. ఆమె కార్యక్రమములందొకవిధానమును చూడము. ఆమెప్రాముఖ్యము స్త్రీత్వమునగాని సహజనైపుణ్యమునగాదు. స్త్రీల వర్తకసంఘమునందు బొండుఫీల్డుకన్య చాలకాలము పనిచేసినదగుటచే ఆమెచేసిన ప్రచారము మిగుల నుతికెక్కెను.

విశాలమై, సదుద్దేశములుగలదై ఆమెహృదయ మలరారుచుండును. బహుప్రయాసపడి పనిచేసి సాధించెడి వ్యక్తి. కావలసినవిషయములను ధైర్యముతో ప్రకటించెడి గుణమామెది. ప్రథమస్త్రీమంత్రిగాన ఆమెనామము ఆచంద్రార్కముగ ప్రకాశించును."
(హె రో ల్డు లా స్కి అ ను వా ద ము.)

ఒక్క ఇంగ్లండుదేశముననేగాక ప్రతిదేశమునను నేడుస్త్రీలు ఉన్నతదశలలోనికివచ్చి అనేకవిధములుగ దేశసేవచేయుచు కీర్తివంతులగుచున్నారు. మనదేశమున మహాత్మగాంధిగారి ప్రభావమున మూలనున్న మానినులెందరో ముంగిటకువచ్చి దేశసేవాపరాయణులగుచున్నారు.

గృహలక్ష్మిపాఠకు రాండ్రు సెప్టెంబరు 10-వ తేదిలోపున పూరించిపంపుటకు:

ము ది త ల్ నే ర గ రా ని వి ద్య గ ల దే ము ద్దా ర నే ర్పిం చి న న్

# క్షమాపణ

చి॥ మామిళ్ల శివరామకృష్ణప్రసాదుగారు

౧

అది సంధ్యాసమయము. వింతవింత రంగులతో ఆకాశమంతా అలంకరింపబడినది. చల్లనిపిల్లగాలి మెల్ల మెల్లగా వీస్తూఉన్నది. స్నేహితుడువచ్చేసమయము సమీపించినదని నవ్వుతూ కలువపూలు ఆకాశంవైపు చూస్తూఉన్నవి.

పలుచని తెలిచీరెధరించి దేహకాంతులు సంధ్యారాగములో మిళితమైపోవ, విలాసంగా నడుస్తూ ప్రభావతి మంచినీటిబావివైపు వెళ్లుతూఉన్నది. బావిదగ్గర చాలామంది ఆడవాళ్లు లోకాభిరామాయణం చెప్పుకుంటూ నీళ్లుతోడ్తూ ఉన్నారు. ప్రభావతి బిందె ఒకచోటపెట్టి ఆకాశంవైపుచూస్తూ ఏమేమో ఆలోచనచేస్తూ ఉన్నది. ఆమెఆలోచనకు అంతుకనపడలేదు. బావిదగ్గరున్న స్త్రీలందరు వెళ్లిపోయినప్పటికి ఆమె అట్లే ఆలోచనచేస్తూ ఉన్నది. ఆమె అంతగా ఆలోచనలో మునిగిపోవుటకు కారణం లేకపోలేదు. తొమ్మిది సంవత్సరముల క్రింద లండనులో విద్యనభ్యసించుటకు వెళ్ళినభర్త ఒకటి రెండు దినములలో తిరిగి రానున్నాడు. అతడు లండను పోవునపుడు, ఆమె ఏనిమిదిసంవత్సరముల బాలిక; ఇపుడామె పదునేడుసంవత్సరముల పడుచు. తనభర్త తన్ను గుర్తుపట్టునో లేదోయని ఆమె యోచింపగడగెను. నాగరికతకు నిలయమగు లండనుపట్టణమున అతడెన్ని క్రొత్తపద్ధతుల నేర్చుకొనెనో, తానుధరించు చీరెలను, తానుముఖమునదిద్దు తిలకమును, తనమాటలను విని అతడెంత ఏవగించుకొనునో యని ఆమెభయపడుచుండెను. అతడు తన్ను పలుకరించునా లేక పాశ్చాత్యసుందరులను జూచిన కనులతో తన్నుజూచి అసహ్యముపొందునా? పాశ్చాత్యనారీమణులయందలి మక్కువచేత తన్నుపూర్తిగా విసర్జించునేమో? అట్లయినచో అతడే సర్వస్వమని నమ్మియున్న తాను ఏమికావలయును? అని పరిపరివిధముల యోచించెను. ఆమెకనులనుండి నీటిబొట్లు జలజల రాలెను. కాలగర్భమున నేమున్నదో యని తలచుచు నీటిబిందెతో వెడలిపోయెను.

౨

ఒకమాసము దినములు గడచెను. ఒకభవనమున పటములతో మిగులరమ్యముగా నలంకరింపబడియున్న గదియందొకమూల ప్రభావతి ఒంటరిగ కూర్చుండియుండెను. విద్యుద్దీపములకాంతిని ఆమె శరీరము మెరిసిపోవుచుండెను. కాని ఆమెముఖమున సంతోషచిహ్నమొక్కటేనియు గాన్పించుటలేదు. ఇంతలో తటాలున గదిలోనికి మనోహరుడు ప్రవేశించెను. అతడు కొంచెము పొడగరి, విశాలమైన నేత్రములు, పచ్చని పసిమిరంగుగలదేహము, అతని సౌందర్యమునకు మరింతవన్నె బెట్టుచుండెను.

క్రిందకూర్చునియున్న భార్యనుజూచి మనోహరుడు మెల్లగా "ప్రభావతీ! ఈగదిలో ఇన్నికుర్చీలుండగా నీవుక్రింద కూర్చుననేమి? కుర్చీమీద కూర్చునుటకూడ పాశ్చాత్యపద్ధతియని తలచితివా? సింహాసనముమీద కూర్చున్నట్లు నేను కుర్చీలోను, నీవు క్రిందను కూర్చునుట చాలాఅసహ్యంగా ఉంటుంది. ఇదిగో ఈకుర్చీలో కూర్చునుటకురమ్మా" అనిపిలచెను.

భర్తఆజ్ఞప్రకారము మెల్లగాలేచి ప్రభావతి కుర్చీలోకూర్చుండెను. ఆమెముఖమును రెప్పవేయక చూస్తూ, కొంచెముముఖము చిట్లించి మనోహరుడు "ప్రభావతీ! నీకుమాటలురావా? ఒక్కసారైనా మాట్లాడవు. నీవేమి తలుస్తూ ఉన్నావో నాకుతెలియుటలేదు." అనియనుచు కొంచెమునేపూరకుండి మరల, "ప్రభా

వతీ! నీవు వెంట్రుకలను చాలాబిగువుగా అల్లి జెడవేసుకుంటున్నావు, అది చాలా అసహ్యమైనపని; వెండ్రుకలను వదులు వదులుగా కొంచెము చెవులపైగా వచ్చునట్లు వదలి జెడవేసుకుంటే చాలాబాగుంటుంది; చూడు నీవుఇల్లువదలి వీధిలోనికి పోవునపుడు వట్టికాళ్లతో వెళ్లడం చాలాప్రమాదము; కోమలమైన నీపాదాలు కందిపోయి కొన్నిదినములకు వికారరూపంగా ఉండును కాబట్టి చక్కని మేజోళ్లతొడుగుకొని వాటిపై బూట్సువేస్తే చాలాఅందంవస్తుంది. నీయుద్దేశ్యమేమిటి" అన్నాడు. ప్రభావతి కొంచెముతలవంచి "అవి మనదేశమర్యాదకు చెందినవస్తువులుకావు; అవి లేకుండా మనదేశంలో కాలము గడుపవచ్చును." అని మెల్లగా పలికింది. ముఖము చిట్లించి మనోహరుడు "నేను తప్పకుండా ధరించమంటే వానిని ధరింపవా?" అన్నాడు.

"తమఆజ్ఞకు భిన్నము లేదు, నాకిష్టములేకున్నను తమరు ధరింపమన్నచో ధరించితీరెదను" అని ప్రభావతి జవాబుచెప్పెను.

"నీకుఇష్టము లేకుండా వాటినిధరిస్తే చాలా అందవికారంగా ఉంటావు. నీదయవచ్చినట్లు పోగనిమ్ము. నీప్రవర్తన నాకింకా బోధపడలేదు. నీవునన్ను మనసార ప్రేమించావో లేదో నాకుతెలియదు. నిజముగా భారతనారీమణులు తమభర్తలయెడ సహజమైన ప్రేమగలవారుగా నుండరు. లోకానికి వెరచి తప్పనిసరిగా కొంత కృత్రిమప్రేమ భర్తలయెడ కనబరుస్తూ ఉంటారు; దీనికికారణం వాండ్లు కోరుకొని చేసుకొనిన భర్తలు కాకపోవటమేను. ఇట్టియవస్థ పాశ్చాత్యదేశములలోలేదు. నిజంగా భార్యాభర్తలప్రేమంటే అచ్చటనే చూడవలెను. వాండ్లు మనసార ఒకరినొకరు ప్రేమించి చేసుకుంటారు. కాబట్టి చాలాసౌఖ్యంగా ఉంటారు; కృత్రిమప్రేమ వాండ్లకు తెలియదు." అనిచెపుతూ మనోహరుడు కోటుజేబునుండి ఒక ఛాయాచిత్రమును తీసి ప్రభావతి యెదుట పెట్టెను. ములుకులబోలు పలుకులను వినుచు లోలోన కుమిలికుమిలిపోవుచున్న ప్రభావతి ఆఛాయాచిత్రమును చూడదొడగెను. అదియొకపాశ్చాత్యసుందరి యొక్క ఛాయాచిత్రము. ఆమె కాపటమునుజూపుచు మనోహరుడు "ప్రభావతీ! చూడుమా సౌందర్యము. ఆవిశాలనేత్రములు, చిరునవ్వుదొంతరల దొర్లించుచున్న ఆపెదవులు. అహా! నీవును ఇట్లుండిన ఎంతబాగుండును? ఈమె నాస్నేహితురాలు. నేటివరకు ప్రతిదినము జాబులు వ్రాయుచున్నది. ఈమె సౌందర్యవతియని నీవును ఒప్పుకొనక తప్పదుగదా! భారతరమణీమణులలో మచ్చునకైన ఇట్టి సౌందర్యము గలవారున్నారా? నే నీమెనెట్లుప్రేమించుచున్నానో నీవును ఆమెనట్లే సద్భావముతో జూడవలెను." అని యేమేమొ చెప్పుచుండెను.

ప్రభావతి కనులనుండి అశ్రుకణములు రాలదొడగెను. ఆమెదుఃఖమును దిగమ్రింగ ప్రయత్నించెను— కాని ఎట్లు? గదినుండివెడలిపోబోయెను. కాని ఆమెకన్న త్వరగా మనోహరుడు వెడలిపోయెను. ఆమె నేలపైబడి మూర్ఛిల్లెను.

## 3

ఒకనాటి రాత్రి దాదాపు తొమ్మిదిగంటలవేళ ప్రభావతి వంటగదిలో కూర్చుండి నిప్పుపై అప్పడములు కాల్చుచుండెను. ఇంతలో ఆమెఅత్తగారు పెద్దగఏడ్చుచు "అయ్యో! ఇంకేమిగతి? ఇంటిలోమనకెంత గతిపట్టెనురా?" అని కేకలువేయుచు పరుగెత్తుకొనివచ్చెను. ప్రభావతి తెల్లబోయి గడగడవణకుచు నిలచిపోయెను. "అయ్యో! అబ్బాయికి పెరటిలో పాముకరచినది, క్రిందపడిపోయినాడు" అని అత్తగారు వెఱ్ఱికేకపెట్టి నేలపైగూలెను.

"పాముకరచినది" అనుపలుకులు వినినంతనే ప్రభావతి సర్వమునుమరచిపోయినది. రానున్నభయంకరజీవితము ఆమెకనులముందు మెరసిపోయెను. ఆమె పిచ్చిదానివలె కేకలువేయుచు పెరటిలోనికి పరుగు పరుగున బోయెను. ఒకదీపముముందు కాలునకు కట్టు కట్టుకొని బాధపడుచున్న భర్తనుగాంచెను. ఆమె ప్రాణములు పైననే లేచిపోయెను. "తమకిపుడెట్లున్నది" అని భర్తను ప్రశ్నించి, ఆతడు జవాబుచెప్పునంతలోనే నలుదిక్కుల పరికించి, చెట్టుప్రక్కనుండి ప్రాకిపోవుచున్న పామునుజూచి, చంగున అచ్చటకు గంతువైచి "నన్నేల కరవరాదు? ఇంకా నాబ్రతుకెందుకు?" అనియనుచు, భర్త కేకలువేయుచున్నను వినక ఆపాము తలపై చేతితో కొట్టెను. ఆపాము క్షణములో ఆమెకోమలహస్తమున రెండుగాట్లు వైచెను. ఆమె నేలపైబడెను......మనోహరుని కనులనుండి బాష్పబిందువులు రాలెను.

౪

ప్రభావతి మూర్ఛనుండి తేరుకొనునప్పటికి "ప్రమాదములేదు, తాచుపాముకానందున కొలదిగంటలలోనే నిమ్మళించును, భయపడనవసరములేదు" అను డాక్టరుమాటలు ఆమెచెవులబడెను. డాక్టరు గదినుండి వెడలిపోయినతరువాత ప్రభావతి మెల్లగా కన్నులువిప్పెను. తనపాన్పుప్రక్కన నిలచియున్న భర్తపై ఆమె చూపులు పడెను. సిగ్గుచే మరల కన్నులు మూసికొనెను. ఇంతలో మనోహరుడు "ప్రభావతీ! మేలుకొనియున్నావా?" అనిప్రశ్నించెను. ఈపలుకులు ఆమె కమృతప్రాయములయ్యెను. తొట్రుపడు మాటలతో "పాము—మీరు క్షేమముగానున్నారు కదా" అని యామె ప్రశ్నించెను. "నేను క్షేమముగానే యున్నాను; వైద్యసహాయము త్వరలోజరిగినందున మన మిఱువురము జీవించితిమి......పిచ్చిదానివలె నీవట్లేలచేసితివి?" అని మనోహరుడు దీనముగా బల్కెను. కన్నులకు చీరచెరగు అడ్డముగాపెట్టుకొని ప్రభావతి "మీరునాప్రాణప్రియులు, మీతో నేనును చచ్చిపోవలయునని ప్రయత్నించుటలో తప్పేమియున్నది?" అని పలికెను.

మనోహరుని ముఖమున ఒకనూతనశోభ ఆవిర్భవించెను. ప్రియురాలి దేహముపై జేయివైచి "ప్రభా! పవిత్రమైన నీప్రేమ కనుగొనలేక నేనుపలికిన పలుకులను మరచిపొమ్ము. నీవేషభాషలలో మార్పు తేవలయునని నిన్ను విసిగింపను. నీవు నాప్రియురాలవు. నీవులేకున్నచో నాజీవితము దుఃఖభాజనమైపోవును. నీవే నాసర్వస్వమని నమ్ముచున్నాను." అని మనోహరుడు మెల్లగాననెను. "......ఆపాశ్చాత్యసుందరియో?" అని ప్రభావతి యులికిపాటున ప్రశ్నించెను. మనోహరుడు తలవంచెను. నయనము లశ్రుపూరితములయ్యెను. దీనముగా "ప్రభా! నాకామె స్నేహితురాలు మాత్రమే. నాహృదయసీమయందు నీకుదక్క పరులెవరికిని చోటులేదని ప్రమాణమాచరించెదను. ఇదివరలో నేపలికిన పలుకులకు నన్ను క్షమింపుము." అని పలికెను.

"మీపాదసేవకురాలనగు నేనా మిమ్ము క్షమించునది? కొలదిదినములక్రింద భారతరమణీమణులనందరను మీరు నిరసించియున్నారు. వారిప్రేమ కృత్రిమమని అపవాదముగల్పించియున్నారు. కోమలహృదయులగు నారీమణులాపలుకులు విన్నచో ఎంతనొచ్చుకొందురోకదా? పాశ్చాత్యనాగరికతాపథమునబడి పోవుచున్న వారెందరీవిధముగ తలచుచున్నారోగదా? పవిత్రురాండ్రగు భారతనారీమణులపై ఇట్టి దురభిప్రాయములుండుట మహాపాతకము. మీ రాదినము వారలనునిరసించినందులకు మీక్షమాపణ వారిపత్రికయగు 'గృహలక్ష్మి' ద్వారా వారలకందజేయుట యుక్తము. ఇట్లుపలికినందులకు నన్నుక్షమింపుడు." అని ప్రభావతి పలికెను.

మనోహరుడు:—ప్రభా! నీవొనర్చినకృత్యమువలన సత్యమును గ్రహించితిని. నన్ను క్షమింపుము, నేనట్లేయొనర్చెదను.

# ఇంద్రాణీపూజా ప్రబోధము

నాఁలేటి సీతారామగారు

[పూర్వము వంగరాష్ట్రమున భాద్రపదమాససంక్రాంతినాఁడీ యింద్రాణీపూజ జరుపఁబడుచుండెడిది. కాలక్రమమున నాయాచారము నశించిపోయినది. దీనినే రాటపుపూజయని కూడ నందురు. స్త్రీలే యీపూజనొనర్చువారు. ఈపూజచే బ్రాహ్మణియొకర్తు ధనధాన్యములఁబడసిన కథకూడఁగలదు. ఆదినమున స్త్రీలు రాటమునలంకరించి పూజాగృహముననుంచి స్నానమాచరించి పూవులు, పండ్లనుదెచ్చి దేవిపూజనొనర్చి ఖద్దరువస్త్రములు ధరింతురు. తదనంతరము రాటమును గీర్తింతురు. వంగరాష్ట్రమున నేఁడాపూజచేయువారొక్కరును లేరు. రాట మొకసిరిగా వెలసెడిది. నేఁడదిపోయినది. ఇంద్రాణీకృప హారికెట్లులభించును?]

౧

బాలభానుసువర్ణరేఖాళిఁదోఁగి
వరలుచున్నది ప్రకృతి సర్వమ్మునేఁడు;
పూతమగునట్టి ప్రత్యూషమునన దేల
పండుకొనెదమ్మ? లెమ్మింకవంగబాల!

౨

స్వచ్ఛమైనట్టి జలముల జలకమాడి
వలపులీనెడు నవ్యపుష్పములుగోసి
ఆలసింపకపూజాగృహమున కరుగు
మమ్మ! ఇంద్రాణిపూజింప నతులభక్తి.

౩

బ్రాహ్మణి యమేయధనరాశిఁబడసెఁదొల్లి
వరగ రాటపుపూజ లొనరిచి కాదె?
ఇట్టియారాధనముల నేఁడేలమాని
బహుళదారిద్ర్యవారాశిఁబడగఁజాతుమ?

౪

వడకినేసిన పరిశుభ్రవస్త్రములను
ధారణముచేయుడంచునుదారసరణి
మనమహాత్ముఁడు బోధించువనిత! దానిఁ
జేయుమింక నింద్రాణినర్చించినీవు.

౫

"నిత్యము భారతీయుల నవపాన్పున
నిద్దురపుచ్చే రాట్నంబా!
భారతజననిని గీర్తిచంద్రికల
వరలఁజేయు నోరాట్నంబా!"

౬

అనుచుఁగీర్తించి మంజులమైనరుతిని
మించువేడుక దేవినర్చించునీవు
ఖద్దరుంగట్టి నిలుచున్న కాలమందు
భరతజనయిత్రి మోదబాష్పములురాల్చు.

# పూలసజ్జ

కాళూరి వేంకటరామారావుగారు

## ఏడవ పుష్పము: తీర్పు, పర్యవసానము

ఒకనాడు పనిమీదపోవుచు చెరసాలయందు బంధింపబడియున్న కాంతమ్మను పున్న చూచెను. చిక్కి శల్యావశిష్టమైయున్న యామె దీనవదనమును గాంచుసరికి పున్నశరీరము "ఝల్లు" మని జలదరించిపోయినది. భయంకరఖడ్గప్రహారమైనట్లామె హృదయమున దుర్భరవేదన బయలుదేరినది. తాను చేసిన మహాపరాధము మూలమున ఏపాపమును ఎరుగని కాంతం బాధలపాలగుట కండ్లారచూచినప్పటి కామెమనస్సున పశ్చాత్తాపముదయించినది. తనఅసత్యములకు భగవంతునిముందర జవాబుచెప్పకతప్పదుకదాయని ఆమె భయపడిపోయినది. ఆనాడు భోజన మామెకు నోటికి రుచించలేదు.

చూచినవారందరును ఆమెకేదియోదయ్యముపట్టినదని భావించిరి. తనలో తనే ఏదోఅస్పష్టవచనములను నిత్యమును పున్న గొణుగుకొనుచుండెడిది. సమీపమునకు వచ్చువారిని చూచి బెదరుచూపుల నిగుడ్చుచుండెడిది. రాత్రింబగళ్లామెకు విశ్రాంతిలేకపోయినది. ఆమెచేసిన నేరములు భయంకరరూపములు ధరించి ఆమెనునిలువనీయకుండెను. కాని అప్పటికైనను తననేరమును ఒప్పుకుని పశ్చాత్తాపమును వెలిబుచ్చి కాంతమును రక్షించుట కాకతినురాలిచి తాను సిద్ధపడలేదు.

చివరకు న్యాయాధిపతి తీర్పును చెప్పివేసెను. ఉంగరమును దొంగిలించియునుగూడ నేరమును ఒప్పుకొననందుకు కాంతమ్మకును, ఆమె నేరమునకు దోహదమొసంగినందుకు జగ్గయ్యకును యావజ్జీవప్రవాసశిక్ష విధింపబడెను. వారిఆస్తిని వేలముపేయగా వచ్చినధనమునందు కోర్టుఖర్చులుపోయి మిగిలినదానిని జమీందారువారికిచ్చివేయునట్లాజ్ఞాపింపబడెను. మరునాడు తెల్లవారకపూర్వమే వారినిద్దరిని రాజధాని సరిహద్దులను దాటించి విడిచిపెట్టి వచ్చుటకు ఏర్పాట్లు జరిగినవి.

అంతకుపూర్వము రెండురోజులక్రిందటే కాంతంఅమ్మాళికి బహుమానముగా నొసగిన పూలసజ్జ మేజాబల్లపైనుండగా జమీందారిణిచూచినది. పున్ననుచూచి విచారముతో నామె "ఆసజ్జని అక్కడనుంచితీసెయ్యి. దాన్నిచూసేటప్పుడల్లా నాకుదుఃఖం ఆపుకోలేకుండావస్తూంది. విచారకరములగుసంగతులన్నీ జ్ఞాపకమురావడంచేత నామనస్సుకి శాంతిలేకుండావుంది" అనియాజ్ఞాపించినది.

పున్న ఆసజ్జను తీసుకుని ప్రవాసమునకు పోవుచున్న కాంతమ్మనుచూచి హేళనగా "అమ్మా! కాంతంగారు! తమబహుమానం తమరేస్వీకరించండి. నీబహుమానంపుచ్చుకోడానికి అమ్మగారికిష్టంలేదు. ఈదరిద్రపు సజ్జనుయిచ్చి మంచిచీరను లాగేవుకాని నీరోజులుతిరిగిపోయినవి. ఇదుగో నీసజ్జను నీతోటే తీసుకుపో" అని ఆమెముందు సజ్జను విసరికొట్టి తలుపు గభాలునవేసుకుని లోపలికిపోయినది. జన్మస్థలమును వదలిపోవునప్పటి వారిమనము లెటులుండెనో?

కన్నీరుగార్చుచు కాంతం సజ్జనుతీసుకొన్నది. జన్మదేశమును వదలుకొని పోవుచున్న యాదీనులవద్ద ఒకకర్రయైనను సహాయార్థము లేకుండెను. తాముచిరకాలము సుఖజీవనమును గడిపిన యింటివైపు మరల మరల చూచుచు కాంతం దుఃఖభరమున తలవాల్చుకొని నడుచుచుండెను. ఆయింటిని వదిలిపెట్టుట యామెకు బహుకష్టముగానుండెను. ఆయిల్లును, కోటగోపురములును, ఊరిలోని సోమేశ్వరాలయశిఖరాగ్రములును దృష్టిగోచరమగుచున్నంతసేపును ఆమెయట్లే వెయ్యిసారులైనను వెనుకకు తిరిగిచూచినదని చెప్పవచ్చును. చివరకొకచిన్న పర్వతముమాటున ధర్మవరదుర్గమంతయును మరుగుపడిపోయినది.

రమారమి జాముప్రొద్దెక్కుసరికి వారు ధర్మపరజమీందారీ సరిహద్దులను దాటిపోయిరి. అక్కడవరకును దిగబెట్టి వారితోవచ్చిన ప్రభుత్వోద్యోగి వెనుకకుపోయెను. అదియొక సాంద్రారణ్యప్రాంతము. జగ్గయ్యవిషాదభరితుడై ఒకచాపరాతిమీద కూలబడిపోయెను.

## ఎనిమిదవ పుష్పము : ఆపద్బాంధవుడు

ధర్మపరజమీందారుల యరణ్యములపైని ఆదినారాయణయే సర్వాధికారి. జగ్గయ్యయును, కుమార్తెయును ఇంకను కూర్చొనియుండగానే ఆదినారాయణ వారిని సమీపించెను. అతడును జగ్గయ్యయును విదేశయాత్రా సందర్భమున జమీందారు పరివారమునందుండిరి. అప్పటినుండియును వారిద్దరికిని అత్యంతమగుస్నేహముకలదు. మిత్రునిచూచినతోడనే ఆదినారాయణ "ఓహో! జగ్గయ్యా, నువ్వేనా? మీకుప్రవాసశిక్షపడిందని విన్నాను. ఈవయసులో, ఈస్థితిలో ఇల్లువదలిపెట్టి పోవడం బహుకష్టసాధ్యమైనపని."

"సరే. కాని జగ్గయ్యా! చేతులోకర్రకూడాలేకుండా బయలుదేరేవు. ఇదిగో యీకర్రనువ్వుతీసుకో. కర్రమంచిబలమైనది. ఉపయోగంగా వుంటుంది" అనిచెప్పి ఆదినారాయణ తనచేతికర్రను జగ్గయ్యకిచ్చి జేబులోనుంచి కొంతసొమ్ముతీసి "ఇదిగో రాత్రి కొంతకలప వేలంవెయ్యగా వచ్చినసొమ్ము. దీన్ని మీరు దారి ఖర్చులకి వుపయోగించండి. ఇంతకంటె నేనేంచెయ్యగలను?" అని కంట నీరుపెట్టుకున్నాడు.

"ఆసొమ్ము జమీందారువారిదికదా!" అన్నాడు జగ్గయ్య.

"ప్రియమిత్రమా! ఆవిషయమై అంతఆలోచించనక్కరలేదు. జమీందారుల సొమ్మిదివరకే చెల్లిపోయినది. ఈవేలం చాలారోజులనాటిది. ఒకస్నేహితుడు డబ్బుచెల్లించలేకపోతే నేనప్పుడు బదులిచ్చి ప్రభువులసొమ్ము చెల్లేటట్లుచేశాను. నిన్నరాత్రి అతడుమళ్లా నాసొమ్ము నాకిచ్చేశాడు. ఇది భగవంతుడు నిజంగా నీకోసమనే యేర్పాటు చేశాడని నానమ్మకం. లేకపోతే యేనాడో బదులిచ్చినసొమ్ము నిన్నరాత్రిరావడమేమిటి?"

"సరే. అలాగైతే సొమ్ముపుచ్చుకోడానికి నాకభ్యంతరంలేదు. ఆదినారాయణా! భగవంతుడు నీకు యింకోకలాగయిస్తాడులే. కాంతం! చూసా! ఇంకామనప్రయాణం ప్రారంభించకముందే భగవంతుడు మనకెల్లాసహాయం చేస్తున్నాడో! అతడెంతదయామయుడో గ్రహించుకో."

ఆదినారాయణ కండ్లనీళ్లుగ్రుక్కుకొనుచు సెలవుపుచ్చుకొనెను. "జగ్గయ్యా! సెలవు. అమ్మా! కాంతం! వెళతాను. భగవంతుడు మిమ్ము రక్షించుగాక" అని ధైర్యముచెప్పి వెళ్లిపోయినాడు. కుమార్తె చేయిపట్టుకొని అడవినిబడి జగ్గయ్య విశాలప్రపంచకములోనికి బయలుదేరినాడు.

## తొమ్మిదవ పుష్పము : ఆశాలేశము

ఒకనాడు మరొకపర్వతమయప్రదేశమున ప్రయాణము చేయవలసివచ్చెను. మార్గము దుర్గమమైయుండెను. ఎంతదూరము నడచినను ఒక్కగ్రామమైనను వారికి కనబడలేదు. జగ్గయ్యకి హఠాత్తుగా జ్వరము తగిలినది. ఒక్కఅడుగైనను ముందుకుపెట్టలేక అతినీరసముతో అత డొకపర్వతవాలుప్రదేశమున కూలబడిపోయెను. అతని నోరెండిపోయి మాటలాడుశక్తి నశించినది. తండ్రిదురవస్థచూచి కాంతం భయభ్రాంతురాలైపోయినది. తండ్రిగతియేమగునోయని యామె హృదయము వేదననందుచుండెను. మంచినీటికొరకెంత ప్రయత్నించినను చుట్టుప్రక్కల ఒక్కనీటిబిందువుకూడ దొరకలేదు. పరిసరములందెవరైన నుందురేమోయని సహాయముకొరకు కాంతంగొంతెత్తి కేకవేసినది. కొండకోనలలోనుండి ప్రతిధ్వనులుతప్ప వేరుజవాబేలేకపోయినది. కనుచూపుమేర యెక్కడను యిండ్లుకనబడలేదు. నిరంతరప్రయాణములమూలమున బడలియుండి

నప్పటికిని, పాదములు కందిపోయి బాధపెట్టుచున్నప్పటికిని కాంతం మెల్లిగా కష్టపడి అచ్చటికొండపైకెక్కి చుట్టుప్రక్కల జనసంచారమున్నదేమోనని పరికించినది. కొండకు రెండవప్రక్క దిగువభాగమున నొక చక్కనియిల్లొకటి కనబడినది. ఇంటిచుట్టును పచ్చనివరిచేలతో నిండి పొలములు లక్ష్మీకళ లొలుకుచుండెను. పచ్చనిగడ్డిబీడులు నేత్రపర్వ మొనర్చుచుండెను. మహారణ్యామధ్యమున ఋషికుటీరమువలె అగృహము ప్రశాంతమనోహరమైయుండెను.

కాంతమ్మకు ధైర్యముకలిగినది. ఒక్కపరుగున నాయింటిని సమీపించినది. దుఃఖముమూలమున డగ్గుత్తికపడినకంఠముతో గ్రుడ్లనీళ్లగ్రుక్కుకొనుచు ఆమె సహాయముకొరకు ప్రార్థించినది. ఆయింటి యజమానియగు రామన్నయును భార్యయును కాస్తంత వయసుముదిరినవారు. నిస్సహాయురాలగు కాంతమ్మను చూచి ఆదంపతుల హృదయములు కరిగిపోయినవి. పాలిపోయినముఖమును, శల్యావశిష్టమైన శరీరమును గాంచి వారు కడుంగడు దుఃఖించిరి.

"ఎడ్లనికట్టుకుని బండితోలుకెళ్లి ముందామనలాతణ్ని యిక్కడికి తీసుకురా, లే, ఆలస్యంచెయ్యాకు" అని రామన్నతో అతనిభార్య ముత్యాలు చెప్పినది. బండి తయారుచెయ్యమని రామన్న పాలికాపుతో చెప్పినాడు. కంచుచెంబులో కొన్ని వెచ్చనిపాలును వేరొకచెంబులోయిన్ని మంచినీళ్లును ముత్యాలు సిద్ధముచేసినది. జగ్గయ్యరాగానే పడుకొనుటకని ఒకపరుపును మంచమునువేసి సిద్ధముగానుంచినది. బండి కొండచుట్టును తిరిగిపోవలసియుండెను. ఎంతత్వరగా ఎడ్లనుపరుగెత్తించినను ప్రయాణము అరగంటకు తక్కువ బట్టదని రామన్నచెప్పెను. అదివిని కాంతం పాలును, మంచినీళ్లునుపట్టుకుని తనువచ్చినఅడ్డుదారినే మరల నిముషములో తండ్రినిచేరుకున్నది. ఈలోపునజగ్గయ్యకి కొంతప్రాణముచేరుకున్నది. అతడు మెల్లిగా ఒకచెట్టు మొదటికిచేరి మానుకిచేరబడి కూర్చున్నాడు. కుమార్తె ఏమైపోయినదో యని యాత్రతనందుచున్న నాతని హృదయము కాంతమ్మను చూచుటతోడనే యించుక నెమ్మదించినది.

రామన్నయును, అతనిభార్యయును జగ్గయ్యను బండిలో కూర్చుండబెట్టుకుని యింటికి తీసుకొనిపోయిరి. ఒకకుటుంబము స్వేచ్ఛగానివసించుట కనుకూలముగానున్న యింటిలోని ఒకభాగమును జగ్గయ్యకొరకు ప్రత్యేకముగ కాళీచేసియిచ్చివేసిరి. తండ్రిమంచముప్రక్కనే తనమంచమునుగూడ కాంతం వేసుకున్నది. ఎడతెగని ప్రయాణములవలన జగ్గయ్యకాజ్వరమువచ్చినది. అతనిశరీరము విశ్రాంతిని కోరుచుండెను. ఇంట్లో కలిగినంతమట్టుకు లేదనకుండ జగ్గయ్యకుకావలసిన వస్తువులన్నిటిని ముత్యాలుయిచ్చినది. పాలు, పెరుగు, నెయ్యి, కాయకూరలు మొదలగువానిని ప్రతిరోజును జగ్గయ్యకు రామన్న పంపుచుండెను. ఉదారస్వభావులును, సదయహృదయులునగు నాదంపతులలో స్నేహము సమకూర్చినందుకు సర్వేశ్వరునికి జగ్గయ్యయు, కుమార్తెయునుకలిసి కృతజ్ఞతాపూర్వకనమస్కృతులాచరించిరి. తీరికసమయములందు కాంతం కుట్టుపని చేయుచుండెను. కుట్టుపనియందామెకు మంచి ప్రవీణతకలదు. తమ్మాదరించిన రామన్నకుటుంబమునకు కావలసిన బట్టలనన్నిటిని ఆమెయే కుట్టియిచ్చుచుండెను. అవసరప్రస్తావనలతో నిరర్థకముగా ఒక్కనిముషమైనను పోనిచ్చెడిదికాదు. ఆమె తెలివితేటలనుచూచి ముత్యాలు అమితానందమునందినది. కుమార్తె సంరక్షణవల్లను, వృద్ధదంపతుల ఆదరణాతిశయములవల్లను జగ్గయ్య సంపూర్ణారోగ్యవంతుడైనాడు. అతనికి మామూలుబలముచేకూరినది. ఊరికనేకూర్చొనుట జగ్గయ్యతత్వమునందేలేదు. అతడు మరల సజ్జలల్లుటప్రారంభించెను. వ్యవసాయదారుల కుపయోగించు తట్టలుకూడ అల్లుచుండెడివాడు. మొదట ఒకఅందమగు తట్టను అల్లి కృతజ్ఞతాసూచకముగా జగ్గయ్య ముత్యాలుకియిచ్చెను. దానిఅందమునుచూచి యామె యెంతో ముచ్చటపడినది. రామయ్యకూడ జగ్గయ్యపనితనమును మెచ్చుకొనెను.

## పదియవ పుష్పము: లక్ష్మీవిలాసము

లక్ష్మీవిలాసమునకు సమీపముననే రామన్నకు వేరొకతోటకలదు. పొలముపనియందు మునిగిపోయిన రామన్న కాతోటయందు తగుశ్రద్ధచూపుటకవకాశములేకపోయెను. అందుచే దానినిండతుప్పలును పొదలును సాంద్రముగ పెరిగియుండెను. ఆతోటను బాగుచేయుటకు జగ్గయ్య పూనుకొనెను.

కాంతంసహాయముతో జగ్గయ్య తోటపనిప్రారంభించెను. దినమంతయును తోటలోనే పనిచేయుచుండెడివాడతడు. తోటనుదున్ని మళ్లక్రిందభాగించి రకరకముల పాదులునాటినాడు. కొన్నిమళ్లలో పూలచెట్లుపెంచెను. మడికిమడికిని మధ్యను కంకరదారులేర్పరచెను. పూలతోటపనిఅంతయును కాంతమ్మదే. కొద్దిరోజులకే తోటఅంతయు రంగురంగుల పూలతోనిండిపోయినది. పరిసరప్రదేశమంతయు మధురపరిమళములలో తేలిపోయినది.

ఫలవృక్షములుగూడ మామూలుకంటె అధికఫలములనిచ్చినవి. జగ్గయ్యచెయ్యివైచిన గొడ్డునేలగూడ ఫలప్రదమగుచుండెను. అతడు తనపూర్వకష్టములనన్నిటిని పూర్తిగమరచిపోయెను. అయిదుసంవత్సరములిట్లు గడచినవి. నూతనసౌఖ్యమయజీవనమునందు వారు తమకష్టములను మరచిపోయిరి. క్రమక్రమముగా జగ్గయ్య వృద్ధాప్యమునకు లొంగిపోవుచుండెను. అతనిశక్తి రోజురోజును మందగించిపోవుచుండెను. పనియందు ఆయాసము గోచరించుచుండెను. ఈసంగతి తెలిసినయెడల కుమార్తె భయపడిపోవునని అతడామెకు తనలోని మార్పును వెల్లడించలేదు. కాని అతని సంభాషణలే అతనిలోని మార్పును సూచించుచుండెను. పుష్పములను చూచినప్పుడతనికి కలుగుభావములు పూర్వమువలె సంతోషకలితములుగాక యిప్పుడు విషాదభరితములై యుండెను. శీతకాలము. చలి విపరీతముగానుండెను. రాత్రులందు వర్షముకురిసినట్లు మంచుపడుచుండెను. తోటలలోపువ్వుల అడావిడి తగ్గిపోయినది. గులాబిచెట్టున ఆఖరుకాపువ్వు ఒక్కటిమాత్రము మిగిలియుండెను. కాంతం దానిని కోయుటకు సిద్ధపడుచుండగనే ఒక చలిగాలి కది నేలరాలిపోయినది. దాని రేకలన్నియు నున్నయిపోయినవి. ఈవిషయమంతయు జగ్గయ్య గమనించుచుండెను. అతడు "అమ్మాయీ! మనజీవితాలు కూడా ఇదేమోస్తరు. వికసించినగులాబివలె మనంయౌవనంలోవుంటాం. కాని తక్షణమేగులాబివాడిపోతుంది. అలాగే మనయౌవనంకూడా మర్నాడే మాసిపోతుంది. అది అస్థిరము" అన్నాడు. ఈవాక్యములు కాంతం మనసును బీజాక్షరములవలె హత్తుకొనెను.

ఇంకొకప్పుడు కాంతం క్రొత్తగాకట్టినమళ్లలో విత్తనములను నాటుచుండెను. అదిచూచి జగ్గయ్య "మనంకూడా యీవిత్తనాలలాగే భూమిలోకలిసిపోయేకాలం వస్తుంది. కాని ఆవిషయమై అంతకంగారు పడనక్కరలేదు. ఈవిత్తనం కొద్దికాలానికి వృద్ధియైపుష్పించి ఫలవంతమగుచున్నట్లే మనంకూడా యీఅంధకారమునుండి విముక్తులమై శాశ్వతసౌఖ్యజీవితమును గడపగలదినము వస్తుంది. నేను మృత్యువువాతబడి దీర్ఘనిద్రను పొందేటప్పుడు నవ్వునాసమాధిపైని ప్రేమపూర్వకంగా నాటిన పూలచెట్లు పుష్పించడమే నేను శాశ్వతానందజీవితమును సుఖిస్తున్నాననడానికి నిదర్శనం: అదే నేను భగవంతుని సన్నిధానంలో వున్నానని తలుచుకోడానికి నీకు ఆనవాలు" అనిపలికినాడు.

ఈమాటలామెహృదయమును కలచివేసినవి. వృద్ధునికండ్లలోకూడా అశ్రువులు ప్రత్యక్షమైనవి. అతని హృదయము కొట్టుకొనుచుండెను. అచిరకాలముననే ఈప్రపంచమున తానుఒంటరిదైపోవక తప్పదని కాంతమ్మకు తెలిసిపోయెను. దుఃఖపూరితభాగములు ముమ్మరమైపోవ నామెకూడ జనకునిప్రక్కకూర్చొని అతనితోపాటుగ నశ్రువులరాల్చినది.



# వినాయక ప్రార్థనము

శ్రీమతి చోడవరపు రంగనాయకమ్మ గారు

(ద్విపద)

[స్త్రీలు పాటగా పాడుటకు అనువుగనుండునట్లు వ్రాయబడినది]

పురహరవరపుత్ర! పుణ్యచారిత్ర!
సురమునిగణస్తోత్ర! సుగుణ! ఉమపుత్ర!
భాద్రపదపు శుద్ధచవితిదినాన
బయలుదేరెదవయ్య భక్తులిండ్లకును
పురుషులె పూజింపవలెనని లేదు
వనితలె పూజింపవలెనని లేదు
బాలురె భజింపవలెనని లేదు
బ్రాహ్మణులే పూజింపనర్హులని లేదు
క్షత్రియవైశ్యులె చేయదగుననుచు
శూద్రులుపూజింపరాదంచు లేదు
వనితలు పురుషులు బాలబాలికలు
బ్రాహ్మలుక్షత్రియవైశ్యశూద్రులును
నిన్నుపూజింతురు నిండుముదమునను.
దుండి అందరిఇండ్ల నిండియుండెదవు
సర్వాత్మకా! నీవు సమభావమునను
సర్వజనములచేత బూజలందెదవు
కలువలు మారేడు గన్నేరుపువ్వులు
ఉమ్మెత్తదూర్వార ఉత్తరేణుపత్రి
వనరయిరువదియొక్క పత్రిపుష్పముల
సదమలమతులయి సల్పేరుపూజ
కుడుములుఉండ్రాళ్లు గొప్పబొబ్బట్లు
గారెలుపూర్ణాలు ఘనపాయసములు
అరిశెలుదోసెలు అప్పాలువడలు
చలిబిండి జిల్లేడుకాయలు నెయ్యి
పానకము వడపప్పు పనస దానిమ్మ
కదళీఫలమ్ములు ఖర్జూరపండ్లు
నారికేళంబులు నారింజపండ్లు
నైవేద్యమిత్తురు అంబికాతనయ!
కర్పూరహారతులు కనకపళ్లెరమున
కడుముదమ్ముననిత్తురు గజవక్రతుండ!
గజముఖాసురవధ కథవినిమరియు
సంతసమ్మునను సత్రాజిత్తుకథయు
విని ముదమొందెదరు విమలాకుమార!
ఘనయశోసువిశాల! కరుణాలవాల!
మూషికవాహనా! మునిజనలోల!
వందనంబులుగొను వరగుణజాల!

## పదునొకండవ పుష్పము : వేదన

చలికాలము పూర్తిగా ప్రవేశించినది. రాత్రులయందు చలిభరించుటకు శక్యముగాకుండెను. ఉదయము జాముప్రొద్దెక్కువఱకు మంచు తగ్గుటలేదు. జగ్గయ్యస్థితి రోజురోజు హీనమైపోవుచుండెను. క్రమముగా అతడు నీరసించిపోవుచుండెను. రామన్న సమీపగ్రామమునకుపోయి వైద్యుని తీసుకొనివచ్చెను.

వైద్యశేఖరుడగు లింగరాజు రోగినిపరీక్షించి ఔషధమిచ్చెను. అతనితోగూడ కొంతదూరముపోయి కాంతమ్మ తండ్రిస్థితినిగూర్చిప్రశ్నించినది. ప్రస్తుతమందెట్టియపాయమును లేకపోయినను ముందుముందు క్షయ వ్యాధి ప్రవేశించుననియును, అదియున్నను రోగముకుదురుట కష్టమనియును లింగరాజు అభిప్రాయమిచ్చెను.

జనకుడు ఆరోగ్యవంతుడగుట కవకాశములేదని తెలిసినతోడనే కాంతం గుండెలు బ్రద్దలైపోయినట్లయినది. ఆమెదుఃఖము మితిమీరిపోయినది. సాయంకాల మగుసరికి కొంత ధైర్యము తెచ్చుకొని ఆమె తండ్రి సమీపమునకు వెళ్లినది. తండ్రిముందు లేనిసంతోషమును తెచ్చుకుని ఆమె అతనికి సకలోపచారములను చేయుచుండెను.

ఏనిముషమున నేమి కావలసివచ్చునోయని యామె నిత్యమును అతనిప్రక్కనే కనిపెట్టుకొనియుండెను. చూపులవల్లనే హృదయమునందలి కోరికను గ్రహించి తండ్రికి సౌఖ్యము కలిగించెడిది. ప్రతిరాత్రియును అతని దగ్గిర మెలకువగా కూర్చొనుచుండెడిది.

“ఇట్లా నువ్వుకూచుంటే జబ్బుపడి పోతావమ్మా. మనిషికి కొంతవిశ్రాంతి వుండాలి. మేముచూస్తూ వుంటాం. నువ్వొకగంటసేపుపడుకో” అని ముత్యాలు యెంతచెప్పినను ఆమె వినిపించు కొనెడిదిగాదు. ఒకవేళ బలవంతమువల్ల పడుకున్నను తండ్రి కేబాధకలుగునో యను భయమున నామెకు నిద్రరాకుండెను. జగ్గయ్య ఒక్కసారి దగ్గినంతమాత్రమున నామెవణికి పోవుచుండెను. అతడు కదలినవెంటనే దగ్గిరకుపోయి ఆతురతతో “బాబూ! ఏంకావాలి?” అని అడుగుచుండెను. అతనికి బాగా యిష్టమగు కూరలను రుచికరముగావండి పెట్టుచుండెను. పక్కదుప్పట్లను దులిపి సౌఖ్యముగా పరుచుచుండెను. కథలను, పురాణములను చదివి అతనికి వినిపించుచుండెను. నీరసించిపోయిన ఆవృద్ధునిముఖమును చూచుసరి కామెకు కన్నీళ్లాగక దృష్ట్యవరోధమును కలిగించుచుండెను.

ఆనాటికానాడు హీనమైపోవుచున్న తనస్థితినిగాంచి తనకు మరణకాలము నెమ్మదిగా సమీపించుచున్నట్లు జగ్గయ్య గ్రహించెను. కాని అతడు నిర్విచారముగా సంసిద్ధుడయియుండెను. అతని మనస్సు ప్రశాంతమైయుండెను. “బాబూ!నువ్వులేకపోతే నేనెల్లాబతకడం? ఈలోకంలో నన్నాదరించేదిక్కెవరు?” అనికాంతం యేడ్చినది.

కృశించిపోయిన హస్తమును కుమార్తె వీపుపైవైచి నిమురుచు జగ్గయ్య “అమ్మా! యేడవకు. పరలోకంలో నీకొకతండ్రి వున్నాడు. నేనుగతించి పోయినను ఆతండ్రి నిన్ను విడిచిపెట్టడు. నీజీవిత మెలాగ గడుస్తుందన్న విచారము నాకులేదు. గాలిలో విహరించేపక్షులను సహితము పోషించు తండ్రి నిన్నుమాత్రము విడచిపెట్టునా? నీకుమాత్రం యేమికావాలి? పూటకు పిడికెడుఅన్నముకదా? కాబట్టి ఆవిషయమై నాకేవిచారమూలేదు. కాని యీలోకము పాపభూయిష్టము. దానిమాయలలోబడి నీమనోనైర్మల్యమును పాడు చేసుకుంటావేమోనని నాభయం. ఇప్పటివలెనే నిత్యమూ నీహృదయమును పవిత్రంగా వుంచుకుంటానని నాకు వాగ్దానంచెయ్యి. అల్లాఅయితే నేను నిశ్చింతగా చచ్చిపోతాను” అన్నాడు.

“బాబూ! ఆవిషయమై భయపడకు. నేను బతికి వున్నంతకాలమూ నీబోధనలను అనుసరించియే నా జీవితాన్ని నడుపుకుంటాను.”

## పండ్రెండవ పుష్పము : మరణము

జగ్గయ్యజబ్బు హెచ్చయిపోయినది. లింగరాజు ప్రతిరోజును వచ్చిచూచుచుండెను. జగ్గయ్య అవస్థ చూచి అతనిహృదయము నీరై పోయెను. మందుఖర్చుకొరకు కాంతమ్మ కొంతడబ్బు యివ్వబోయినది కాని అతడు పుచ్చుకొన నిరాకరించెను.

కుమార్తెనిపిలిచి జగ్గయ్య "అమ్మా! ఇంక రెండురోజులుగడువుందని లింగరాజుగారు చెప్పేరు. ఈలోకపు పనులన్నీపూర్తిచేసుకున్నాను. ఈరవంతకాలమూ యింకభగవధ్ధ్యానంలో గడిపేస్తాను" అనిచెప్పెను.

నిస్సారమైన అతనికంఠస్వర మామెకు భయముగొల్పినది. నిమిషనిమిషమునకును దిగదీసుకొని పోవుచున్న తండ్రినిచూచి ఆమెక్రుంగిపోయినది. "బాబూ! నువ్వుచెప్పినదేనిజం. దైవంమీద భారంవేసి నిశ్చింతగావుండు" అని మాత్రంయెలాగో చెప్పినది.

మిగిలిన రోజంతయు జగ్గయ్య నిశ్చలధ్యానమున గడిపెను. తన్ను చూడవచ్చిన వారితో అతడు పూర్వమువలె సంభాషించలేదు. ఇహలోకముపై నతనికి స్మృతిలేనట్లుండెను. అనంతసౌఖ్యధామమగు స్వర్గమునకు పోవుచున్నను సంతోషమున నతనిముఖమునూ తనదివ్యతేజమును ధరించినది. అతనికనులయందానందబాష్పములు నిల్చినవి.

మంచముప్రక్కనే కూర్చొని జనకునికి మనశ్శాంతిని దయచేయుమని దుఃఖాతిరేకమున మైమరచిపోయి కాంతమ్మ ప్రార్థించినది. ఈవిచారపు దర్శనమును, భక్త్యుద్రేకమును చూచి రామన్నయును, అతని కుటుంబమును విశ్చేష్టులై నిలువబడిపోయిరి. వారిమనస్సులుకూడ ప్రార్థనానిమగ్నములైనవి. చూచినవారికండ్లశ్రుపూరితములై పోయెను.

ఈకష్టసమయమున జగ్గయ్యకేలోపమును రాకుండ రామన్నయును, భార్యయును శక్తివంచనలేక తగుసహాయమొనర్చిరి. జగ్గయ్య తమయింటికివచ్చిన రోజు మంచిదని వారుతలచుకొనుచుండిరి. అతనిదగ్గిరకి ప్రతినిమిషమునువచ్చి "ఏం? ఎలాగుంది?" అని అడుగుచుండిరి. వారట్లు వచ్చినప్పుడు కాంతం దీనురాలై "ఏం? రామన్నబాబూ! బాబు బతకడానికేమేనా ఆశవుందా?" అని అడుగుచుండెను.

"అమ్మా! భయపడకు. మనమేమీచెప్పలేము. ఏమో! భగవదేచ్ఛ. నట్టేట్లో పడవలాగుంది. తల్లీ!" అని ముత్యాలు మాతృవాత్సల్యముతో పలుకుచుండెను.

ప్రతిరోజును తండ్రి ప్రక్కను కూర్చొని పుస్తకములను చదివి కాంతం వినిపించువాడుకయుండెను. జగ్గయ్యకామెకంఠరవము గంధర్వగానమువలె మధురమై వినబడుచుండెను. చివరరోజులలో భాగవతమందలి "నారాయణకవచము" ను ఎన్నిసారులో చదివించుకొని విన్నాడు.

మహాభాగవత గ్రంథమును తలవద్దపెట్టుకుని అతడు పడుకున్నాడు. కొంతసేపైనతరువాత అతడు మరల "అమ్మా! కాంతం! ఎంతప్రయాసతో నాకుఉపచారాలుచేస్తున్నావు? తల్లీ! నాకీజబ్బువొచ్చింది మొదలు నిద్రాహారాలు లేవుగదా నాయనా! నాకడుపునపుట్టి ఏమిసుఖపడ్డావు? నీవునాయందు చూపిన అపారప్రేమకు నేను కృతజ్ఞుడను. పితృవిధేయులగువారికిలభించే పుణ్యలోకములు నీకు లభించుగాక! ఈస్థితిలో ఆశీర్వాదములుగాక వేరేమి నేనియ్యగలను? కాని నాఆశీస్సుమాత్రం వృథాపోదని నిశ్చయంగా చెప్పగలను. సంతోషితులగు పితరుల ఆశీస్సులకంటె బిడ్డలకు మహదైశ్వర్యములైననూ గొప్పకావు. ఈమహాగ్రంథాన్ని తీసుకు దాచుకో. పరలోకయాత్రాసమయంలో నేను నీకిచ్చిన బహుమానమిదిఒక్కటే."

తెల్లవారుజామున జగ్గయ్యకు అయాసమధికమైపోయినది. ఇతరులాడు మాటలతనికి వినబడుటలేదు. నాడీచలనముసరిగాలేదు. అతిప్రయాసతో జగ్గయ్య "అమ్మా! నేనుపోతున్నాను. సెలవియ్యి. ఏదితల్లీ! ఆఖరు

సారి నీముద్దు మొగంచూడనీ." కుమారైముఖమును తనముఖముపై చేర్చుకున్నాడతడు. ఇద్దరికిని అశ్రుప్రవాహము ఆపశక్యముగాకుండెను. కొంతసేపైనతరువాత అతడు "అమ్మా! శక్తిక్షీణించిపోతూంది. మాటాడలేను. ఆయాసం" అన్నాడు. జగ్గయ్య కాళ్లును చేతులును చల్లబడిపోయినవి. కండ్లుతిరిగిపోవుచుండెను. పవిత్రజీవనుడగు జగ్గయ్య యిహలోకదుఃఖములకు స్వస్తిచెప్పి శాశ్వతసౌఖ్యనిలయమగు స్వర్గమును చేరుకున్నాడు.

మరణమన నేమియో కాంతమ్మ యెరుగదు. నీరసముచేత నతడు మూర్ఛపోయినాడనుకున్నదామె. అంతలో ఆతడు చనిపోవునని ఆమె అనుకొనలేదు. కాని అదృశ్యమామెను భయకంపితురాలి నొనర్చినది. ఆమె కెవ్వున కేక వేసినది. అదివిని రామయ్యకుటుంబ మంతయును లేచి ఆతురతతో పరుగెత్తుకొనివచ్చిరి. వారు రోగినిపరీక్షించి చనిపోయినట్లు చెప్పువరకును కాంతమ్మ కాసంగతి తెలియదు. కొయ్యబారిపోయిన ఆకళేబరమును కౌగిలించుకొని చూచువారిహృదయములు నీరగునట్లు కాంతమ్మ యేడ్చినది: "బాబూ! నీరుణం యెల్లాతీర్చుకోగలను? చిన్నప్పటి నుంచీ నేలదించకుండా నన్నుఎత్తుకున్న యీచేతులిప్పుడిల్లాపడివుండిపోయినవేమి? పుట్టినది మొదలు నన్ను బాగుచెయ్యడంలోనే అరిగిపోయిన యీచేతులను ఒక్కసారి ముద్దుపెట్టుకోనీ! బాల్యంలో అజ్ఞానంచేత నీమనస్సుకి బాధకలిగించినట్లయితే క్షమించు, తండ్రీ!" —కొదువ.

## నా ప్రేయసి

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

ఆలలన నెమ్మొగంబొకపూలతోఁట
అందుఁగలపువ్వులుంబండ్లు ననుదినంబుఁ
గాన్కగానాకుఁబంపును గాని తాను
లక్షవరహాలొసంగిన లాఁతికిడదు.
ఆలలితగాత్ర మొక్కరత్నాలరాశి
యన్యులకులోభనీయంబయగునుగాని
దానివెలఁగట్టగాలేము నేనుదక్క
దానిఁగొనలేఁడన్యుండు నేనుదక్క.

ఆరమణిచిత్త మనురాగమారుతంబు
మలయునంతఃపురోద్యానమండపంబు
అటకుఁజన నాకుమాత్రంబెయాజ్ఞ గలదు
పరులుచొఱకుండ మూయఁగాఁబడునుదలుపు.
ఆవనితమోవియందు లాస్యంబుసేయు
చున్న చిఱునగవమృతంపుజున్ను నాకుఁ
గానఁబడుఁగాని పరులకుఁగానఁబడదు
పుట్లకొలఁదిపుణ్యంబు సల్పుకొనియుంట.

## ప్రకృతిరాగము

అల్లూరి లక్ష్మీకాంతరావుగారు

స్వామి! నీవెన్నడో హిమాచలముపైన
మురళివాయించినావేమొ మోహనముగ
కాన నామంచుకొండలాగరగిపోయి
వరదలై పారి మఱిమఱివకదలొచు
ఎటకొ, పడిపోవుచుండె నదేరికెఱుక?
పాడగా, పాడగా నీవుగూడ స్వామి!
తన్మయత్వంబజెందితో, తనువెమరచి

ఆప్రవాహానలీనమైనావొ, కాక
ఎచ్చటిది నీలవర్ణ విశాతరగలను?
హర్షముప్పొంగజేయు మదాత్మలోన
వీణె యాసమయమందు నీవ్రేళ్లనుండి
జారిపడిపోయెనో నీటిజాలులోన
గాక, యెచ్చటివోయి శృంగారమైన
గాననాదము లీతరంగములలోన?

# టైరలుకన్య

ఆదిరాజు అమృతేశ్వరరావుగారు

ఐరోపాఖండమునకు చెందిన టైరలు-అస్ట్రియాయందు కాన్‌స్టెన్సుయను సరోవరము గలదు. ఈసరోవరము అల్‌ఫ్సు పర్వతావళిచే చుట్టబడినది. దీనికి ఆగ్నేయమున బ్రెగిల్జి యను పట్టణముగలదు. అప్పట్టణమందలి రాజసౌధంబులు, సౌధంబులు, గోపురములు, ఆలయములు సరోవర్గమున ప్రతిఫలించుచుండును. రాత్రులందు సరోవరమున జలముల ప్రతిఫలించు తారాగణము నింగిని సంచరించు మేఘముల నిరీక్షించుచున్నట్లుండును. ఇచ్చటి దృశ్యములు చూపరులకు విందుగొలుపుచుండును.

జన్మస్థలమగు బ్రెగిల్జిపట్టణమున టైరలుకన్యకకు భుక్తిగడవకపోవుటచే స్విట్జరులాండునకు పోయెను. అచ్చట నొకసంపన్నగృహస్తుని పశుల గాచుచుండెను. ఆపెసుగుణంబులచే తనయజమానుని విశ్వాసాదులు అచిరకాలములో జూరగొనెను. ఆమె తనపనియందు నెన్నడు పాలుమాలిగాని, విశ్రాంతిగాని, సెలవుగాని కోరియెరుగదు. ఆమె తన మాతృదేశము వదలిననాటినుండియు ఆయజమానునియొద్దనే సేవచేయుచుండెను. అందుచే యజమానుడును ఆపెను గౌరవాదులతో జూచుచుండెను.

రాత్రులందు తనయజమానునిబిడ్డలకుకథలుచెప్పియు; పద్యములు, గీతములుపాడియు వారికి ఆనందముకలిగించెడిది. ఆమెకు అచ్చట క్రొత్తప్రదేశములుగాని క్రొత్తవారుగాని లేకుండిరి. అచ్చటివారందరు గాఢమగుమిత్రులైరి. వారిలో కలసిమెలసి తిరుగుచు తన మాతృదేశమును సైతము మఱచిపోయెను. తనజీవితమును ప్రశాంతముగా జరుపుకొనుచుండెను. ఇట్లు బహువర్షంబులు గడచెను.

అది శీతకాలము. శిరోభారముచే శిరమువాల్చినపైరులు సూర్యరశ్మిని నిగనిగలాడుచుండెను. రైతులు తమపైరులపై దృష్టిసారింపరైరి. తమలోతాము సంభాషించుకొనుచు తొట్రుపాటుతో నడచుచుండిరి. జనులు చంచలదృష్టులతో నే వంకకు చూచుచు దీర్ఘాలోచనాతత్పరులై యుండిరి. స్త్రీలు గృహకృత్యముల సైతము నిర్వహింప నిచ్ఛలేనివారైరి. చేతిపనులు మూలబడెను. బాలురు సహితము ఆడుకొనుటకు బయటికిబోవ వెరచుచుండిరి.

ఒకనాటిసాయంకాలమున నొకతోటలో పెద్దసభ జరుపబడెను. అందు క్రొత్తవారికి ప్రవేశములేదు. ఆవరణచుట్టు తగిన బందోబస్తుచేయబడెను. సభామధ్యమున నొక మేజాబల్లయు దానివద్ద నొకఆసనమును అమర్చబడెను. సభాపతి ఆసనమునుండిలేచి నిలబడి ఏదియో ఉపన్యసించెను. పలువురు ఉపన్యసించిరి. తుదకు సభాపతి మరలనిలబడి మేజాపైనున్న పాత్రనుతీసుకొని 'మనశత్రువులదేశనాశనమునకై త్రాగుచున్నాను' అని అందున్న పానీయమును త్రాగెను. వెంటనే కరతాళధ్వనులు చెలరేగెను. సభముగిసెను. కొంచము దూరమున పశులగాచు నొకవ్యక్తి దీనినంతయు గనిపెట్టుచున్నట్లుండెను.

ప్రొద్దుగ్రుంకెను. చీకటులు దశదిశలు గ్రమ్ముచుండెను. జనులలో నూతనోత్సాహము ప్రబలెను. పట్టణమంతయు చాలచురుకుగానుండెను. 'ఒక్కరోజులో బ్రెగిల్జి మన దేశము కాగలదు' అనుపలుకులు వారి గుసగుసలమధ్య అస్పష్టముగా వినవచ్చుచుండెను. యువకులు ఉత్సాహముగానుండిరి. స్త్రీలు భయకంపితలగుచుండిరి. కాని బైరలుకన్య ఏలకో మిగుల యాందోళనపడుచుండెను. ఆమెకు మాతృదేశము జ్ఞప్తికివచ్చెను. తన బ్రెగిల్జి కళ్ళయెదుట కానవచ్చుచుండెను. స్నేహితులు దృక్పథమున గోచరించుచుండిరి. తనలో నిట్లు విచారింపనొడఁగెను. "ఆహా! ఇన్నిదినంబులనుండి నేను తిరుగుచున్న ఈపట్టణము నాశత్రువుల కునికిపట్టయియున్నది. నాచుట్టునున్నవారు నాకు ఆప్తులుగారు. శత్రువులు." ఇంతలో నామెకు దశదిశలనుండి 'పో, పోమ్మ. నీమాతృదేశమును రక్షింపుము. అవసరమైన నీప్రాణములనర్పింపుము" అనుపలుకులు వీనులజొచ్చుచున్నట్లుండెను. వెంటనే మాతృదేశమునురక్షించుటకై తన యసువులనైన బాయుటకు సంసిద్ధయయ్యెను. మాతృదేశసంరక్షణార్థమై బయలుదేరెను. పట్టణమంతయు మాటుమణిగెను; ఎచ్చటచూచినను నిశ్శబ్దముగానుండెను. అంత నామె అశ్వశాలకేగి తనచేపోషింపబడిన శ్వేతాశ్వముపై నధిరోహించి మాతృదేశోన్ముఖురాలయ్యెను. ఆకాశమంతయు మేఘములచే నావరింపబడియుండెను. హయము పట్టణపుసరిహద్దులనుదాటగనే శరవేగమున బోవుచుండెను.

క్రైస్తవదేవళమున పదునొకండుగంటలుకొట్టిరి. ఆమె కాందోళన ఎక్కుడాయెను. పండ్రెండుగంటలు కొట్టగనే బ్రెగిల్జిపట్టణప్రాకారద్వారము బంధింపబడును. కాన భగవానుని ఆమె ఇట్లు ప్రార్థింపదొడగెను. "ఓ దయానిధీ! నామాతృదేశమును సంరక్షింపుము; నన్ను సకాలమున నాపట్టణమున ప్రవేశించునట్లుచేయుము." ఇంతలో నా యశ్వరాజ మడుగు వెనుకకువైచి నిలబడెను. కారణమేమైయుండునాయని యశ్వము మెడపై వ్రాలి తొంగిచూడగా తాను పెద్దగుట్టపైనున్నట్లు తెలిసికొనెను. క్రింద పెద్ద యఘాతము. గుట్టకడు నిట్రముగానుండెను. దిగువ రైనునది ప్రవహించుచుండెను. అశ్వమునకు ధైర్యమును బురిగొల్ప వెంటనేఅది ఆనదియందు గుభాలునదూకెను. నది గంభీరముగా ప్రవహించుచుండెను. తరంగములుమహోత్తుంగములై మింటికెగయుచు గుఱ్ఱపుజూలును తాకుచుండెను. ఆహా! ఏమి ఆఅబలసాహసము! ఏమి ఆదేశభక్తి! ఎంతని వర్ణింపగలము? తనప్రాణముల సైతము నాశింపక నిశీథసమయమున ఏకాకినియై నదిని ఈదసాహసించెను. ఆ యశ్వరాజముయొక్క ధైర్యసాహసాదిగుణములు వర్ణింప నేరితరము? ఆయశ్వరాజము తరంగముల నీదుచు నదియావలగట్టును చేరెను. దూరముననున్న బ్రెగిల్జిదీపములు మినుకుమినుకుమని కానవచ్చుచుండెను. మరల నాహయము శరవేగమున బోవుచుండెను. అప్పుడే పండ్రెండుగంటలు కొట్టెను. ద్వారపాలకుడు పట్టణద్వారమును బంధించుటకై వచ్చెను. అప్పుడే ఆయశ్వ

రాజము గవాక్షమునుచేరెను. వెంటనే ఆమెను సగౌరవంబునలోనికిగొనిపోయిరి. పట్టణము బందోబస్తుచేయబడినది.

బ్రెగెల్జి రక్షింపబడెను! యుద్ధరంగము జానాకీర్ణమైయుండెను. ఆహా! ఒక్క అబల అట్టి నిశీథసమయమున తన మాతృదేశమును రక్షించగలిగెను. వీరులు కార్యనిర్వహణ కౌశలమునకు శాశ్వతమైనట్టి కీర్తిచే బహూకరింపబడుదురు. మూడుశతాబ్దములు గడచి నప్పటికిని పట్టణప్రాకారద్వారమునొద్ద అశ్వమును, దానిపై కన్యయు చెక్కబడినశిలావిగ్రహమొకండు ఇప్పటికిని గానవగును. రాత్రులందు పట్టణమధ్యమున నొకడు ఎన్నిగంటలుకొట్టినది కేకలువేయునాచారముగలదు. తొమ్మిది, పది, పదునొకండు అని కేకలువేయునుగాని పండ్రెండుకొట్టగనే కైరలుకన్య జ్ఞాపకార్థమునకును, ఆమెను గౌరవించుటకును ఆమె పేరు పెట్టి పిలుచుచుండును.

## వినాయక విజయము

'అమల' గ్రంథకర్త్రి

కడలిహాలాహలంబు నాకలికిమ్రింగి
పరమపావని గంగాస్రవంతినెపుడు
శిరముపై నుంచి, భక్తులవరములీయ
వాసనిర్ణయవిమలకైలాసమందు
నఖిలలోకాధిపుండు ననాదిమూర్తి
సర్వశక్తియుతుండగు స్వామి శివుండు
ప్రమథగణములుమున్నగు నమరవరులు
గొలువ గిరిజాసమేతుండై కొలువుదీర్చె.
తేటవెన్నెలనై నను మాటుపఱచు
మంచిముత్తెపుసొరును మించిపోవు
సహజలావణ్యశాలిని యహరహంబు
లలితశారదకౌముదీలహరివోలె
మొలకలేనవ్వుమోముతోఁగొలుచుగౌరి
ఫాలలోచనుదిలకించి పలికెనిట్లు.
'వినుము ప్రాణేశ! నాదగువిన్నపంబు
విపులవిద్యాప్రవీణులై వెలయుచుండు
సుతుల విద్యాదివైభవోన్నతులఁగాంచి
న్యాయముగురీతి బహుమతులీయరాదె?'
ఫాలఁతిచెప్పినయట్లు తా నలుపనెంచి
ముద్దుకొమరులఁబిలిచి 'ఓపుత్రులార!
ధీరగంభీరభయదవిస్తారదూర
మైన వసుధను ముమ్మాఱు లమరచుట్టి
ముందువచ్చితిరేని యానంద' మనియె.
అనినతోడనే నెమలివాహనమునెక్కి
భూమిచుట్టివచ్చెదనంచుఁ బోవుచుండ
అన్నత్రోవనుబోవకే యాఁగినాఁడు
సత్యమఖిలంబెఱింగిన జ్ఞానియగుట
నెల్లలోకేశులు నుమామహేశులనుచు
మదిఁదలంచి వారలకే నమస్కృతులిడి
నిలచుగణనాథు సుతుఁజూచి నీలకంఠుఁ
డపుడుపలికెనీరీతిగా నాదరమున:
'నాదుమెప్పును వడసియున్నావుగాన
పుడమిజనులెల్లరును నిన్నె ముందుగొలిచి
పొందగారాసిభాగ్యము లందుచుంద్రు
వత్స! విఘ్ననాయకుఁడవై వర్ధిలెదవు.'




## పాటలు

శ్రీమతి చోడవరపు రంగనాయకమ్మగారు

### ౧

### లాలిపాట

('బాలా రుక్మిణి ప్రాణలోలా హారతి' అను మాదిరి.)

(పల్లవి) రాజరాజేశ్వరీ కౌమారీ నిను లాలిపాడ చేరీనిద్రించు సౌకుమారీ.

బాల త్రిపురసుందరి నిన్ను కోరిలలనలంతయూచ
చాలాదయతో డనిద్ర పోరాదే గిరిజబాల ||రా||
హిమగిరీంద్రవరకుమారి రజితశైలవనవిహారి
కమలాయతనయనలాలియనిపాడగ ప్రియముబాల ||రా||
కాళీ కలకంఠకంఠి గరళకంఠుసతివనివింటి
చాలా ప్రార్థింతు శైలబాలా సుగుణాలవాల ||రా||
పతినిగోరినిన్ను వేడ రతికి పతినొసంగినట్టి
సతివీవేగాద బుద్ధిమతి హైమవతీశదేల ||రా||
అంగజహరురాణివమ్మ పొంగుచు చోడవరపుకొమ్మ
రంగానాయకినిబ్రోవ రావే జగదాంబవేగ ||రా||

### ౨

### జోలపాట

('జోజో ముద్దుల గోకుల బాలా' అను మాదిరి)

(పల్లవి) జోజో హిమగిరివరబాలా సురచిరగుణశీల.

లాలిరాజరాజేశ్వరి నిన్నతి
రమ్యపుడోలికయందిడి భక్తితో
రాజితముగపాడుచు నూచెదమమ్మ
రాజరాజేశ్వరురాణి శైలసుత ||జో||
కుంకుమరేఖాంచితమృదుఫాలా
పంకజలోచన దయగనవేలా
శంకరుప్రియభామిని జాగేలా
సంకటములబాపవె గుణజాల ||జో||
మహిషాసురసంహారిణి జననీ
మన్మథరక్షణి మంజులభాషిణీ
మాధవప్రియసహోదరి దేవీ
మధురాధర నిద్రింపవె తల్లీ ||జో||
రజతగిరీశ్వరి రమణిచోడాపర్పు
రంగనాయనికిబ్రోచెడితల్లీ
రాక్షససంహారి రాజరాజేశ్వరి
రక్షణజేసి యలసితి నిద్రింపవె ||జో||

# ప్రబోధము

శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మగారు

(పశ్చిమగోదావరిజిల్లా భీమవరమున జరిగిన మహిళాసభలో చదువబడినవి.)

సీ. ఏవంక గాంచిన నింపారుసస్యముల్
    ఫలవృక్షరాజియు ప్రబలుచుండ
ఘనతరబహురత్న జనకసంపన్నత
    మేటిపర్వతములు మెరయుచుండ
సింధుగోదావరీ శ్రీకృష్ణగంగాది
    నిర్మలజలముచే నిండియుండ
సకలసంపదలచే సర్వదేశాలకు
    మకుటాయమానమై మలయుచుండ
వేదవేదాంగాది విదితవిజ్ఞానంబు
    విద్యుల్లతలరీతి వెలుగుచుండ
గీ. కటకటా! నేడు దాస్యశృంఖలలజిక్కి
శ్వేతజాతులచేతకృశించి, శల్య
మగుచుదుర్భరదుఃఖార్తిబొగులుచుండె
ధన్యగుణయశోపేత శ్రీభరతమాత.
సీ. సతి రాణిసంయుక్త సమరభూములయందు
    విక్రమాతిశయంబు వెలయజేసె
వాలు కేలధరించి వలనొప్పగా మించి
    ఝాన్సివైరులనెల్ల సంహరించె
తగురాజనీతిమించగ నహల్యాభాయి
    ఘనమైనరాజ్యపాలన మొనర్చె
ఆంధ్రరాజ్యంబేలియు రుద్రమాదేవి
    ఆంధ్రకీర్తిధ్వజం బలరజేసె
గీ. నేడుకాంతలు దమకీర్తి నిలిపినారు
అరలేదింక శౌర్యాగ్ని యార్యభువిని
భరతమాతృనై భవమహాప్రాభవములు
మరలమిన్నందుతరివచ్చె మహిళలార!
సీ. దాస్యాంధకారంబు తఱిమివేయుటకునై
    ఖద్దరుదీక్షతో గట్టరమ్మ
గద్గదస్వరములో గడుదుఃఖమందెడి
    పంచమసుతుల పాలించరమ్మ
ఆత్మనాశ మొనర్చునట్టి త్రాగుడుమాన్చి
    దేశవస్తులదీక్ష దాల్పరమ్మ
మనభాషమనజాతి మనదేశమభివృద్ధి
    నెనయుమార్గముల నూహించరమ్మ
గీ. మనముపూర్ణస్వతంత్రత గనెడువరకు
తీరబోదమ్మ మనపని తెలియవలార!
మాతృసేవాపరాయణమహితదివ్య
కంకణముదాల్చిరారమ్మ గరితలార!
మ. కనుడామాలలదుఃఖనిశ్వసములన్
    కారుణ్యమేపారగా
వనుతాపాశ్రుకణప్రవాహమున
    స్నానంబొనర్చి జాతీయనే
వనదీక్షారతిబూని భారతముగా
    పాడంగ త్యాగవ్రతం
బునబాత్మాంజలిజేసి మాతృచరణాం
    భోజంబు పైనంటుచున్
వెనుకంజాడక రండు లెండు తెగునన్
    వేవేగ నారీమణుల్.
గీ. చిరయశోభాసురంబయి వెలగినట్టి
భవ్యభారతవృక్షంబు పల్లవింప
రమ్యభావోన్నతంబు భారతపతాక
పావనము చేయవలయును శాశ్వతముగ
భావిసత్యాగ్రహాపుశాంతిఖండనమున
జయముసమకూరజేయ నుత్సాహమలర
తోడుపడలెందురండు నాతోడులార!
సీ. గాంగేయ నిష్కామకర్మయోగము దెల్పె
    కృష్ణుని ఘనగీత బోధచేసె
చంద్రమతీనాథు సత్యవచస్స్ఫూర్తి
    ధర్మజు పరమధర్మంబు జెప్పె
ప్రహ్లాదు సాత్త్వికతత్వముపదేశించి
    జీమూతు నాత్మత్యాగంబు జెప్పె
శాక్యసింహుని యహింసాపరత్వము
    ఏసు నాత్మబోధానుభవము జెప్పె
గీ. గుహునివాయుపుత్రుల కార్యగుణము దెల్ప
నట్టి లోకోత్తరమహాత్ము నాత్మజానిగ
బడసినావమ్మ నీపుణ్యభాగ్యగరిమ
ధన్యగుణయశోపేత! శ్రీభరతమాత!
గీ. నిఖిలసౌభ్రాత్ర మెల్లెడ నిండుగాత!
ప్రజలు స్వాతంత్ర్యమును బడసి ప్రబలుగాత!
ధైర్యశౌర్యంబు దనరగా దీవవలెడు
ధన్యగుణయశోపేత! శ్రీభరతమాత!



శ్రీమతి బెంగుళూరు నాగరత్నముగారు

*

* *

శా. ఎన్నోనాళ్లయిపోయె నింతసభలోన నేను వుంగానపునీ
విన్నాణంబునునాలకించి మరలంవిందయ్యె నీవేళ సం
పన్న శ్రీకము నీదుగానము జగత్ప్రఖ్యాతి మత్పాక మో
యన్నా ధన్యవు నాగరత్నమ! రమేశాలంబిసద్యత్నమా!

ఉ. గాయకులందుబేర్మిగని గౌరవభాజనమౌటెగాక మేల్
గాయకవర్గమందును జగంబునఁ గీర్తిగడించినట్టి సు
శ్రీ యల నాగరత్నము కచేరినిగానమొనర్చె నెల్ల రా
ప్యాయనమంది సంతసిలి రాసభ పండితపామరుల్ దగన్.

—చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి.

శా. గానంబా? మధురంబు; సర్ధసుగమజ్ఞానం బనూనంబు; స
న్మానంబొప్పగ రాజరాజసభలం మాన్యుల్ ప్రశంసింప స
ద్దే నాగాంగనవచ్చి పాడెననగా దోపించు నేపొంది నీ
వో నాగాంగనరో! రహింసలిపినావుద్యన్మతిం గానమున్.

ఉ. పోణిమినాలుగుంబదియుఁబోయెను వర్షముకార నిత్యక
ళ్యాణియటన్న రాగముల యావళి నీకడనాలకించి క
ళ్యాణిరో! నాగరత్నమ! చెలంగగనాటికి నేడహో! సుధా
వేణికఁబోలి వీనులను వేడ్కనుగ్రోలితి నల్లమాధురిన్.

—చేబోలు చంద్రశేఖరశర్మ.

* *

*

## సాధ్వి

శ్రీమతి గండికోట సావిత్రీదేవిగారు

నేనిప్పుడు చెప్పబోయేవిషయం నేనుఎఱుగున్న ఒక శూద్రస్త్రీని గురించి. భర్త పెట్టెడిబాధలు నివర్తించుకొనుటకు వీలుండియు, మనపూర్వపుస్త్రీలచరిత్రలను విని వారి జీవితములే ఆదర్శములని నమ్మి అటులనే ప్రవర్తించి కష్టములనందిన కాంతనుగురించి.

మాయింట్లో రాముడని ఒకడు పనిచేస్తూఉండేవాడు. వాడికూతురు పైడి. పైడి అందమైనదీ, తెలివైనదీను. ఆమెకుచిన్నప్పుడే తల్లిపోవడంచేత రాముడూ, అదీ మాఇంట్లోనే ఉండేవారు. పైడికి పదవయేడురాగానే రాముడు తనుకూడాపోతే దానికి దిక్కుండదని ఆలోచించిపెళ్లిచేసేశాడు. పైడిరోజూ ఏదైనా మనపూర్వులవిషయాలుచెప్పమని అడుగుతూ ఉండేది. నాకుతోచినవి నేచెప్పేదాన్ని. ఏదైనాపేరువింటే ఆపేరుగల పూర్వులచరిత్రలు తెలుసుకుంటేగాని దానికితోచేదికాదు. ఆవిధంగా దమయంతి, చంద్రమతి, సీత, సావిత్రి, మొదలైన పతివ్రతలచరిత్రలన్నిటిని నన్నడిగి తెలుసుకుంది. వారినిగురించి నీఅభిప్రాయమేమిటంటే ప్రతిహిందూస్త్రీ వారిలాగే ఉండాలని నాఅభిప్రాయమని చెప్పేది. కొంతకాలానికి రాముడుచనిపోయాడు. పైడి మాయింట్లోనే ఉండిపోయింది.

రాముడుపోయిన నెల్లాళ్లకి పైడిమొగుడు మాయింటికొచ్చి 'నాపెళ్లాం మీయింట్లో ఉండడానికివల్లకాదు తీసికెళ్లిపోతా'నన్నాడు. సరేననుకుని 'ఏమే? పైడీ! వెడతావుటే?' అని అడిగితే వాడిమొఖంవేపు నామొఖంవేపూచూసి వెళ్లిపోతానంది. వాడుతీసికెళ్లిపోయాడు.

ఏడాదిగడిచినతరువాత ఒకనాడు పైడి మాయింటికివచ్చి వాళ్లెళ్లినఊళ్లో ఏమీపని లేకపోవడంవల్ల ఈఊరువచ్చేశామనీ ఇక తను మాయింట్లోపనిచేస్తాననీ చెప్పింది. సరే ఉండమన్నా. పైడి మాయింట్లోపనిచేసేది. రోజులుగడిచినకొద్దీ పైడి చిక్కిపోతూ దీనంగా ఉండేది. ఏమేఅలాఉన్నావని ఎన్నిసార్లడిగినా చెప్పేదికాదు. ఇలాఉంటూండగా ఒకరోజు పైడి పనికి ఆలస్యంగా వచ్చింది. అది అంట్లు తోముతూంటే, నేను మామూలుగా పలకరిద్దామని వెళ్లిచూసేప్పటికి అంట్లు ఎడంచేత్తో తోముతోంది. కుడిచేతికి కట్టుకట్టుకుంది. కళ్లమ్మట నీళ్లుకారుతున్నాయి. నేను 'చేతికి కట్టేమిటి? ఏంజరిగింది? ఎందుకుఏడుస్తున్నావు?' అని ఎంతఅడిగినా చెప్పలేదు. అడగ్గా, అడగ్గా తేలిందిసంగతి. ఏమిటంటే పైడి మొగుడు పనిచేసి తెచ్చిన డబ్బులతో తాగేసి, రోజూ పైడిని చావబాది ఇంకాఅది వాడికికూడా సరిపోయే అన్నంతీసుకురాలేదని మళ్లీకొట్టేవాడుట. ఆరోజున ఆకొట్టడమేఎక్కువైంది. చేతిగాజులన్నీపగిలి చేతులోగుచ్చుకుపోయాయిట. ఆగాజుముక్కలన్నీ తీసుకుని తడిగుడ్డచుట్టుకుని పనికొచ్చింది. అప్పుడు దాన్ని ఆస్పత్రికిపంపి కట్టుకట్టించి, 'ఇంటికెడితే మళ్లీకొడతాడు, మాయింట్లోనే ఉండిపో'అని చెప్పేను. 'ఇక్కడుంటే కులంవాళ్లు ఆక్షేపిస్తారమ్మా, ఇంటికే వెడతాను' అని చెప్పి వెళ్లిపోయింది.

అమర్నాటినుంచి పనికిరాలేదు. మళ్లా నెలరోజులైనతరువాత పనిచేస్తానని వచ్చింది. ఇన్నాళ్లూ ఎందుకురాలేదంటే ఏంచెప్పిందంటే, మేము కట్టుకట్టించిన తరువాత ఇంటికెడితే ఆకట్టుచూసి బ్రాహ్మలకి నామీద నేరాలుచెపుతావా? అయినా బ్రాహ్మలకి నీమీద అంత దయ ఎందుకుంటుంది? నిన్నెరుగున్నవాళ్లెవరో కట్టించిఉంటారు. ఇప్పటినుంచి నువ్వు పని మానెయ్యి. నువ్వువీధుల్లోకెడితే పనికిరావని మళ్లీ వాడి కసితీరాకొట్టేశాడుట. ఆదెబ్బలతో నాలుగురోజులవరకూ లేవలేకపోయిందట. పనిమానిపించేడుగాని ఇద్దరికీ ఇంట్లో అన్నంలేదు. చివరకి ఎలాగైతేనేం ఆకలికాగలేక పనిచెయ్యమనిపంపించేడు. మేము అన్నంపెడితే ఇంటికి పట్టికెళ్లేది. 'ఇంటికెందుకు? మాఇంట్లోనే తినేశెయ్యి' అనిచెపితే 'ఇంటికాడ ఆకలితో ఉంటే ఎలాతిననమ్మా' అనిచెప్పి పట్టుకెళ్లేది. అన్నంతీసికెళ్లి పెడితే 'నువ్వుతినకుండానే నాకుపెడుతున్నావా? ఎవరోపెడితే బాగాతిని నాక్కాస్తఅన్నం పట్టుకొస్తున్నా'వని కొట్టేవాడుట. ఇలా ప్రతివిషయంలోనూ తప్పులెంచుతూ రోజూకొట్టకుండా ఉండేవాడుకాడుట.

'కడుపుకి అన్నంలేకుండా కట్టుకునేందుకు బట్టలేకుండా ఎన్నాళ్లుంటావు? మీలో మారుమనువుందికదా ఇంకోణ్ణిపెళ్లిచేసుకోకూడదా' అని ఒకరోజుఅన్నాను. 'ఎందుకమ్మా కులంవాళ్లచేత మాటకాయాలి' అంది. 'నువ్విప్పుడు కష్టపడుతూఉంటే కులంవాళ్లు అన్నం పెట్టేరా? బట్టఇచ్చేరా? నీసుఖంచూసుకోవాలిగాని కులంవాళ్లంటారని ఎన్నాళ్లిలాకష్టపడతావు?' అంటే 'అవునమ్మా ఇంకోణ్ణిచేసుకుంటే వాడు వీడికన్నసుఖపెడతాడన్న నిశ్చయమేమిటి? వాడెలాంటివాడౌతాడో? అందుచేత ఇంకోణ్ణిచేసుకుంటే సుఖముండదు; పైగా మాటలుపడాలి. అంచేత ఇలాగేఉంటాను. బతికినరెండురోజులూ నలుగురిచేతా మాటలుపడితేనేం? ఇలాకష్టపడితేనేం? ఇప్పుడు ఇంట్లో వాళ్లండమేగాని పైవాళ్లు నన్నేమీఅనరుగదా' అని 'ఇదివఱకు భర్త ఎన్నికష్టాలుపెట్టినాపడాలి, ఎదురుచెప్పకూడదు, భర్తనేభగవంతుడిగా భావించాలని మీరేఅన్నారు కాదమ్మా' అంది. నిజమే నేనలా చెప్పినమాటనిజమే కాని అలా నడుచుకున్నందువల్ల పైడివిషయంలో మంచి కనపడలేదు. పాపము పైడి ఇంక సుఖపడేందుకు మార్గంకనపడలేదు. అలా ఎన్నాళ్లని ఉండగలదు?

ఒకనాడుతెల్లారేప్పటికి పైడిశవం ఊరిబయట నూతిలో తేలిఉంది. అదిచూసినవాళ్లంతా అదిశూద్రస్త్రీ అవడంవల్ల ఎక్కువదుర్మార్గురాలనీ, దాని చెడుపనులకు ప్రతిఫలంగా దైవము దానికి ఆచావుపెట్టేడనీ చెప్పుకున్నారు కాని నిజం ఆలోచించేవాళ్లెవరు? మేము దాన్నిగురించి చెడుమాటలువిన్నప్పుడు చాలావిచారించేం. అయితే ఇంతకూ భర్తకెదురాడకుండా, చెప్పినమాటలమీదనే నడుచుకున్న స్త్రీపొందుతుందన్న కీర్తి, సుఖం పొందకుండా ఈవిధంగా జరిగిందెందుకు? దీనికేంకారణంఅనుకున్నా. పూర్వపుస్త్రీలు కష్టములు పొందలేదా? వారుకూడా చాలాకష్టాలనుభవించారే? వారుపడ్డకష్టాలు లెక్కకొచ్చేవెందుకు? అనుకుంటూంటే పైడి భర్త ఏలాంటివాడన్నసంగతి జ్ఞాపకమొచ్చింది.

పూర్వపుచరిత్రలలో సత్యవంతుడు, నలుడు, హరిశ్చంద్రుడు మొదలైనవారంతా ఏలాంటి వారు? వారుకూడ ఇప్పటి పురుషుల్లాంటివారే ఔతే పూర్వపు పతివ్రతామతల్లుల చరిత్రలు లెక్కకొచ్చునా? అవికూడ ఎక్కడో అణిగిపోయియుండేవి. వారనుభవించిన కష్టములు భార్యాభర్తలుకలిసి. ఇప్పుడో భార్య, భర్తవలన. దీనికి దానికి తారతమ్యములేదా? అనుకున్నా. పూర్వపుపతివ్రతలవలెనే హిందూస్త్రీలందఱు నడుచుకొనవలసియున్నదో పూర్వపు పురుషులవలెనే ఇప్పటివారుకూడ నడుచుకొనవలదా?

# జోలపాటలు

## ౧

(సంపాదకురాలు) శ్రీమతి యస్. వి. సరళాదేవిగారు

పట్టుపావడగట్టి పప్పువడిగట్టి
పరుగెత్తుఅమ్మాయి! పరుగుచూదాము
అంచుపావడగట్టి అటుకులొడిగట్టి
ఆటాడుఅమ్మాయి! ఆటచూదాము.

చిక్కుడుకాయల్లు తీగకందమ్మ
నినుగన్నతల్లికి బిడ్డలందమ్మ
చిక్కుడుకాయల్లు మండపై వ్రాలు
శ్రీరాముభ్రమఅంత సీతపై నుండు.

దోరాదిపండెఱుపు దొండపండెఱుపు
నిలుచున్నవానిలో నిమ్మపండెఱుపు
నిమ్మపండొకచాయ నీలమొకచాయ
నిత్యానఅబ్బాయి దినమొక్కచాయ.

కాకినాడబాటలకు మీనాన్నపోగా
కంఠానమెఱసింది కమలాలపతకం
ఎందుకోననుకొంటి ఇట్టిపతకమ్ము
మాచిట్టితల్లికని తెలిసిపోయినది.

పుట్టుతూనే సీతబుద్ధులడిగినది;
ప్రేమతో కౌసల్యకోడలయినాది;
చక్కనిగుణములను గుట్టపోసినది;
లోకాభిరాముని చెట్టవట్టినది.

ఎటులగంటివమ్మ? యశోద! నీవు
ఇంతచక్కని చిన్నికృష్ణుని చెపుమ?
పచ్చిపిండితిని, పాలారగించి,
భాద్రపదపూర్ణిమ ఉంటినేచెలియా!

## ౨

(సంపాదకురాలు) శ్రీమతి పాకల చంద్రకాంతామణిగారు

చిన్నారిపొన్నారి చిలుకవే నీవు
బాగుగాపాడేటి భరతమే నీవు
బంగారువలెనున్న సింగారివీవు
చెక్కిళ్లుబోసిన చెంగావిప్రోవు.
నవ్వితే నీనోట నవరసాలొలుకు
పండువెన్నెలబోలు పటికంపుతళుకు

రవ్వసేయకుమమ్మ రజితంపుబొమ్మ
పవ్వళించుము జోలపాడెదనుసుమ్మ.
నిద్రపోనాయమ్మ నిద్రపోకొమ్మ
భద్రంబునీకగును పవళింపుకొమ్మ
హాయి,హాయి,హాయి, ఆపదలుగాయి
చిన్నదానినిగాయి శ్రీరంగశాయి!

# కోలాటపదములు

(సంపాదకుడు) దేవగుప్తాపు వేంకటరమణమూర్తిపంతులుగారు

[విశాఖపట్టణమండలమున విజయనగర ప్రాంతములందు పల్లెటిసీమలలో పాటకపుజనులచే పాడబడునవి]

శివశివమూర్తివి గణనాథా
మాశివునికుమారుడవు గణనాథా
ఏకదంతమోయి గణనాథా
నిన్నే మనిదలతును గణనాథా
సకలవిద్యలకు గణనాథా
నీవుస్వామిలోకుడవు గణనాథా
బ్రాహ్మర్లుగొలుతురు గణనాథా
నిన్నుబ్రహ్మదేవుడందురోయి గణనాథా
రాజులుగొలుతురు గణనాథా
నిన్నురాణివాసమందురోయి గణనాథా
కోమట్లుగొలుతురోయి గణనాథా
నిన్నుకోటలాభాలందురోయి గణనాథా
పడ్డీలుగొల్తురోయి గణనాథా
నిన్నుదొడ్డదేవుడందురోయి గణనాథా
కాపులుగొలుతురు గణనాథా
నిన్నుకామధేనువందురోయి గణనాథా
కోటన్నగట్టుమీద గణనాథా
నీవుకొలువుగూడియుందువోయి గణనాథా.

• • • • •

కలకంఠములారా (ఓ)
కలువకంటులారా
కలికిచిలుకలారా (రాముని)
కాంతనుగంటిర ఓ?
చందనతరులారా (ఓ)
చంపకసరులారా
మందారములారా (రాముని)
మగువనుగంటిర ఓ?
నీలతరువులారా (ఓ)
వికసితముఖులారా
శారదాంబలారా (రాముని)
చాననుజూచిర ఓ?
బింబవల్లులారా (ఓ)
జంబుతరువులారా
జంబీరములారా (రాముని)
సుందరిగాంచితిరా?
తుంగపీకలారా (ఓ)
సారంగతరువులారా
గంగదేవులారా (రాముని)
చానను గాంచిర ఓ?
మొలకతరువులారా (ఓ)
చక్కనిపొన్నపువ్వులారా
అలుకతరువులారా (రాముని)
అతివనుగాంచితిరా?
సరసతరువులారా (ఓ)
సంపెంగపువ్వులారా
కుందరదనలారా (రాముని)
తరుణినిజూచితిరా?

• • • • •

రామాలాలీ మేఘశ్యామాలాలీ
తామరసానయన దశరథతనయాలాలీ
అబ్జవదనా ఆటలాడీ అలసినావురా
బొజ్జలోపాల్పోసుకోని నిద్దురించారా
జోలపాడిజోకొట్టితే ఆలకించేవూ
చాలించీయూరకుంటే సంజ్ఞచేసేవూ
యంతో ఎత్తుమరగినావు ఏమిసేతూరా?
వింతగానీకొండానుండూ వీరరాఘవా!

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## తొక్కుపల్కులు

శ్రీమతి శ్రీపతి శేషమ్మగారు

మాటవిను—
ఏమిమాట?
మంచిమాట—
ఏమిమంచి?
గడమంచి—
ఏమిగడ?
చెరుకుగడ—
ఏమిచెరుకు?
తీపిచెరుకు—
ఏమితీపి?
పండుతీపి—
ఏమిపండు?
మామిడిపండు—

ఏమిమామిడి?
అంటుమామిడి—
ఏమిఅంటు?
మల్లిఅంటు—
ఏమిమల్లి?
తెల్లమల్లి—
ఏమితెల్ల?
పాలుతెల్ల—
ఏమిపాలు?
ఆవుపాలు—
ఏమిఆవు?
నల్లఆవు—
ఏమినల్ల?

కాకినల్ల—
ఏమికాకి?
మాలకాకి—
ఏమిమాల?
పెద్దమాల—
ఏమిపెద్ద?
బడిపెద్ద—
ఏమిబడి?
వీధిబడి—
ఏమివీధి?
రాజవీధి—
ఏమిరాజు?
ధర్మరాజు—

౨. పాటలు

## ఉప్పరపడుచుపాట

(సంపాదకులు) భాగవతుల యజ్ఞనారాయణశాస్త్రిగారు బి. ఏ.

[ఉప్పరపడుచులు వివాహకాలంలో తలుపుదగ్గిర విలాసార్థముగపాడు వాడుకలోనున్న పాట]

అందలమెక్కి పెళ్లికొడుకు
వచ్చివాకిటనిలుచున్నాడు
తలుపేటియ్యాకపాయె
తరలాక్షివచ్చి.
అందలమెక్కివస్తేనేమి
వారన్నానెక్కివస్తేనేమి
తలుపెట్లాతీద్దునమ్మా
తగవులుండంగ.
పల్లాకెక్కిపెళ్లికొడుకు
వచ్చివాకిటనిలుచున్నాడు
తలుపేటియ్యాకపాయె
తరలాక్షివచ్చి.
పల్లాకెక్కివస్తేనేమి
పందీపిల్లానెక్కివస్తేనేమి

తలుపెట్లాతీద్దునమ్మ
తగవులుండంగ.
మేనానెక్కి పెళ్లికొడుకు
వచ్చీవాకిటనిలుచున్నాడు
తలుపేతియ్యాకపాయె
తరలాక్షివచ్చి.
మేనానెక్కివస్తేనేమి
మేకపోతునెక్కివస్తేనేమి
తలుపెట్లాతీద్దునమ్మ
తగవులుండంగ.
గుఱ్ఱామెక్కి పెళ్లికొడుకు
వచ్చివాకిటనిలుచున్నాడు
తలుపేతియ్యాకపాయె
తరలాక్షివచ్చి.
గుఱ్ఱామెక్కివస్తేనేమి
గుడ్డికుక్కానెక్కివస్తేనేమి
తలుపెట్లాతీద్దునమ్మ
తగవులుండంగ.

## చిట్టిబొమ్మపెళ్లి

(సంపాదకులు) పోతాప్రగడ వేంకటచలపతిరావుగారు

చిట్టిబొమ్మాపెళ్లి చేయవేడుకా
శ్రీరెంకువాకిళ్లు శిరితోరణాలు
గాజుగంభాలనే భూజాకంబళ్లు
అరటి స్తంభాలనే అమరపెళ్లిళ్లు
చిన్నన్న పెట్టేను చింతాకుతీగ
పెద్దన్న పెట్టెడు పెట్టెలసొమ్ము
నాఅక్క పెట్టింది నానుతోపుస్తె
గతిమడక పెట్టించి ఘంటవాయించి
అత్తకందలమిచ్చి తాగుఱ్ఱమెక్కి
గుఱ్ఱముమీదికి కూతుర్ని తేరే
కూతురీముందరికి కురువేరు తేరే
పనుగన్నతల్లికే పాను తేరమ్మా
నాతికీ ముత్యాలబొట్టు తేరమ్మా
బొటికీ బొమ్మంచుచీర తేరమ్మా
చీరకీ చిలకలారవిక తేరమ్మా
రవికకూ రత్నాలపుస్తె తేరమ్మా
పుస్తెకూ పూలతాళిక బెట్టిరా?
సారచీరా బెట్టి సాగనంపేరా?

## చిన్నపిల్లలపాటలు

(సంపాదకులు) యుపోతు వేంకటరామచంద్రరావుగారు

౧

(ఎవరితలమీదనయినను ఆకుగాని, పుల్లగానిపడిన ఈవిధంగా అతనిని ఏడిపించెదరు)

ఓఅబ్బాయి నెత్తిమీదగోరింక
చెప్పకుచెప్పకు చెడిపోతావు
చెప్పితేనీముక్కు తెగ్గోస్తా
దూలంమీదంచి దూకిస్తా
పందిరిమీదంచి పాకిస్తా
కంచంఅన్నంతినిపిస్తా
కడవెడునీళ్లుత్రాగిస్తా.

౨

(తల్లులు పసిబిడ్డలకు పాలు, ఆముదము త్రాగించునపుడు యీపాటపాడుచు కాళ్లుచేతులు సాగలాగి శరీరమునకు ఆముదము రాయుదురు.)

జీర్ణంజీర్ణం
వాతాపిజీర్ణం
గుఱ్ఱాల్ తిన్న
గంగిళ్లరిగి
ఏనుగుల్ తిన్న
వెలక్కాయలరిగి.
అర్జునుడుతిన్న
అరటిపళ్లరిగి
భీముడుతిన్న
పిండివంటలరిగి
గణపతితిన్న
ఖజ్జాలరిగి
అబ్బాయితాగిన
పాలుఆముదమరిగి
పందల్లేపాకి
కుందల్లేకూర్చుండి
సందల్లేనడచి
గుఱ్ఱమంతపరుగు
ఏనుగంతసత్తువ
ఉండేటట్లు
సాకుమా యీబిడ్డను
సంజీవరాయ.

3. విద్యావిధానపరామర్శ

# ప్రాథమికపాఠశాలలు : చిత్రలేఖనము

జోశ్యుల వేంకటరావుగారు

చిత్రలేఖనము పిల్లలు ఉత్సాహముతో నేర్చుకొనువిషయములలో నొకటి. కాని ఇప్పుడు ప్రాథమిక పాఠశాలలలో చిత్రలేఖనము నిరసనగా చూడబడుచున్నది. అది ఉపాధ్యాయుల అసమర్థతయో, అశ్రద్ధయో లేక, దానియందుండు నిర్లక్ష్యాభావమో తెలియరాకున్నది. పరీక్షాధికారులు, సంవత్సరాంతపరీక్షాసమయములందు చిత్రలేఖనముగూడ ఒకముఖ్యాంశముగ గమనించి పరీక్షసలిపినచో దీనిప్రాముఖ్యము బయలుపడగలదు. బోధనాభ్యసనపాఠశాలలయందు దీనిప్రాముఖ్యము ఎంతవరకున్నదో మనకందరకు తెలిసినవిషయమే.

అక్షరతరగతి మొదలు మూడు నాలుగు తరగతులవరకు చిత్రలేఖనము బలపముల మీదనే నేర్పుట మంచిది. ఈతరగతులలో నిలువుగీతలు, అడ్డగీతలు, గుండ్రనున్నలు, కోలనున్నలు మొదలగు సులభపద్ధతుల ననుసరించి చిత్రలేఖనము నేర్పుటయుక్తము. ఇట్టిగీతలమీదనే అనేకరకములగు ఆకారము లేర్పడగలవు. పాశ్చాత్యపండితులగు పెస్టాలొజి, ఫ్రోబెల్లు మొదలగు నాగరికఉపాధ్యాయులు ఈవిషయములను గమనించి, చిన్నచిన్న చీపురుపుల్లలను పేకముక్కలను తీసుకొని గుడియాకారముగాగాని, పంతెనగాగాని నిర్మించుటను పిల్లలకు అక్షరతరగతియందు నేర్పునట్లు బోధించియున్నారు. ఇట్టివిచేయుటయందు పిల్లలు ఒకవిధమగు అందమునకు అలవాటు పడియుందురు. అటువలె వారుచేసిన పంతెననుగాని, ఇండ్లనుగాని చూచి పలకమీద గీయుమని ఉపాధ్యాయుడు-అవసరమైనప్పుడు సహాయపడుచు-ప్రోత్సాహము చేసిన వారు బొమ్మలను చిత్రవిచిత్రముగా రచింతురు. ఇట్లు చిత్రలేఖనమందు పిల్లల నలవాటుపరచుట మంచిది.

నాల్గవతరగతివరకు వివిధరకములగు కాయలు, ఆకులు, పండ్లుమున్నగునవి వేయించవలెను. ఇట్టివి తరచు నిలువు అడ్డగీతలననుసరించి యుండవలెను. పైతరగతులకు పుస్తకములమీద నేర్పవగును. ఈతరగతులలో ఇంకను కొంచెము కష్టమగు చిత్రపటములు వేయుటయందు అభిరుచి కలిగింపవచ్చును. మృగములు, గృహోపకరణములు, పక్షులు, మేడలు, మనిషి పరుగెత్తుట, నిలబడుట (action drawing) వేయునట్టుల చేయవలెను. ఈవయసున ఏబొమ్మలకు ఏరంగువేసిన బాగుండునో తెలిసికొనగలరు.

చిత్రలేఖనము బడిలోనేర్పు అన్నివిషయములకును ప్రాణమువంటిది. ఎట్లన్న భూగోళశాస్త్రవిషయము సంబంధించిచూడవలెననిన ఈవిషయమునందు జిల్లా, రాజధాని, దేశము, ఖండము మున్నగునవి గీయవలసి

యుండును. తీరరేఖ ఎచ్చట మెలికలుతిరిగియున్నదో జాగ్రత్తగా చూచి వ్రాయవలయును. చేయిబాగుగా తిరిగినగాని ఇట్టిపటములు పిల్లలు నేర్పుతో వేయజాలరు. ఉపాధ్యాయునందిట్టి పటములెన్నియో గీయవలసి యుండును. వర్షపాతము, జనసంఖ్య, మెరకపల్లములు (Relief Map), పంటలు, ఖనిజములు, జంతువులు, అడవులు, రాజ్యాంగవిభాగములు మున్నగునవెన్నియో గీయవలసియున్నది. చరిత్రవిషయములోను చిత్రలేఖనమవసరము. దేశపటములువేసి ఒక్కొక్క ప్రభువుజయించి విస్తరింపజేసిన రాజ్యభాగములు కనపరచవలెను. పరీక్షాప్రశ్నలలో ఇట్టిప్రశ్నల కెక్కువమార్కులు నిర్దేశింపబడును.

శాస్త్రవాచకపాఠములందు పక్షులయొక్కయు, జంతువులయొక్కయు, చెట్లయొక్కయు భాగములు వేరువేరుగా వేయవలసియుండును. సృష్టిపరిశీలనాపాఠమందు (Observation lesson) ఇట్టివి పరిశీలించుటకు వీలుగానుండును. పరిశీలించిన ఏవస్తువునైనను పిల్లలు చక్కగా లిఖించగలరు. అట్టి పరిశీలనాశక్తిలేనిచో గుఱ్ఱమును బొమ్మ వేసినప్పుడు ఆవుడెక్కలుగాని, ఆవుబొమ్మను గీసినప్పుడు గుఱ్ఱపుడెక్కలుగాని వేయుదురు. అందుచే శాస్త్రవాచకపాఠమునందుగూడ చిత్రలేఖన మవసరము.

గణితశాస్త్రమందుగూడ చిత్రలేఖనమవసరమగుచున్నది. పొలము మధ్యదారులుగాని, చుట్టు గట్టు లేక కంచెగాని యున్నపుడు వాటికొలతలిచ్చి వైశాల్యము కనుగొనవలసినచో మొదట బొమ్మనుగీసి కొలతలు గుర్తించిన బాగుగా అర్థమగును. ఇట్టివియే గ్రామస్థులదగ్గరనుండు గ్రామప్లానులు. జామెట్రీలో అనేకరకములగు బొమ్మలను గీయవలసియున్నది.

చిత్రలేఖనమువలన పిల్లలకు కంటికిని, చేతికిని పరిశీలనాశక్తియు, నిరూపణశక్తియు అలవడును. డ్రాయింగునకు సరిగ అలవాటుపడిన పిల్లలదృష్టి వస్తుపరిశీలనాభ్యాసముగలిగియుండును. ఫ్రాన్సు, అమెరికా, ఆస్ట్రేలియా మున్నగు విదేశములలో ప్రాథమికపాఠశాలలయందు ఈవిషయమునం దెక్కువప్రాముఖ్యము చూపబడుచున్నది. దీనివలన సృష్టిశోభ ఎక్కువగగోచరించును. స్థూలదృష్టికి తెలియని పలువినోదకరములగు తత్వములు డ్రాయింగు, పెయింటింగు (Painting) వలన మనసునకుపట్టును.

కాబట్టి చిత్రలేఖనముయొక్క యావశ్యకతను గ్రహించి తగినంతశ్రద్ధతో దానిని పిల్లలకలవడజేసి వారి పురోభివృద్ధికిని జీవనోపాధికిని తగుమార్గము చూపించవలెను.

౮. కథలు

## గొఱ్ఱెపిల్ల: తోడేలు

శ్రీమతి కోటా కృష్ణవేణమ్మగారు

అనగాఅనగా ఓచీమలుదూరనిచిట్టడవుండేది. ఆఅడవిచెంతనే ఒకపచ్చికబయలుండేది. ఆచుట్టుపక్కలగొల్లలంతా ఆబీడులో గొఱ్ఱెలుమేపేవాళ్లు. ఓరోజున ఒకగొఱ్ఱెపిల్ల మందలో నుంచితప్పించుకొనిపోయిఅడవిలోదూకింది. దూరంనుంచి ఓతోడేలు గొఱ్ఱెపిల్లనుచూచింది. దానిని చంపాలని పరుగెత్తుకొచ్చింది. ముందు గొఱ్ఱెపిల్ల వెనకాల తోడేలు కొంతదూరము పరుగెత్తేయి. త్రోవలో గొఱ్ఱెపిల్ల కోబూరాకనపడ్డది. వెంటనే ఆగి "తోడేలా! తోడేలా! నీవునన్నెట్లాగయిన చంపుతావుగాని నాకొకకోర్కె ఉన్నది" అన్నది గొఱ్ఱెపిల్ల. "ఏమిటా కోర్కెచెప్పూ?" అని అన్నది తోడేలు. అప్పుడు గొఱ్ఱెపిల్ల బూరానుచూపి "ఈబూరా నీవు వాయించు. నేను నాట్యమాడుతాను. తరువాత నీవు నన్నుభక్షించు" అన్నది. "ఇదేనా

కోర్కె" అని బూరాతీసివాయించటంమొదలెట్టింది తోడేలు. గొఱ్ఱె నాట్యం ఆడటంమొదలెట్టింది. దూరాన్నిఉన్న వేటకుక్కలు ఈధ్వనివిని పరుగెత్తుకొచ్చేయి. తోడేలునుచూడటంతోటి దానిని పట్టుకొని చంపేయి. ప్రాణాలుపోయేటప్పుడు తోడేలు "నావృత్తి కసాయి వృత్తిగదా! నేను గొఱ్ఱెను చంపకుండా మంగలివానివలె వాయించుట కంగీకరించినందుకు తగినట్లయింది"అని అన్నది. కథ కంచికెళ్లింది. మన మింటికివచ్చేము.

## లక్ష్మి

ముద్దా విశ్వనాథము గారు

భూలోకంలో ఎవరినైనా ఆశ్రయించుకుని ఉందామని లక్ష్మికి ఒకప్పుడు బుద్ధిపుట్టింది. అందరిళ్లకీవచ్చి వస్తా, వస్తానంటూండేది. ఇదేమిటో దయ్యమో, భూతమోఅనుకొని ప్రతీవాళ్లూ కిక్కురుమనకుండా ఊరుకునేవారు జవాబుచెప్పక. కాగాపోగా ఆవిడ ఒకకోమటింటికి బయల్దేరివెళ్లి తన వస్తా మంత్రం పునశ్చరణచేసింది. ఈషాహుకారు మాంఛి యుక్తిపరుడు, గడుసుబుఱ్ఱ. "నువ్వు ఎవరవు? ఎందుకొచ్చేవు?" అంటూ ప్రశ్నలువేశాడు. జవాబులుచెప్పింది. ఆఖరున అన్నాడుగదా "సరే బాగానేఉంది. నువ్వు మాయింట్లోనే ఉండు; కాని, నువ్వెల్లాచెప్పివచ్చేవో అల్లాగే మళ్లానాతోచెప్పి మరీవెళ్లాలిసుమీ. నీకెప్పుడైనావెళ్లిపోదామనిగాని బుద్ధిపుడితేను"అన్నాడు. "అల్లాగేలే"అని ఒడంబడింది. సమ్మతించింది లక్ష్మి దూరం ఆలోచించుకోలేక. ఇంతట ఈవిధంగా ఒకఉపాయంపన్నినాడు షాహుకారు. "ఎండనక కొండనక మున్నూటరవై రోజులూ వొళ్లుహూనమయితేకదా లక్ష్మి ప్రసన్నం! అల్లాంటిది ఎక్కడోకాస్తసుడి ఉండడంవల్ల ఆవిడ మనకాళ్లదటికే వచ్చింది. ఈలక్ష్మి చంచలచిత్త అంటారు అంచేత ఎట్లాగైనా మనయింట్లో సుస్థిరంగానిలుపు చేయాలి. దీనికొక్కటేతంత్రంతోస్తుంది. చెప్పిగాని వెళ్లనూ అని నాతో బాసచేసిందికదా! మనసు నిలుకడలేదుగాని, మాటతప్పడానికి సాహసించదు. కనుక, పోతేపోయింది ఒక్క ప్రాణి, తరతరాలా నాపేరుచెప్పుకుని మావాళ్లు హాయిగా బ్రతుకుతారు; మెల్లిగా ఈలోకంలో సెలవు తీసుకొంటాను. నేనులేకపోతే ఇకనెవరితో చెప్పివెళ్లిపోతుంది?" అని భార్య, పిల్లలతో ఈకిటుకుచెప్పేశి, ఒకనాటిరాత్రి శెట్టి నూతులోపడి, ఊపిరివదలేశాడు. కొన్నాళ్లయేటప్పటికి లక్ష్మికి ఇక్కడుండడం విసుగొచ్చి కోమటి భార్యతో "అమ్మా! నాకువేఱేవ్యాపకముంది, మఱినేవెళ్లివస్తాను" అన్నది. అందుకావిడ "ఇదిమఱీబాగుంది. తల్లీ! నువ్వెవరితో చెప్పివచ్చేవో వారితోటే చెప్పివెళ్లు, నాకేం తెలుస్తుంది ఈగొడవ?" అని జవాబుచెప్పింది. "సరే, నీభర్తఏడీ?"అని ఆదుర్దాతోలక్ష్మి ప్రశ్నించింది. "వస్తాడు,వస్తాడు," అంటూ ఇంట్లోదూరింది షాహుకారుభార్య. ఈసంగతి నిజమేననుకొని కోమటి నేడే వస్తాడో, రేపేవస్తాడో, చెప్పేశి వెళ్లిపోవచ్చును దా అనుకుంటూ, ఎదురుచూస్తూంది లక్ష్మి నాటికీ, నేటికీకూడాను.

## వెఱ్ఱివాడు

శ్రీమతి కూచిభొట్ల గంగమాంబ గారు

అనగనగా ఒక వెఱ్ఱివాడువుండేవాడు. వాడు ఒకకరణముగారిదగ్గర నౌకరీచేస్తూవుండేవాడు. వాడుచేసేపని ఏమీలేదు. అక్కడికిఇక్కడికితిరగటమే. ఒకరోజున కరణంగారు వెఱ్ఱివాడిని తనవియ్యంకుడిదగ్గిరకువెళ్లి కబుర్లుచెప్పిరమ్మన్నాడు. వెఱ్ఱివాడు సరేఅన్నాడు. కాని "బాబూ! మూడేసంగతులు చెప్పాతా"నన్నాడు. కరణంగారుకూడ సరేఅన్నారు. వెఱ్ఱివాడు వియ్యంకుడిగారి యింటికివెళ్లేక వాళ్లు "అంతా కుశలమా?" అనిఅడిగేరు. "ఊఁ" అన్నాడు వెఱ్ఱివాడు. "నీవెక్కడినుంచి వస్తున్నావు"అని మళ్లీఅడిగేరు. "కరణంగారి వూరునుంచి" అన్నాడు. "ఎవరుపంపించేరు"అని అడిగేరు. "కరణంగారే"అన్నాడు. తరువాత వియ్యంకుడు "మాఅల్లుడు క్షేమముగావున్నాడా"అని అడిగేడు. వెఱ్ఱివాడు మాట్లాడడే. అల్లుడికేమన్నా జబ్బొచ్చిందేమో అని అందరూ గొల్లుమన్నారు. వారితోపాటు వెఱ్ఱివాడుకూడ గొల్లుమన్నాడు. వూరంతావచ్చేరు. సంగతిఎవరికీతెలియదు. మరునాటికినిజము తెలిసి అందరుసిగ్గుపడ్డారు. కరణంగారు యిట్లాంటిపని వెఱ్ఱివాడికిచెపితేబాగుండలేదని తహసీలుదారుగారికి 100 మామిడిపండ్లుయిచ్చి రమ్మని ఒకకాగితముమీద వ్రాసియిచ్చేరు. వెఱ్ఱివాడు కాగితము చూస్తుందని రాతికిందదాచి పాతికపండ్లుతిని మిగిలిన ముప్పాతిక యిచ్చేడు. తహసీలుదారుగారు చీటీచూచి మిగిలిన పాతికఏవని అడిగేడు. "అయ్యో, తిన్నానండి. చీటిమీకు ఎలాచెప్పిందండి?"అని అడిగి కోపంతెచ్చుకుని ఎవ్వరులేనప్పుడు తహసీలుదారు కాగితములన్నీ తగులపెట్టేడు. ఇంటికి తిరిగివచ్చేక కరణం చాలాకేకలువేసి యిల్లు కావలికాయమనిచెప్పి తను యింట్లోవాళ్లతోసహా పెండ్లికి వెళ్లేడు. ఈలోపల బెల్లానికి చీమలుపట్టితే ఒక్కొక్కచీమ బయటకుతీసుకువచ్చి పారవేయటం మొదలుపెట్టేడు. ఎంతసేపటికి పనితీరకపోవటమువలనవిసుగొచ్చి ఒకతాటాకు బెల్లముమీదవేశాడు. నిప్పంటించేడు. బయటకువచ్చి కూర్చున్నాడు. ఇల్లంటుకుని అంతాకాలిబూడిదఅయింది. కరణముతిరిగివచ్చేడు. "ఇల్లేదిరా?" అని అడిగేడు వెఱ్ఱివాణ్ణి. "ఇన్నాళ్లు యింట్లోకివెలుతురు రావటములేదంటున్నారు. ఇప్పుడు మనయిల్లంతా వెలుతురేగా" అని గంతులువేశాడు వెఱ్ఱివాడు. కథ కంచికివెళ్లింది. మనమింటికి వచ్చేము.

## పులిపుట్టుక

శిలిగం జగన్నాథము గారు

లోకాలను, జంతువుల్ని సృష్టించడం బ్రహ్మదేవుని నిత్యకృత్యం. బ్రహ్మదేవుడు తనరచనాకౌశల్యంచేత జలచర, స్థలచర, అండజ, పిండజ మొదలైనచేతనాచేతనపదార్థాలనెన్నింటినో సృజించి జంతుజాలాలకధినాధుణ్ణిచేసేడు మానవుణ్ణి.

ఆకాలంలో అరణ్యాలలో క్రూరజంతుభయంవుండేదికాదు. ఎక్కడచూచినా పచ్చని పసిరికపట్టులే. ఏదుర్గమారణ్యంలో చూచినా మోకాటిలోతున పచ్చగడ్డి నవనవలాడుతూ నేత్రానందకరంగావుండేది.

కాబట్టి పశువులన్నీ అరణ్యాలకు మేతకుపోయి కడుపులనిండా గడ్డిమేసి అక్కడికో నేళ్లలో నీళ్లుతాగి స్వేచ్ఛగా సంచరిస్తూ రాత్రిళ్లు అరణ్యాల్లోనే ఏ చెట్లక్రిందనో పడుకుంటూ ఇళ్లకు వచ్చేవికావు. పశువులు సాయంకాలానికి ఇళ్లకు రాకపోవటంవల్ల మనుష్యులకు పాలూ, పెరుగూ దొరక్క చాలాయిబ్బందిపడేవారు.

ఈవిధంగా పశువులకు అరణ్యాల్లో ఏవిధమయిన భయంలేక పోవటంచేత ఎప్పుడూ అరణ్యాల్లోనే వుండేవి. అవసరమయినప్పుడు కాస్త నేపట్లో కడుపులనిండా మేసి ఎప్పుడూ చెట్లనీడను గుంపులు గుంపులుగా పడుకుంపటమే వాటిపని. ఇక రెండోపనియేమీలేదు. ఈకారణంవల్ల వాటికి సోమరితనంఎక్కువఅయి దేహ పరిశ్రమ బొత్తుగాలేనందున మేసిన మేత అరక్క అజీర్ణవ్యాధితో అల్లాడుతూవుండేవి.

ఇలాకొన్నాళ్లు గడచినాయి. ఒకనాడు పశువులన్నీ ఒకచోటసమావేశమయి ఈవిధంగా తీర్మానించు కున్నవి. "మనము బ్రహ్మవల్ల సృజింపబడి మానవులకు సౌఖ్యంకలగచేయడానికి నియమింపబడ్డాము. అర ణ్యంలో ఏవిధమయిన భయం మనకులేకపోవడంవల్ల నిచ్చలవిడిగా సంచరిస్తూ ఇళ్లకేవెళ్లటంలేదు. మానవులకు పాలూ, పెరుగూలేక మనరాకలకై పరితపిస్తూవున్నారు. అదిన్నీగాక మనము నిర్భయంగావుండటంవల్ల సోమరులమయినాము. కాబట్టి మనకు భయంవుండేటట్టు చేయాలని బ్రహ్మదేవుణ్ణి ప్రార్థించుకోవాలి." తీర్మాన మేకగ్రీవంగా ఆమోదింపబడటంవల్ల అప్పుడేబయలుదేరినాయి బ్రహ్మలోకానికి.

బ్రహ్మదేవుడు పశువులవాలకంచూసేడు. ఇవన్నీ పూరికేరావు. ఏదోకారణవుండే వచ్చినాయని అను కుని "ఎందుకువచ్చేరు" అని పశువుల్ని అడిగేడు. వచ్చినపని సవిస్తరంగామనవి చేసినాయి పశువులు. సరే వెళ్లండి తగినప్రక్రియ ఆలోచిస్తానని చెప్పి వాటినిపంపించి ఒకమంచి చెలపెయ్యను ఆపుచేసినాడు. దాని తలకు అరివేణికుండను తగిలించి వళ్లంతా వాతలువేసి దానికి ఏడుచెలపెయ్యలబలం ప్రసాదించి "పులి" అని పేరుపెట్టినాడు. పశువులను, మృగములను భక్షిస్తూ బ్రతకమని శలవిచ్చిపంపేడు.

ఆపులి ఒకఅరణ్యానికి పోయి కోపెరగడ్డిలోనక్కి వాపువేసింది. ఆసమీపానికి కొంతసేపటికి కొన్ని పశువులు వచ్చినాయి. పులి చూచింది తోకను మెలిపెడుతూ. ఒకఆవును దగ్గరకురానిచ్చి మీదకులంఘించ పోయింది. తోక కోపెరగడ్డికి మెలిపడటంవల్ల పులిప్రయత్నానికి భంగంకలిగింది. పులికి ఎక్కడలేనికోపం వచ్చి కారణమేమిటాఅని తిరిగిచూచింది. తోక కోపెరలో చిక్కుపడివుంది. తోకనుగుంజుకోబోయింది. రాలేదు. చాలాప్రయత్నించింది. కాని ప్రయోజనం కనపడలేదు. ఆఖరుకు వదిలిపెట్టమని కోపెరనుకోరింది. ఒక చెలపెయ్యబలంయిస్తే వదులుతానన్నది కోపెర. విధిలేక దాని కాబలమిచ్చి తోకను వదలించుకుంది.

పులి రెండోసారి పరవడిచేసి పైబడబోయింది పశువులమీద. ఈసారికూడా "మరుబులి" తోకను కరచి పట్టడంవల్ల పులికోరిక కొనసాగక అవరోధంకలిగింది. అప్పుడు పులిమళ్లీ దానికొక చెలపెయ్యబల మిచ్చి మూడోసారి పశువులమీదపడి ఎన్నోపశువుల్ని కొరికి చంపింది. పశువులన్నీ చెల్లాచెదరై యిళ్లకు పారిపోయి వచ్చినాయి. అప్పట్నుంచి అడవుల్లో పులి భయంవుండటంచేత పశువులు అడవులకే వెళ్లక గ్రామ పరిసరాల్లో మేస్తూ (ఒకవేళ అరణ్యానికివెళ్లినా) సాయంకాలానికి ఇళ్లకుచేరుకుంటూవున్నవి.

ఇప్పటికీ అడవుల్లో కొన్నిచెట్లకు "మరుబులి" అనేసూక్ష్మక్రిములుంటాయి. గొడ్లుగాని మృగములు గాని చెట్లకురాసుకునేటప్పుడు ఏతోకనో కరచిపట్టినాయంటే ఇక అక్కడవుండి పోవలసిందే దానిని ఊడదీయాలంటే ఆతోకను అక్కడకు నరికితేనే సాధ్యమవుతుంది. కాని ఇతరప్రయత్నాలెన్ని చేసినా విఫ లమే అవుతాయి. ఈమరుబులికిని, కోపెరగడ్డికిన్నీ అంతబలంవుండటానికికారణాన్ని, పులిపుట్టుకను పురస్క రించుకొంటో ఈకథను చెప్పుతారు మనపెద్దలు.

## ఉదారహృదయులు

శ్రీమతి ఐ. చంట్ల సత్యవతమ్మగారు

మొరాకోదేశములోని ఒకపట్టణమందొక మొరాకోదేశస్థుడు తనతోటలో పచారు చేయుచుండెను. ఇంతలో స్పెయినుదేశస్థుడగు నొక గుఱ్ఱపురౌతు అకస్మాత్తుగావచ్చి "తానొక మొరాకోదేశజుని చంపినందులకుగాను తన్ను బట్టవచ్చుచుండినవారినుండి రక్షించవలసినదిగా" వేడికొనుచు కాళ్లపై బడెను. ఆమొరాకోదేశస్థుడాదీనునికి శరణొసగ వాగ్దానముజేసి, వాని నొకయింట్లో దాచి పైనతాళమువేసి చీకటిపడగనే పరులకుదెలియకుండ పారిపోయేలాగ యేర్పాటుచేసి జాగ్రతపెట్టెను. ఇంతలో నామొరాకోదేశజుని కుమారుని శవము కొందరిచే నతనివద్దకుకొనిరాబడెను. తనకుమారునిహత్యజేసినవారెవరని విచారించగా తానింతకుమున్ను శరణిచ్చిదాచిన స్పెయినుదేశస్థుడగువాడేయని విదితమయ్యెను. కాని ఆడితప్పని వాడగుట తనకుగలిగిన కోపతాపవిచారము లణచికొని మధ్యరాత్రివేళ తలుపు దీసిస్పెయినుదేశస్థునితో నీక్రిందిరీతిబల్కెను. "నీవు చంపినట్టిపిల్లవాడు నాయేకపుత్రుండు. నీక్రూరత్వము కఠినశిక్షకర్హమైయున్నది కాని నేను నామనఃపూర్వకముగా నిన్ను రక్షింప వాగ్దానముచేసితినిగావున నీయట్టిక్రూరవిరోధికి విమర్శించకుండ ఇచ్చినమాట తప్పజాలను. నీచేతులు నాసుతుని రక్తముచే మైలపడియున్నవి. నీపాపమును పరిపాలించుట కాపరమేశ్వరుడే తగినవాడు. నాకుకలిగిన దుఃఖోద్రేకముచే ఇచ్చినమాటతప్పజేయకుండను, భగవంతునియందుండెడి భక్తిచెడిపోకుండను కాపాడినందుల కాదేవుని కనేకవందనములు చేయుచున్నాను. దీనియొక్క మంచిచెడ్డలాయనకె వదలివేయుచున్నాను. ఇంతకాలము నీతో ప్రసంగించుట నామనోవేదనకు దోహదము కాన ఈగుఱ్ఱమునెక్కి తెల్లవారకుండనే యిక్కడనుండి పారిపొ"మ్మనిచెప్పి తనగుఱ్ఱములలోనెల్లవేగముగాబరుగెత్తగలిగిన యుత్తమాశ్వమునకు జీనువేసియిచ్చెను. ఆహా! ఉదారహృదయులెంతటి సహనశీలురో ఈకథ తెల్పుచున్నది. మాటనిలబెట్టుకొనుటయే మానవంతుల లక్షణము. మానవంతులకు కన్నకడుపైన తృణప్రాయమగును. ఆచంద్రార్కమగు కీర్తికాములకు అశాశ్వతదేహమోహ మడ్డురాజాలదు.

## కోమటియుక్తి కోటి సేయు

కమలనాథ రాయిగారు

అనగా అనగా ఒకగ్రామము ఉండేది. ఆగ్రామములో ఒక కోమటి ఉండేవాడు. అతడు అచ్చట వ్యాపారముచేస్తూ ఉండేవాడు. తాను తనభార్య తప్ప అతనిఇంట మరి యెవ్వరునులేరు. వ్యాపారమునందు లాభము అధికముగావచ్చుటచేత అతని ధనము ఎక్కువఅయ్యెను. ఆకోమటిఇంటనుండు ధనమును దొంగిలించుటకు ఒకదొంగవాడు అనేక దినములనుండి ప్రయత్నించుచుండెను. అతనిఇంట వాడు చొరబడి పడకటింటిఅటకమీద దాగుకొనెను. వారు నిద్రించిన వెనుక అటకదిగి ధనమును దోచుకొనవలెనని దొంగ తలచు

చుండెను. భార్యాభర్తలిద్దరు భోజనమైనవెనుక పడుకొనిరి. కొన్నిగడియలతరువాత వారు నిద్రించిరో లేదో అని దొంగ తొంగిచూచెను. అతొంగిచూచుట కోమటిచూచి దొంగ దొంగ అని అరచినచో అటకపైనుండి వాడుదిగివచ్చి వారికి ఏమైన హానిచేయునేమోయని యుక్తిగ అతడు తనభార్యనులేపి "నీకు కుమారుడు పుట్టిన ఇష్టమా లేక కుమార్తె పుట్టిన ఇష్టమా?" అని అడిగెను. కుమార్తెపుట్టినయెడల తనకు అన్నివిధముల సహాయముగా ఉండునుఅని భార్య అనెను. అంత కోమటి అదివిని "నీవుస్త్రీవిగనుక స్త్రీనేకోరితివి. కాని మొగవాడే పుట్టినయెడల చాలామంచిది; వాడు మనకు చాలసహాయముచేయును; మన వంశము వృద్ధిజెందును. ఆడపిల్ల ఎదిగినవరకు మనఇంటఉండి తరువాత పరులఇంటికిపోవును. కాబట్టి మొగవాడే పుట్టుట మంచిది. నేను మొగపిల్లవానినే అధికముగా ప్రేమింతును. వానికి 'అప్పడు' అని పేరుపెట్టెదను. ఐదుసంవత్సరములు రాగానే వానిని బడికిపంపెదను. వాడువచ్చుట ఒకగడియ ఆలస్యమైనయెడల అరుగుపైని నిలచి 'అప్పడూ!' 'అప్పడూ!' అని పిలచెదను." అని కోమటి గట్టిగా అరచుచుండెను. వీరు సంభాషించుటవల్ల దొంగకు వీలుచిక్కక అటకపైని కూర్చొనిఉండెను. ఆకోమటి అరపువిని పొరుగునఉండు అప్పడు వచ్చి తలుపుతట్టగా కోమటి తలుపుతెరచి "ఎందుకువచ్చితివి?" అని అడిగెను. "నన్ను ఎందుకు పిలిచితివి?" అని అప్పడు అనెను. "నిన్ను పిలువలేదు" అని కోమటి బదులు చెప్పెను. "నాతో హాస్యములాడుచుంటివా?"అని అప్పడున్నా, "ఇంత రాత్రివేళ నాఇంటికి వచ్చి నాతోజగడము ఆడుచుంటివా?"అని కోమటియు తగవులాడుచుండ, ఇరుగు పొరుగు వారువచ్చి ఏమని అడిగిరి. కోమటి ఇట్లుచెప్పెను: "నాకు కొడుకు పుట్టినయెడల వానికి 'అప్పడు' అనిపేరుపెట్టి వాడు బడినుండి వచ్చుట ఆలస్యమైన అరుగుపై నిలచి 'అప్పడూ!' అని పిలచెదనని నాభార్యతో చెప్పుచుంటిని; కాని వీనిని పిలువలేదు. వీడువచ్చి నాతో జగడమాడుచున్నాడు. నేనుచెప్పినది నిజమో, అబద్ధమో నాభార్యను అడగండి. ఆమె నామాట ఆడునని మీరు ఆమెను విశ్వసింపకున్నయెడల అటకపైనుండు పెద్దమనుష్యుని అడగండి." మూడవవాడు ఎవడో అటకపైని ఉన్నాడని వారు ఆశ్చర్యమునుజెంది అటక ఎక్కి వానిని పట్టుకొని దొంగగా తెలిసికొనిరి.

## నోఁచినవారిసొమ్ములు

వడ్డాది సుబ్బారాయుడుగారు

ఉ. సూచికతోడి దారమగుచున్ బలిపాయకకూడియుంటయున్  
గాచముఁబోలెఁగాక మణిగాఁ దనుగాదిలిభర్తచూచుటల్  
పూచినతంగెడుంబలె నిలున్ సిరిసంతుల నిండియుంటయున్  
నోఁచినవారిసొమ్ములవి నోఁచనివారికిఁ గల్గనేర్చునే?




శ్రీమతి నాయని హనుమాయమ్మగారు

## తేనెతోనలు

అర్థశేరు మినపపప్పు రాత్రినానబోసి, మరునాడు ఉదయము దానిని మెత్తగా రుబ్బవలయును. దానిలో కొద్దిగా సోడా (మనము సాధారణముగా కూరలలో వేయునది) పొడరు వేయవచ్చును. పిండి పలచగా కాకుండా సాధ్యమైనమట్టుకు గట్టిగా రుబ్బవలయును. ప్రొయ్యిపైన కళాయి (బాణలి: దీనినే కొందరు బూర్లెమూకుడు అనెదరు) పెట్టి నెయ్యిపోయవలెను. అర్థశేరు మినపపప్పుకు సుమారు 10 పలములు (¼ వీశె) నెయ్యిపట్టవచ్చును. నెయ్యిమసలగనే పైనిచెప్పినమినపపిండి మురుకులుపిండే గొట్టమునందుంచి మురుకులవలెనే చేతిలో పిండవలెను. ఎరుపుడాలువచ్చువఱకు వేయించి తీసి బూరాచక్కెర చల్లవలయును. పిండి పలచనలేకుండా చాకచక్యముగా వేయించితీసినయెడల ఇవి వారమురోజులు చెడకుండాఉండును.

## మైసూర్ పాక్

¼ శేరు శనగపిండి పాత్రతో వేసి కొలచిఉంచవలెను. మనము దేనితో పిండికొలచితిమో ఆపాత్రతోనే కరగిన నెయ్యి 1½ పాత్రకొలిచి ఒకపాత్రలోపోసి కాచుకొనవలెను. ¼ శేరు శనగపిండికి ¼ శేరు (కొలతశేరు) చక్కెర కొలిచి ఉంచుకొనవలెను. తర్వాత శనగపిండి దోరగా వేయించవలెను. కొందరు వేయించకుండాకూడ చేయుదురు. కాని వేయించుటయేమంచిది. మనము కొలిచియుంచుకొన్న చక్కెరలో కొద్దిగానీళ్లుపోసి పొయ్యిపైన పెట్టిపాకముకాచవలెను. పాకము మనము వ్రేళ్లతో తాకితే కొద్దిగాతీగవలెరావలయును. పాకముకాగుచున్నప్పుడే కొలిచిపెట్టుకొన్న నెయ్యికూడా బాకాపొగలు వచ్చేటట్లు కాచుకొనుచూ ఉండి చక్కెరపాకము వ్రేళ్లకు తీగలవలె అంటినతోడనే సగము నెయ్యిపోసి వేయించిపెట్టుకొన్న శనగపిండి అందులోపోసి బాగాకలుపవలెను. చిన్నమంటగాపెట్టి బాగాకలుపుచూ, కలుపుచూవచ్చిన కొంతసేపటికి ఆపిండిఅంతయు ముద్దగాగరిటకే అంటుకొనును. తెల్లగా, నురుగులుగా, పుట్టలు, పుట్టలుగా వచ్చును. బాగాముద్దవలె అవగానే మిగత సగమునెయ్యి (బాగాకాగి పొగలువచ్చేటట్లు యుండవలెను) అందులో పోసిదింపుకొని పళ్లెములోపొయ్యవలెను. ఒక ¼ గంటసేపులో దానిని కత్తితో ముక్కలుగా కోసిన అచ్చులవలె వచ్చును. మృదువుగకూడాఉండును.

## అలచందలవంకాయ

అలచందలను కమ్మగవేయించి మృదువుగ ఉడకబెట్టవలయును. లేతవంకాయలను నాలుగు బద్దలుగ తరిగి తగినంత ఉప్పు, కారమును పదరుబద్దలకు పట్టించి తిరుగబోతలో వేసి మెత్తబడువరకు ఉడకనిచ్చి పిమ్మట ఉడకబెట్టిన అలచందలను కావలసినన్ని కూరలో కలిపి మరికొంతసేపు వేయించవలయును. పిమ్మట

పొయిమీదనుంచి క్రిందకుదింపి వేడిఆరకముందే భుజించవలయును. వంకాయకూరవండునప్పుడు కొద్దిగ చింతపులుసుగాని నిమ్మపులుసునుగాని బద్దలమీద చల్లవలయును. ఈకూర తిరుగబోతలో పచ్చికొబ్బెర తురుముకూడ వేసిన లెస్సగనుండును. పైవిధమువలెనే శనగలు, శనగపప్పు, కందిపప్పు, పెసరపప్పు మొదలగువాటిని తిరుగబోతలోకలిపి వంకాయకూర వండవచ్చును.

## నూనెవంకాయ

మరియొకవిధమో. చిన్నరకము లేతవంకాయలను తరగకుండ కాయలమట్టు దబ్బనముతో చిన్నరంధ్రములను చేసి బాణలిలో నూనెనుపోసి కళకళకాగునప్పుడు సదరువంకాయలను నూనెలోవేసి వేయించవలయును. మెత్తగ వేగినపిమ్మట కొద్దిగ మిరియములను కావలసినఉప్పునుకలిపి పొడిచేసుకొని సదరువంకాయల మీద చల్లవలయును. పిమ్మట భుజించవలయును. ఇది బెంగాలిబాబులకు ప్రియమట. బెంగాలివారు వంకాయ కూరలో కరివేపాకుకు బదులు లేతవేపచిగురును వేసివండి భుజించుట సర్వసామాన్యము. ఇట్లు చేయుట చాలా ఆరోగ్యవర్ధకము. ఇందువలన ఆమాశయములోని క్రిములు నశించును.

## ఉల్లిగడ్డల పకోడా

5 పలముల ఉల్లిగడ్డలు, $1\frac{1}{4}$ పలముల పచ్చిమిరపకాయలు, $\frac{1}{2}$ పలం పచ్చిఅల్లం, $\frac{1}{4}$ పలం కొత్తిమిర తీసుకొనుడు. ఉల్లిపాయల పొట్టుతీసి కొనలు తరిగివేయవలెను. మిరపకాయల కాడలు త్రుంచి వేయవలెను. అల్లముపైతోలు తీసివేయవలెను. కొత్తిమిరికాడను త్రుంచివేయవలెను. పిమ్మట వీటినన్నిటిని ముక్కలు ముక్కలుగ తరిగి కలాయిపాత్రలో నుంచవలెను. పైదానికి $2\frac{1}{2}$ పలముల నెయ్యిచేర్చి, పిసికి ముద్దచేయవలెను. ఈముద్దలో $\frac{1}{4}$ మద్రాసుపడి శనగపిండి, 1/8 మద్రాసుపడి పచ్చిపిండి కలుపవలెను. 1 పలం ఉప్పు, 1/16 పట్ణంపడినీటిలోకలిపి ఆనీటిని పైనున్నముద్దలో పోయవలెను. 3/16 పాల్ల మద్రాసుపడి నీటిని మరల యీముద్దయందుపోసి, చిక్కగ కలుపవలెను. $2\frac{1}{2}$ పలములు ముంతమామిడి పప్పు పైతోలుతీసి ముక్కలు ముక్కలుగ తరిగి చేర్చవలెను. ఈపాకమును 4 భాగములుగ చేయవలెను. $7\frac{1}{2}$ పలముల నేతిని బాణలియందుపోసికాచి దానిలో పిండిని పోకచెక్కప్రమాణంతీసి ఉండలుగచేసి కాల్చవలెను. నిమిషమున కొకసారివంతున ఈఉండలను నేతిలో గరిటెతో పొర్లించవలెను. ఉల్లిగడ్డలు సహించని వారు దానినిచేర్చకనే పకోడీలను తయారుచేయనగును. అపుడు శనగపిండి సమానభాగముగ చేర్చవలెను.

## టెంకాయపూర్ణంపోళీలు

$\frac{1}{4}$ మద్రాసుపడి బియ్యం నీళ్లలోపోసినానబెట్టి, పిమ్మట నీళ్లువారబోసి, బియ్యము నొకపాత్రయందుంచవలెను. ముదిరిన టెంకాయలు మూటిని పగులగొట్టి, తురిమి, బియ్యముతోచేర్చి కొంతనీరుచల్లి రోటిలో రుబ్బవలెను. 30 పలములు తెల్లచక్కెర, $\frac{1}{2}$ మద్రాసుపడి నీటిలోకలిపి కాచవలెను. $\frac{1}{4}$ పలం ఉప్పు, $\frac{1}{4}$ పలం ఏలకులపొడి కాగుచున్ననీటిలోపోసి, దానితోకూడ టెంకాయ బియ్యపు మిశ్రమమునుపోసి బాగుగ కలియబెట్టవలెను. పొయ్యిమీద పాత్రపై మూతవేసియుంచవలెను. మరల కలియబెట్టి, పాత్రను దింపి పూర్ణమును కళాయితట్టయందు పరచవలెను. 3/8 పట్ణంపడి గోధుమపిండిలో కొంతనీరుచేర్చి ముద్దగ కలుపవలెను. $\frac{1}{4}$ పలం నూనె, 1/8 పలం ఉప్పు దీనికిచేర్చి కొట్టి మృదువుగు ముద్దగచేయవలెను. ఈముద్దనుండి నిమ్మకాయంతేసి ఉండలు తీసుకొని పలుచగతట్టి, పల్లముచేసి అందు $1\frac{1}{2}$ యింశల పూర్ణమునుంచి మూతిని కప్పివేయవలెను. పిమ్మట దానిని అప్పడమువలె గుండ్రముగతట్టి కాల్చవలెను. దీనికే టెంకాయ పూర్ణంపోళియని పేరు.




## టి. పి. రాజ్యలక్ష్మికన్య

ఆకుండి వేంకటశాస్త్రిగారు

గృహలక్ష్మిలో ఇంతవఱకు సులోచనకన్య, ఏణాక్షీ రామారావుకన్య, సీతాదేవికన్య మొదలగు నట్టువరాండ్ర చరిత్రములు సచిత్రములుగ ప్రకటింపబడినవి. ఆచరిత్రములు సినిమా పత్రికలయందు ప్రకటింపబడిన వారి జీవితచరిత్రవిషయములను క్రోడీకరించి వ్రాసినవియేగాని వారిని సందర్శించి వ్రాసినవిగావు. సినిమా నటులను సందర్శించి వారివలన సినిమాచిత్రనిర్మాణములలోగల స్వానుభవములను, కష్టసుఖములను తెలిసికొని వారిచరిత్రమును పత్రికాముఖమున వెలువరించినచో అట్టివారిచరిత్రములు పాఠకమహాశయుల కెక్కుడు రుచిరముగనుండునను తలంపుతో నేనును, శ్రీయుత కుర్రా వేంకటసుబ్బారావుచౌదరిగారును మద్రాసునందున్న ఈనట్టువరాలిని స్వయముగా దర్శించి సంభాషించి ఆమెచరిత ఆమెచెప్పినరీతిని ఇట వివరింపుచున్నాము:

"నాజన్మస్థలము తిరుచునాపల్లి. బ్రాహ్మణవనితను. తమిళ్ భాషాపరిచయముదప్ప వేరొండు భాషాపరిచయములేదు. ఇప్పటివయస్సు 20 సంవత్సరములు. నాపదియవసంవత్సరముననే తమిళ్ నాటకములయందు పాత్రధారిణినై సువర్ణపతకములను బడసితిని. నృత్యగానములయందు ప్రవేశముగలదు. నేను 1929-వ సంవత్సరమున మదరాసు జనరల్ ఫిక్చర్ కార్పొరేషనువారి 'కోవలన్' యనుఫిలిమునందు మాధవియను పాత్రను, 'వృషాసుందరి'యందు చిత్రరేఖ యను పాత్రను ధరించి నటించితిని. తరువాత ఆకార్పొరేషనువారిని వీడి ఆరు ఏడుమాసములు ఇంటివద్దనేయుంటిని. అనంతరము అసోసియేటెడ్ ఫిలిమ్సులిమిటెడ్ వారికోరికననుసరించి 'రాజేశ్వరి' యను ఫిలిమునందు ప్రధానపాత్రయగు రాజేశ్వరి పాత్రమును నటించితిని. తరువాత ఇంపీరియల్ మూవీటోనువారి పిలుపువచ్చువరకును ఏనాటకమందుగాని ఏఫిలిమునందుగాని నటించియెరుగను. ఇంపీరియల్ మూవీటోన్ వారి పిలుపు వచ్చినంతనే బొంబాయివెళ్లి 'కాళిదాసు' యను మాటలాడుఫిలిమునందు కాళిదాసు భార్యయగు సౌదామినిపాత్రను ధరించితిని. దీనిలో నేను తమిళ్, తెనుగుపాటలను బాడితిని; తెనుగున వచనముగూడ జెప్పితిని."

తుదిమాట వినినంతనే మేమిటుల ప్రశ్నించితిమి.

ప్ర:—నీకు తెనుగుభాష రాదుగదా నీవెటుల తెనుగున సంభాషించితివి?

ఉ:—తెనుగుమాటలను ద్రావిడలిపిలో వ్రాసుకొని వల్లించితిని. ఫిలిమునందు నటించి సంభాషించితిని. తెనుగున రెండు త్యాగరాయకృతులు పాడితిని. అవి 1. "ఎందరోనిందసే" 2. "రామానీయెడ ప్రేమరహితులకు" అనునవి. ప్రక్కవాయిద్యము (అనగా హార్మోనియము) నాసోదరుడు రాజగోపాలము వాయించెను. తమిళ్ భాషయందు "రాట్నమో" యను జాతీయగీతమును బాడితిని.

ప్ర:—మాటలాడుఫిలిమునందు ఎక్కువకష్టమా లేక మాటలాడనిఫిలిమునందు ఎక్కువకష్టమా?

ఉ:—మాటలాడుఫిలిమునందున్న కష్టము మాటలాడనిఫిలిమునందుండదు. ఎలనన మాటలాడుట, భావమును ప్రకటించుట యొకేసారిజరుగుటచేత, పాటలుబాడుటయు, నటించుటయు రాత్రులందు జరుగును. అప్పుడు ఎక్కువకాంతిగల విద్యుద్దీపములనుపయోగింతురు. ఆకారణమున కనులకు జబ్బువచ్చును. నేను బొంబాయినుండివచ్చినదిమొదలు కనులకు చికిత్సచేయించుచునేయున్నాను.

ప్ర:—నీవు ఫిలిములలో నటించుటకు కంపెనీవా రేమాత్రము ధనమొసంగెదరు?

ఉ:—మాటలాడని ఫిలిముకంపెనీవారికన్న మాటలాడు ఫిలిముకంపెనీవారు ఎక్కుడు ధనమొసంగెదరు గాని ఎంతమొత్తమొసంగునది చెప్పజాలను. క్షమింపవలయును.

ప్ర:—నీకు మాటలాడుఫిలిములలో నటించుట యిష్టమా, లేక మాటలాడనిఫిలిములలో నటించుట యిష్టమా?

ఉ:—నేను రెంటియందును నటించుటకు ఉత్సహించెదను.

ప్ర:—నీవు ఇందు ఏకంపెనీవారివలన అత్యున్నతస్థితికి రాగలవో చెప్పగలవా?

ఉ:—మాటలాడుకంపెనీవారివలననే అత్యున్నతస్థితికి రాగలనని యూహించుచున్నాను.

అనంతరము మేమామె చిత్రపటమొకటి ఇమ్మని కోరితిమి. అందుమీద ఆమె బొంబాయి ఇంపీరియల్ మూవీటోన్ కంపెనీవారి 'కాళిదాసు' ఫిలిములో నటించునప్పటి యొక దృశ్యపటమొసంగెను. అయ్యది స్థలాంతరమున ప్రకటింపబడినది.

ఈమె ప్రస్తుతము మదరాసులోని కీలుపాకమునందు నివసించుచున్నది. ఈమె పేరుగల నట్టువరాలు, రూపసి. తన యశస్సునకుతోడు ధనముగూడ గడించినది. ఆంధ్రదేశ మీసినీమాకళయందు వెనుకబడియున్నదని చెప్పుటకు విచారమగుచున్నది. అన్యస్త్రీలు తెనుగుభాషను తమలిపిలో వ్రాసుకొని నటించిన ఫిలుములను గని మన యాంధ్రస్త్రీలు నోరుదెరచుకొనిచూచెడి యవస్థగల్గినది; ఇతరజాతి స్త్రీలు మన యాంధ్ర భాషను మాటలాడునప్పుడు వినుటకు ఏవగింపుగనుండును. ఆంధ్రస్త్రీల భాషోచ్చారణకును, ఇతర స్త్రీల ఆంధ్రభాషోచ్చారణకును ఎంతయో భేదముగలదు. అట్టిచో మన స్వభాషయగు తెనుగున ఇతరజాతి స్త్రీలు అమితమగు ఖ్యాతిని గడింపుచుండ మన ఆంధ్రస్త్రీలోక ముపేక్షాభావము బూనుచున్నది. ఇది సహింపరానిది. కావున ఆంధ్రదేశపు నాట్యకత్తెలు మేల్కాని సినీమాప్రదర్శనములయందు పాల్గొని నటించి తమ జాతిగౌరవమునుకాపాడి పాటిసీమలయందు ప్రఖ్యాతి గడించెదరుగాక! సినీమాప్రదర్శనములందు పాల్గొనిన మాత్రమున నీచతలేదు. అదియునొకకళ. ఆకళావిషయమునకూడ కృషిసలుపుట ఆంధ్రకీర్తికి దోహదము చేయుటయే.

## దీవనలొసంగుమమ్మ

శ్రీమతి దేశరాజు భారతీదేవిగారు

సమకూర్చినారుగా శాంతిసైన్యంబుల —
స్వాతంత్ర్యమొసగూర్చు సమరమునకు
భూనభోంతరముల పూర్ణమౌ శంఖముల్
పూరించినారుగా ధీరలగుచు
శిరములదాల్చిరి పరమేశునాజ్ఞగా —
గాంధీసదాజ్ఞల గౌరవమున
ప్రకటించినారుగా పికెటింగు లూరూర
పరవస్త్రముల బహిష్కరణజరుప
తామె శాసనోల్లంఘనోద్యమముబూని
భారతీయులు లోకవిఖ్యాతిగొలిపి
వారికిజయంబు నింకచేకూరునట్లు
దీవనలొసంగుమమ్మ! ఓ దేశమాత!

# సమస్యాపూరణము

## ఆగష్టు మాసపు సమస్య

"నోచినవారిసొమ్ములవి నోమనివారికి గల్గనేర్చునే"

నీచులు ధార్తరాష్ట్రు లవనీతల మెల్లగ్రహింప, ధీరులై
రాచకొలమ్ములో తమపరాక్రమ మెంత కడిందియయ్యు, కే
ల్సాచినపాండవుల్ ధనము, సౌఖ్యములందక కాన కేగరే;
నోచినవారిసొమ్ములవి నోమనివారికి గల్గనేర్చునే!

—వడ్లమాని నారాయణమ్మ.

తోచెడుభావజాలముల తోడ స్వశక్తులు మేళవింపగా
శ్రీ చెలువార పద్యములు జెచ్చెరఁజెప్ప చనర్ఘధారతో
వేచినశ్రోతలబ్బురము వేడ్కయుఁ జెందగఁ జేయ నెల్లయుక్
నోచినవారిసొమ్ములవి నోమనివారికిఁగల్గనేర్చునే?

—కల్లూరు సీతమ్మ.

యాచకవాంఛదీర్ప సుఖమందగజాలిన యర్థసంపదల్
చూచినమాత్ర సౌఖ్యములుచొప్పడజేసెడు సత్కళత్రమున్
రాచిలుకట్లు పేడ మధురంబుగ ముద్దుగబల్కు పిల్లలున్
"నోచినవారిసొమ్ములవి నోమనివారికి గల్గనేర్చునే?"

—యన్. లీలావతి.

ఈచిరదుఃఖసంతతులె యెల్లప్రభుండు హృదయమ్ము పీల్చన
స్నేమనుగాని యొక్కయణువేనియు దేశహితమ్ము చేయఁగా
నోచఁగనైతి నెంతటిపనుల్ వనితల్ మును చేయరైరి యా
నోచినవారిసొమ్ములవి నోమనివారికిఁ గల్గనేర్చునే.

—గండికోట సావిత్రీదేవి.

ఆచపలాక్షి భారతిదయన్ గనుగొన్న నికేమి తక్కువౌ
వాచవి గద్యపద్యరచనానుపకీర్తన లల్లి వారిజా
లోచనుడౌ హరిన్ పొగడజాలిన సొమ్ములు కావె వారికిన్
నోచినవారిసొమ్ములవి నోమనివారికి కల్గనేర్చునే.

—చోడవరపు రంగనాయకమ్మ.

ఓచెలి! నారదుండిడ నటొక్కలతాంతము శౌరికాతడున్
దాచకనిచ్చి రుక్మిణికిఁ దానను సిగ్గిలజేసె, నారకే
నాచపలుండు సత్యపయి నాదరముంగను పర్చవందురో
నోచినవారిసొమ్ములవి నోమనివారికి కల్గనేర్చునే.

—సామవేదం సీతారామమ్మ.

శౌచము, భోగభాగ్యములు, సద్యశముల్, మహనీయబుద్ధి, పు
ణ్యాచరణంబు, సద్గుణగణంబులు లభ్యములౌను భవ్యల
క్ష్మీచరణార్చనావ్రతముఁ జేసిన నోచినఁగానియూరకే;
నోచినవారిసొమ్ములవి నోమనివారికిఁ గల్గనేర్చునే.

—శేషమాంబ.

పూచినతంగెడుల్ వలె నపూర్వసుశోభితసంకబాలలీ
లాచెయిదంబులందనుభవించిన మాతృకసౌఖ్యముల్ ధరన్
జూచినలోకమీతరుణి జేసినపూజఫలంబు చేననన్
నోచినవారిసొమ్ములవి నోమనివారికిఁ గల్గనేర్చునే?
కాచినచెట్టుకాయలతో కన్నులుచల్లగగాంచురీతిగా
పూచినతంగెడుల్ వలెను పొత్తులబిడ్డల లీలలందుచున్
ఏచినబాధఁ బ్రేమచవిజూచిన మానసమింపుఁ జెందగా
నోచినవారిసొమ్ములవి నోమనివారికిఁ గల్గనేర్చునే?

—ఆచంట సత్యవతమ్మ.

శ్రీచలనంబులేనిదయి చెల్వుగనింటను నుండుటెప్పుడున్
యోచనసేయుచున్ హరినిమల్లమునంగడు భక్తితోడ పూ
జాచరణంబొనర్పుటయు హైన్యముబొందమి సత్యవాక్యమున్
నోచినవారిసొమ్ములవి నోమనివారికిఁ గల్గనేర్చునే.
తోఁచుటమంచిభావములు తూఁచినయట్లుగపద్యపున్నుడుల్
సూచనసేయునంశమును సూక్ష్మముగాగ్రహియించు దల్వియు
వాచకశక్తియెల్లపుడు భారతివాలుక నిల్చియుండుటయున్
నోచినవారిసొమ్ములవి నోమనివారికిఁ గల్గనేర్చునే?

—పాకల రత్నమాల.

యాచకులందునాదరణ మంబికపోలినశీలవృత్తి యా
లోచనకల్గు విద్య యతిలోకపుకూరిమిజూపుభర్త వా
సోచితసౌధముల్ సుతులనూనులు దీర్ఘసుమంగళీత్వమున్
నోచినవారిసొమ్ములవి నోమనివారికి కల్గనేర్చునే.

—ఎమ్. వేదవల్లి తాయారమ్మ.

నీచపుకార్యమందు చొరనీకమనస్సును కట్టిపెట్టి సం
శోచములేక యెంతయును గౌరివ్రతంబును శ్రావణంబునన్
ఆచరణంబుచేసిన నఖండసుమంగలవైభవంబులో
నోచినవారిసొమ్ములవి నోమనివారికి గల్గనేర్చునే.
శ్రీచెలువారమందిరము శీఘ్రము మెత్తి శుభ్రమొనర్చి స్నాతయై
పూచినపూలతోడ శుభదా వరలక్ష్మినిపూజచేసి గా

రీచరణంబులందు మదినిల్పి వ్రతంబును చేసిపొందగా
నోచినవారిసొమ్ములవి నోమనివారికి గల్గనేర్చునే.

—పిండిప్రోలు కొండయాంబ.

ఆచెలికాని-శ్రమవినుఖాగమన ప్రతిపద్రసోత్తరా
లాచిలుమావిలేఁజివురుటాకుపసల్ పికపదీయుటల్ సుధా
సేచకగానమాధురులు చిక్కువునాకమునోసు కాకమా!
నోచినవారిసొమ్ములవి నోమనివారికేఁ గల్గనేర్చునే.

—పరుచూరి భవనేశ్వరి.

నీచరితంబకల్మషము, నీవిషయంబతులంబు నీదుశాం
తోచితవాక్ప్రభావము మహోన్నత మీదగు దేశభక్తి ని
త్యాచలనంబు, నీకవిత యుబ్రము, ధన్యమనూ సరోజనీ;
నోచినవారిసొమ్ములవి నోమనివారికి గల్గనేర్చునే.

—గంటి కామేశ్వరమ్మ.

గోచిబెట్టి కమగాయలదినిన& వేమారకాపరమేశ్వరు&
బ్రోచికావుమంచునొక్కమనస్సున వేడినయాపరమాత్ముడు
బ్రోచికావడేయిల్లఫలంబొసంగి తముపూర్వఫలంబుల&
నోచినవారిసొమ్ములవి నోమనివారికి గల్గనేర్చునే.

—సానారు శాంతమ్మ.

[ఈసమస్యాపూరణమును ఇంకను పలువురు చేసియున్నారు. విశేషదోషములుంటచే వానిని ప్రచురింపమానితిమి. ఈమిగిలినవి యథామాతృకములుగ ప్రచురించితిమి. గృహలక్ష్మి పాఠకులు వీనినిబాగుగచదివి ఇందు తమకు ఏదిబాగుగ నచ్చినదో అట్లునచ్చుటకుకారణములేవో లేఖాముఖమున సెప్టెంబరు 20-వ తారీఖులోపున మాకు తెలుపగోరెదము. మాపాఠకులలో ఎక్కువమంది మెప్పునుపొందునట్లు ఈసమస్యను పూరించిన కవయిత్రికి యథోచితమగు పుస్తకబహుమానము చేయుదుము.

—సంపాదకుడు]

## జీవితసంగీతము —

కస్తూరి రాజామాణిక్యముగారు

నేను కళకోసమనియె జన్మించినాను!
నేను యుగయుగ జీవనాణినికదల్చి
పాడగలనోయి, మాధుర్యపథమునందు
ప్రకృతిమంగళరశ్మిమాలికాలయమందు
కరగిపోయిన జీవితగానమందు
విశ్వమాధుర్యసంతోషవేలుగళము
వినగలరుమీరు మ్రోగిపోయినవితాన.

# దానిమ్మ

డాక్టరు యస్. శేషగిరిరావుగారు యల్.ఐ.యమ్.

పండు (సాధారణము):—స్వాదుగనుండును; వాతమును, పైత్యమును, కఫమును హరించును; దుష్టరక్తమును గొట్టును; పొట్టకు బలముచేయును. ఆకలిపుట్టించును; తేలికనిచ్చును; కాని శ్లేష్మతత్వముగల వారికి జబ్బుచేయును. జ్వరములోపుట్టువిదాహమునణచును. దానిమ్మపండురసములో కుంకుమపువ్వుగాని పసుపుగాని కలిపియిచ్చిన నిక్కాకతత్వముగలవారికి మేలుచేయును. ఆహారపదార్థముగను, ఔషధముగను దానిమ్మపండు అనాదినుండి కొనియాడబడుచున్నది. పైత్యవికారములందు దానిమ్మపండు షరబత్తు మిక్కిలి ఉపయోగకారి. అది మిక్కిలిచలువచేయుపానకము. మూలవ్యాధియందు పచ్చిదానిమ్మరసమునందు లవంగములు, సొంటి, మాచికాయకలిపి అందుతేనెచేర్చి ఈయబడుచున్నది. బిడాలలవణమును తేనెలోకలిపి దానిమ్మరసముచేర్చి నోటియందుంచికొనిన మిక్కిలి అసాధ్యములగు నరోచకములు నశించును. దానిమ్మపండురసము ఔషధములందు వానిరుచి పెంపొందించుటకు కలుపబడుచున్నది. క్రొత్తగతీయబడిన పండురసము చలువజేయుటకైన పానకములందును, మందాగ్నిరోగమునం దీయబడు మందులయందును కలుపబడుచున్నది.

పండు తియ్యనిది:—చలవజేసి నీరుపెంచును. గుండెలకు బలమిచ్చును. జీర్ణముగావించును; రుచిబుట్టించును; మేహమును గొట్టును; పైత్యశాంతిజేయును; రక్తగ్రహణుల నణచును; పొట్టకు హృదయమునకు బలముజేయును; గుండెలలో వికారమును నొప్పిని దగ్గును హరించును. కాకతత్వముగలవారిపుంస్త్వమునకు బలమిచ్చును; కంఠస్వరమును బాగుచేయును; దేహపుష్టి రక్తపుష్టినిచ్చును. రక్తముశుభ్రపరచి గజ్జిని పోగొట్టును; కాంతినిచ్చును; భోజనాత్పరమందు పుచ్చుకొనిన అన్నమును జీర్ణముజేయును; జ్వరరోగులకు జబ్బుచేయును; మిక్కిలి పుచ్చుకొనిన వాతరోగములను పుట్టించును. జీర్ణశక్తిని తగ్గించును; విదాహము బుట్టించును. తియ్యదానిమ్మ పండుకు విరుగుళ్లు: పొగడపండు; కాకతత్వముగలవారికి పుల్లదానిమ్మపండు; చలువశరీరముకలవారికి అల్లపుమురబ్బా.

పండు పుల్లనిది:—చలువజేసి వేడిచేయును. పొత్తికడుపుకు బలమునిచ్చును; రుచిపుట్టించును; రక్తపైత్యమును హరించును. రక్తాతిసారమును, మేహమును గొట్టును. గుండెలకు నష్టముచేయును. మిక్కిలి కాకతత్వముగలవారికి అనుకూలముగనుండును. చలువదేహులకు అజీర్ణముచేయును; విరేచనబద్ధముచేయును; వీర్యనష్టము కలిగించు గుణముకూడకొద్దిగగలదు. పుల్లదానిమ్మ గింజలు 36 మాషములు, పిప్పళ్లు 18 మాషములు, మిరియాలు 5 మాషములు, జీలకర్ర 4 మాషములు వీటెని మాత్రకట్టుగ జేయజాలినంత పంచదారకలిపి మందాగ్నిరోగములందు ముప్పది మొదలు నలుబదియైదు గింజలయెత్తువ దినమునకు రెండుసారులు ఈయవగునని ఇయాజాల్ గుర్బాయను యునానివైద్యగ్రంథము చెప్పుచున్నది. పుల్లదానిమ్మకు విరుగుళ్లు పొగడపండు; శొంఠిపొడివేసిన తియ్యదానిమ్మపండురసము. చక్కెర, దాడిమవిత్తులు, ద్రాక్ష వీటినికలిపి నూరి నోటియందుంచుకొనిన జ్వరమువలన కలుగు అరుచి నశించును. కొడిశపాలకషాయము దాడిమబీజస్వరసములో తయారుచేసి తక్రము అనుపానముగానిచ్చిన రక్తాతిసారము తీవ్రమైనను నివర్తించును.

దానిమ్మ పట్ట:—క్రొత్తదానిమ్మపట్టనుండి తీయబడిన రసము అరఔన్సు మోతాదు వంతున తఱుచుగ ఇచ్చుటవలన క్రిములు హరింపబడును.

వేరుచెక్క:—కషాయము క్రిములను, ఏలికపాములను, నాడాపాములను చంపును. గ్రహణిని, రక్తగ్రహణిని, నీళ్లవిరేచనములను కట్టును; పుక్కిలించిన నోటిపూత నిమ్మళించును. నాడాపామును చంపుటకు కషాయముచేసి పుచ్చుకొనుపద్ధతి: నీళ్లు—100 తులములు. పచ్చివేరుచెక్క—5, 6 తులములు. కషాయము—60 తులములు. ఉదయము మొదలు అరఘంటకొకసారి 2 తులములయెత్తు కషాయము చొప్పున అది అంతాసరిపోయేవరకు పుచ్చుకొనిన నాడాపాముదానంతట అదేపడిపోవును. లేదా మరునాడు ఉదయమున రెండు మూడు తులముల యెత్తు ఆముదము పుచ్చుకొనిన నదిచచ్చిపడిపోవును. ఏలికపాములకు:—వేరుపట్టను ½ మొదలు 5 తులములవఱకు కషాయముగాని స్వరసముగాని నాలుగంశల నీటితో కలిపి పడకగట్టి పంచదారతోనైన తేనెతోనైన ఆముదముతోనైన పుచ్చుకొనునది. దీనినే రెండుఔన్సులు అరగంటకు ఒకతూరి ఈయవచ్చును. అవసరమగునో అనంతరము ఆముదము ఇచ్చుచుండవచ్చును. ఈమందు పాముయొక్కతల బయటపడువరకును ప్రతిదినమును సేవించవలయును.

ఏటికపామును బయటికితోసివేయుటకు గాను దానిమ్మ వేరుయొక్క క్రొత్తపట్టతోగాని పట్టముక్కలతో గాని ఇరువదింట ఒకపాలుగా తయారుచేయబడిన గాఢకషాయమునందు కొంచము లవంగాలచూర్ణముగాని మఱియొకసువాసనవస్తుచూర్ణముగాని కలిపిఇచ్చునో నమ్మకముగపనిచేయును. ఈకషాయము పరగడుపుననే ఉదయమున ఈయవలయును. ఒక్కొక్కసారి ఇచ్చుమోతాదు రెండుఔన్సులు. ఒకటి రెండుగంటలకొకసారి ఇచ్చుచుండవలయును. చివరమోతాదు పుచ్చుకొనినవెంటనే భేదికిమందు తీసికొనవలయును. పండ్రెండుగంటలలోగా పాముపడిపోవగలదు. పిల్లవాండ్రకు గలిగే దగ్గుసంబంధమైన వ్యాధులయందుకూడ ఈకషాయము ఉపయోగకారిగనుండుట కనుగొనబడినది. పురాణజ్వరము, ప్లీహావృద్ధి, మలేరియాజ్వరము వీనితరువాత గలిగేనిస్సత్తువ పీడించునప్పుడు ఈకషాయము పెద్దవారుకూడ ఉపయోగింపవచ్చును. క్రొత్తపట్టను రెండు ఔన్సులు గ్రహించి ఒకపైంటున్నర నీళ్లలోవైచి సగమునీరు ఇగురునఱకుకాచి దించి చల్లారనీయవలయును. పిమ్మట ఒకగ్లాసుడు ఈకషాయమును త్రాగవలయును. ఇట్లు అరగంటకొకసారి కషాయము అయిపోవువఱకు త్రాగవలయును. ఇది ఒక్కొక్కప్పుడు జీర్ణకోశమునకు కొంచము చెరుపుచేసినను క్రిములను సంహరించుటలో నిస్సంశయముగ పనిచేయును. డాక్టరు కన్యాలాల్ దేవుగారు ఏటికపామును వెడలించుటలో ఈమూలికనుండి క్రిందవివరింపబడుచున్న భేషజమును తయారుచేసి వాడవలయునని చెప్పుచున్నారు: పట్ట క్రొత్తదిగ సంగ్రహింపవలయును. రెండుఔన్సులపట్ట కొంచములవంగములుగాని ఇతర సుగంధద్రవ్యములుగాని చూర్ణము ఒకపైంటు చన్నీటియందువైచి ఆరుగంటల కాలముంచి అనంతరము 10 ఔన్సుల కషాయము మిగులునట్లు కాచవలయును. నిరాహారిగనుండి ఈకషాయము సేవించవలయును. మోతాదు తడవకు రెండు ఔన్సులు. రెండుగంటలకొకసారి పుచ్చుకొనవలయును. ఈకషాయము పుచ్చుకొనుటకు పూర్వమును, పుచ్చుకొనిన తరువాతను ఆముదము సేవింపవలయును. ఇది గుణమీయక పోవుట అనియుండదు. తిరిగి ఎప్పుడు కనిపించకుండ ఇది పాములను పుట్టించు పాముతలనుకూడ మూలనుట్టుగ నాశనము చేయును.

ఆకులు:—లేతఆకులు గుప్పెడుతెచ్చి నూరి అందులో గచ్చకాయంతవెన్న, గచ్చకాయంత పటికిపంచదారచూర్ణము గలిపి గచ్చకాయలకంటె ఉరువుగా మాత్రలుచేసి పూటకొకటి చొప్పున పెరుగులో (సుమారు తులమెత్తు పెరుగు) దినముకు 3 పూటల చొప్పున పుచ్చుకొనిన గ్రహణి, రక్తగ్రహణి కట్టును.

పంచమమాసగర్భచలనమునకు దాడిమపత్రములు, చందనము, పెరుగు, తేనె ఈయబడును.




**ఈతలో అగ్రేసరురాలు:—**

న్యూయార్కు నివాసిని రెట్టీ. మూర్ హ్యూ మెల్ సతి సీటిలో ఎడతెగక ఈదుచు 72 గంటల 2 నిముషముల 40 సెకండ్ల కాలము ఉండినది. ఇది 1928-వ సంవత్సరమున జరిగినది. ఇంతవఱకు ఎవరును ఈతలో ఈమెను మించలేదు.

**ఒకటే ముట్టి, తోకలు రెండు, ఏడు కాళ్లు గల గేదెదూడ:—**

పాట్నా పట్టణభాగమగు లోడికాట్రాయందలి సయ్యదు అమీనుద్దీను అహమదు అనువాని గేదె ఈనినది. దూడకు ముట్టిమాత్రమొకటేయున్నది. కాని కాళ్లుఏడును, తోకలు రెండునుఉండెను. పుట్టిన కొద్ది నిముసములకే ఆదూడ చనిపోయినది.

**వాయిదాలమీద సొమ్ముకట్టి భార్యలను కొనుక్కొనుట:—**

దక్షిణఆఫ్రికాలో ఒకానొకజాతి గలదు. వారు వాయిదాలమీద సొమ్ముకట్టి భార్యలను కొనుక్కొందురు. ఈపద్ధతికి వారు 'లోబోపద్ధతి' అందురు. వెండిబంగారములులేవు. వారికి పశువులే సొమ్ము. వానినే సొమ్ముగా వాయిదాల ప్రకారము చెల్లింతురు. ప్రిటోరియా విశ్వవిద్యాలయపు అధ్యాపకులగు జి. పి. లెస్ట్రేడు గారు ఈవిషయమును లోకమునకు వెల్లడించినారు.

**పత్తిగింజలను మానవులు తిను ఆహారపదార్థముగ జేయుట:—**

ఈజిప్టు పత్రికలలో రాజు అనతగిన కాన్‌స్టాన్‌టిన్ కె. షోరమి పత్తిగింజలను మానవులు తిను ఆహారపదార్థముగ జేయుహక్కులను ఈజిప్టు సుడాను ప్రాంతములందు గలిగియుండుటకు ఆవిధానమునుకనుగొనిన హీడెల్ బరీకమిస్టు అయిన కాశ్వరు స్క్రిట్టుకు 500000 పౌనులు ఇచ్చెను.

**నిముసమునకు నలుగురు పిల్లలు:—**

జపాను దేశమున 1930-వ సంవత్సరమున 2083991 శిశువులు జనించిరి. గవర్నమెంటువారి లెక్కల ప్రకారము నిముసమునకు '3.97' పిల్లల చొప్పున అయినది. దినమునకు జనాభా హెచ్చుదల 2500. మొత్తము జనాభా హెచ్చుదల 912592. జనాభాయొక్క ఈ హెచ్చుదలకు కారణములు మరణములసంఖ్యతగ్గుటయు, పుట్టుకలసంఖ్య పెరుగుటయును. 1930-వ సంవత్సరము చావులు 1171399. ఇవి 1928-వ సంవత్సరమున సంఖ్య

వించిన మరణముల కంటె 89000 తక్కువ. జపానుదేశమునందును, జపానువారి స్వాధీనరాష్ట్రములందును గల జనభా 1930-వ సంవత్సరపు లెక్కల ప్రకారము 90,395,041; ఒక్క జపాను ముఖ్యద్వీపములందు మాత్రము 64,447,000.

### స్త్రీ ప్రేమించినచో:—

స్త్రీ ప్రేమించుచో మగవానిచే ఎట్టిపనియైనను చేయించుకొనుననుట అమెరికాయందలి పిట్సుబర్గు నుండి వినవచ్చుచున్నది. మ్యోనార్కు మిల్లరు సతి తనమగనిని గాఢముగ ప్రేమించి అతనినామము (ఎడ్వర్డు మిల్లరు) ను తనచేతిమీద కత్తితో చెక్కించుకొనెను. పడిన గాయముల నివారణార్థము అస్పత్రికితీసుకొని పోవు సమయము నందలి పోలీసువారి ప్రశ్నలకు ఆమె 'నేను అతనిని గాఢముగ ప్రేమించితిని' అనుజవాబు తప్ప అన్యములేదు.

### పుట్టినతోడనే నడచిన పిల్ల:—

మెస్సినాలో ఆశ్చర్యమునుపుట్టించిన శిశువు పుట్టువునొందినది. శిశువు ఆడది. పుట్టుసరికే ఆమెకు దంతములు చక్కగవచ్చియున్నవి. పుట్టినతోడనే ఆమెనడవప్రారంభించినది. ఆమెచేతులు, కాళ్లు పెద్దవారిచేతులు కాళ్లవలెనుండెను. తల్లి బాగున్నది. ఇది ఆమెకు మూడవకాన్పు. మొదటి ఇద్దరు బిడ్డలును పుట్టినతోడనే చనిపోయిరి.

### నయగరాజలపాతమున బడియు బ్రతికినకుక్క:—

ప్రపంచమునందలి జలపాతములలో ప్రసిద్ధమైన నయగరాజలపాతమున బడియు ఎట్టి అపాయమును నొందక కుక్కయొకటి బయటకువచ్చినది. పెక్కురు చూచుచుండిరి. కుక్క విలాసార్థముగ నీటిలోదుమికెను. నడిలోపడిపోయెను. జలపాతవేగమునకు తాళజాలక అది రూపులేకుండ పోవునని అందరును తలచిరి. కాని ఇంతలో అది అల్లంతదూరమున నీటిపైతేలుచు గట్టుపైపునకు ఈదుకొని వచ్చుచుండుట చూడనయ్యెను. అప్పుడు ఆప్రజాసమూహమునందలి కొందరు దానికి అవలంబనమిచ్చి వెలికిదీసిరి.

### నీటిబిందువులు:—

భూమి ఏడింట అయిదుభాగములు జలమయము. ఈజలభాగముయొక్క సగటులోతు రెండున్నర మైళ్లు. ఈజలముయొక్క ఘనపరిమాణము 324 మిలియనుల మైళ్లు.

### మంచుగడ్డను మించుగడ్డ:—

కొన్ని సెకండులలో ద్రాక్షపండు, సీమవంకాయ మొదలగు వానిని గ్రుడ్డుచిప్పకంటె పెళుసుఅగునట్లుగా ఘనీభవింపజేయగలుగు మంచుగడ్డ కనుగొనబడినది. ఈమంచుగడ్డ ముక్కను చేతితో పట్టలేము. పట్టుటకు ప్రయత్నించితిమేని మనవ్రేళ్లు కాలిపోగలవు. ఎక్కువవేడియు ఎక్కువచలనమును ఒకటేపనిచేయును గదా? ఓడలయందును, ఫలములు కాయగూరలు మొదలగునవి విశేషదూరములకు ఎగుమతిచేయుట యందును ఇది పదార్థములుచెడకుండ నుంచుటకు ఎక్కువ ఉపయోగకారిగనుండగలదు. రేగుపండంత ఈమంచుగడ్డను గదిలో నుంచినచో అగది సిమ్లావలె ఇవతాళించును. ద్రాక్షపండంత ఈమంచుగడ్డ అన్నము, కూర, పప్పు, పచ్చడి మొదలగు పచనపదార్థముల సమీపమునసుంచుచో అవి వారమురోజులవఱకును చెడక భుజింప దగియుండును. ఈమంచుగడ్డ మామూలుమంచుగడ్డవలె తడిగానుండదు; నీళ్లుకారదు. పొడిగానుండునుగాని ఇగిరిపోవును.




సతీ తేజశ్చమత్కారము : పాతివ్రత్య మహిమ:—

**1931**-వ సం॥ మే **20**-వ తేదీని ఉత్తరఇండియా సీతాపురముజిల్లా వోహటవీరగ్రామమందు లల్లా సింహుడను క్షత్రియుడొకడు చనిపోయినాడు. అతనిభార్య భర్తతో సహగమనము చేసెదనని తనకోరికను ప్రకటించి స్నానముచేసి భర్తశవమును ఒడియందుంచుకొని కూర్చునెను. దగ్గఱ గీతాపుస్తక ముంచుకొని పారాయణ చేయుచుండెను. గ్రామస్థులు ప్రోగయిరి. వెంటనే పోలీసులకు ఈకబురు తెలియచేసిరి. పోలీసు సబిన్స్పెక్టర్ పోలీసులతో అస్థలమునకు వచ్చెను. అప్పటికే వేలకొలది జనము చేరిరి. ఆసబిన్స్పెక్టరు బ్రాహ్మణుడు. అతడాసతిని గీతనుగూర్చి కొన్నిప్రశ్నలడిగినాడు. సతి తనసత్త్వబలమువలన బదులుచెప్పి "అయ్యా! స్త్రీకి తనభర్తవిషయమున కర్తవ్యమేమి?" అని అతనినడిగినది. ఆమెప్రశ్నకు సమాధానముచెప్పక అతడు సహగమనము చేయరాదని ఆమెకుచాలావఱకు బోధించినాడు. ఒకవేళ "మీరు సహగమనముచేయదలచినపక్షమున మీహృదయమునుండి అగ్నిని పుట్టించవలసినది" అని అన్నాడు కూడాను. "అమె ధర్మశాస్త్రమునందు కట్టెలులేకుండ సహగమనము చేయరాదని నిషేధమున్నది. కావున మీరు రెండుకట్టెలు తెచ్చి నాకిచ్చినపక్షమున నేను నాహృదయమునుండి అగ్నిని ప్రకటించగలుగుదును. అట్లుచేయజాలనైతే నేని నాపట్టుదల విడచిపైచెదను" అని యున్నది. "శాసనమునను సరించి నేను కట్టెలీయజాల" నని అతడనెను. "నేనును ధర్మశాస్త్రమునుల్లంఘింపజాలను. కట్టెలులేకుండ అగ్నినిపుట్టింపజాల" నని యామెయన్నది. కొంతసేపటి వఱకు వాదప్రతివాదములు జరిగినవి. తరువాత ఇన్స్పెక్టరు అచట ఉన్నవారినిచూచి శవమువద్దనుండి ఆమెను వేఱుచేయవలసినదని చెప్పినాడు. కాని ఆమెను ముట్టుటకెవ్వరును సాహసింపజాలక పోయిరి. అంతట అతడే ఆమెను బెదరించి యామెచేయిపట్టుకొని శవమునుండి వేరుచేసెను. అప్పుడామె ఏడ్చుచు "నీవు నన్ను ముట్టుకొనుట మంచిపని కాదు. చాలతప్పుపని చేసితివి" యని అన్నది. అందఱు ఆదృశ్యము చూచుచూవుండిపోయిరి. సతి పతి శవమును విడిచి వేఱుచోట వుండిపోయినది. అపుడు శవమును శ్మశానమునకు తీసుకొనిపోయి అచట దానిని దహించివైచిరి. తరువాత సెట్లో ఆమెకు కొన్నికట్టెలు దొరికినవి. అవి తూనికకు అర్ధసేరుకంటె కొంచెమధికముగ నుండును. తనపతిశవము ఉంచినచోటున ఆకట్టెలనుఉంచి కూర్చుండి తనలోపలినుండి అగ్నిని పుట్టించి కాలిపోయినది. శరీరముతాలూకు లోపలిభాగమంతయు కాలి భస్మమయిపోయినది. శిరస్సునందలివెండ్రుకలు కాలిపోయినవి. కానిసబిన్స్పెక్టరుతాకినచేతియందలిభాగము, అచటివెండ్రుకలు, అక్కడివస్త్రములుమాత్రము అగ్నిస్పర్శకుచెడలేదు. మరల జనులుప్రోగయిరి. ఒకయిన్స్పెక్టరుకూడవచ్చినాడు. సగముకాలిన ఆసతిదేహమును శ్మశానమునకుగొనిపోయి ఆమెపతితాలూకుశవముయొక్క చితిపైనఉంచి కాల్చినారు. అన్నిఅవయవములును వేగముగానే కాలిపోయినవి. కాని చేతియందు అభాగము

మాత్రము కాలనే లేదు. ఎంతయో ప్రయత్నించిరట. కాని లాభములేక పోయెను. ఆ మెతంత్రీ వచ్చి గ్రామమునందలి సజ్జనులతో శ్మశానమునద్దకు పోయి మృతాత్మలకు శాంతి కలిగింపుమని ఈశ్వరుని ప్రార్థించినాడు. తన పుత్రిక పేరు చెప్పి యామిగిలిన చేతిభాగమును కూడ శరీరముతో పాటు కాలునట్లు చేయుమని కూడ ప్రార్థించెను. చితి పయిని మఱికొన్ని కట్టెలు వేయించినాడు. ఏమి చేసినను అది మాత్రము కాలలేదు. అప్పుడు కొందఱు సజ్జనులు చెప్పగా కాలని యాభాగమున కొక చితి పేర్చి కాల్చుటవలన మరికొంత కాలినది గాని పూర్తిగా కాలలేదు. తుదకు దానిని వారిబుగ్గిలో ఉంచినారు. ఇపుడు ప్రతిగురువారమునాడును అచ్చట గొప్పజాతర యగుచున్నది. శ్రద్ధగల స్త్రీపురుషులు ఆసతి తనశరీరమును భస్మము చేసినచోటను పండ్లు, పాలు, దక్షిణ సమర్పించుచున్నారు. ఆహా! సతీప్రభావము! వంగవాసి, పద్మశీల, సర్వస్వ, వేంకటేశ్వరసమాచార్, ఆచార్య మున్నగు హిందీమహారాష్ట్రభాషాపత్రికలందీ వార్త ప్రకటింపబడినది.

—కనుపర్తి మార్కండేయ శర్మ.

## దయ్యములు చేసిన దౌష్ట్యము:—

విశ్రాంతివేతనముగొని తెలిచేరియందు డిప్యూటీకలెక్టరు ఒకడు క్రొత్తగ ఇల్లు కట్టుకొని అందు ప్రవేశించెను. ఆయింటియందు దయ్యములు ప్రవేశించి నానారభసము చేయదొడగెను. ఒకనాడు డిప్యూటీకలెక్టరుగారు పడుకుని ఉండగా తలక్రింది తలగడ కాలిపోయెను. అట్లు కాలిపోవుటకు ఏకారణమును లేకుండెను. విచిత్రమేమన కాలిపోయిన తలగడను మోయుచున్న చాపను నిప్పు నెరసైన తాకలేదు; వేడికి చాప నల్లగనైన కాలేదు. దీనికి ఆశ్చర్యము నొందుచు కలెక్టరుగారు మఱియొక తలగడ తెచ్చుకొని పెట్టుకొనిరి. మఱునిమిషమున ఆతలగడ నూతిలో పడియుండెను. ఇంటియందు పింగాణిసరుకు ఎక్కడనున్నను క్రిందపడి ముక్కముక్కలగుచుండెను. పెద్దపెద్ద రాళ్లు ధ్వనిచేయుచు ఇంటియందు ఎగురుచుండెను. ఖజానాపెట్టి తాళముచెవి చూచుచుండగనే మాయమయ్యెను. అందుమీద ఒక క్రొత్తతాళముచెవి చేయించి ఇంటికి కొనిరాగా అది చేతులోది చేతులోనే మాయమయ్యెను. కాని దానిస్థానమున పాతతాళముచెవి ఉండెను. దానితో పెట్టి తీసిచూడగ అందు క్రొత్తతాళముచెవి భద్రముగనుండెను. ఇంతకు కొద్దికాలమునకు క్రితము తెల్లిచేరి యందలి ఒకానొక గొప్ప మోప్లాభూస్వామి దయ్యములవలని ఇట్టి దౌష్ట్యమునకు గురియై తన ఇల్లు వదలి పోయెను. కంటియెదుటనే వంటసామగ్రి మాయమగుట, డబ్బు కనబడకపోవుట, ధరించియుండగనే ముక్కద్దములు ఆవిరియై పోవుట, సిద్ధాన్నకబళములో దుమ్ముదూమారము పడజల్లబడుట చూచి అతడు తన విశాలరమ్యమందిరమును దయ్యములు దొమ్మలాడుటకు వదలివైచి లేచిపోయెను.

# పత్రికాపరిచయము

## స్వదేశీ:—

ప్రతినెల 20-వ తేదీని వెలువడు నూతనమాసపత్రిక. సంపాదకుడు మద్దూరి శ్రీరామశాస్త్రిగారు. మొదటి సంపుటము తొలిసంచిక మాకార్యాలయమలంకరించినది. ఇందు సుప్రసిద్ధులగు బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారు 'దేశాభిమానము'ను గూర్చియు; శ్రీమతి మ. శాంతాబాయిగారు 'రాష్ట్రభాష'ను గూర్చియు; శ్రీయుత బొల్లాప్రగడ సుందరగోపాలరావుగారు ఆరోగ్యమునుగూర్చియు వ్రాసియున్నారు. ఇతరములగు వార్తలు విశేషములుగలవు. ఈమాతోడి మాసపత్రిక చిరంజీవియగు గాక యని

కోరెదము. ¼ డెమ్మిసైజున 14 పుటలు. గ్లేజుకాగితములు. సాలుచందా ఇండియా, బర్మా, సిలోనులందు రు 1—8—0; దక్షిణాఫ్రికా, బ్రహ్మ మొదలగు స్థలములకు రు 2—0—0; విడిపత్రిక రెండు అణాలు. వలయువారు మేనేజరు 'స్వదేశి', రాజమండ్రి అని వ్రాయునది.

సుబోధిని:—

ప్రతినెల 5, 20 తేదులలో నెల్లూరున ప్రకటితమగు పక్షపత్రిక. సంపాదకుడు మన్నేపల్లి రామకృష్ణ రావుగారు. ఆగష్టు 5, 20 తేదీలయందు వెలువడిన మొదటి సంపుటపు ఒకటి రెండు సంచికలు మాపత్రికా పీఠమునలంకరించినవి. శ్రీయుత వెన్నెలకంటి రాఘవయ్యగారి బి. ఏ; బి. యల్. మొదటిసంచికలో 'సమ రమా, సంధియా' అను వ్యాసమును; రెండవ సంచికలోని 'రష్యయాత్రలు' అను వ్యాసమును ప్రత్యేకము ప్రశంసింపదగియున్నవి. రెండవసంచికలోని గుఱ్ఱం వేంకటసుబ్బరామయ్యగారి యం. ఏ 'ఉత్తమకవితాలక్ష ణములు' అను వ్యాసము విలువగలది. పి. వేంకటరెడ్డిగారి బి. యె; బి. యల్ 'పూలపూజ', చుండి విశ్వనాథం గారి బి. యె; బి. యల్ 'నానాదేశసమితి: శాంతిస్థాపన', యం. యస్. నరసింహారావుగారి బి. యె; బి. యల్ 'లాపాయింట్లు' రెండవసంచికయందలి ఈవ్యాసములు విజ్ఞానదాయకములు. దేశహితమునుపలక్షించి కాంగ్రెసుపద్ధతులమీద ప్రజాప్రబోధముపుట్టించు ఇట్టిపత్రికల యవసరము నేడెంతేనిగలదు. ఈపత్రికాపుత్రిక చిరముకర్షిల్లి తెలుగుసీమను సేవించుగాక! సంవత్సరచందా రు 2—0—0. చిరునామా: మన్నేపల్లి రామ కృష్ణరావుగారు, రామకృష్ణ ప్రెస్సు; నెల్లూరు.

సంజీవి:—

ప్రతిమాసమున వెలువడు ఆరోగ్యపత్రిక. సంపాదకుడు గాడేపల్లి సుబ్బారావుగారు. ఆగష్టు 15.వ తేదీని వెలువడిన రెండవసంపుటము రెండవసంచిక మాకార్యస్థానమునకు బంపబడినది. ఇందు పొగాకు వలని నష్టములు, మలేరియా చలిజ్వరము అను వ్యాసములు గలవు. 'మూత్రపరీక్ష: రోగనిరూపణము' అను విషయ మునుగూర్చి సంపాదకీయము వ్రాయబడినది. సంవత్సరచందా రు 1—0—0. విడిపత్రిక ఒక అణా. మచిలీ పట్టణమునుండి ప్రచురింపబడుచున్నది.

యాత్రామార్గపత్రిక:—

తిరుమలనుండి ప్రతిశనివారము ప్రచురింపబడునది. సంపాదకుడు కె. నరసయ్య. మాపత్రికాపీఠమలంక రించుచున్న మొదటిసంపుటపు 7-వసంచికలో అనిమరాస్థానము, తిరుపతి, బ్రాహ్మణమేధస్సు, కాంచియాత్ర మొదలగువ్యాసములుగలవు. సాలుచందా రు 3—0—0. విడిపత్రిక 0—1—0 అణా. వలయువారు సంపా దకుని పేర తిరుపతికి వ్రాయునది.

పిక్చర్:—

సినిమావిషయికమగు ఆంగ్లమాసపత్రిక. సంపాదకుడు పి. రాజగోపాలనుగారు బి. యె. ఆగష్టు 15-వ తేదీని వెలువడిన మొదటి సంపుటము మూడవ సంచిక మాకార్యాలయమునలంకరించినది. సినిమానటి సులోచన కన్య యొక్క పూర్తిపుటపటముగలదు. ఇతర పటములు పెక్కు. హావభావములనుగూర్చి సంపాదకీయము వ్రాయబడినది. సీతాదేవి పాత్రధారణాప్రాశస్త్యమును గూర్చియు; ఇండియను మూవీని గూర్చియు, యుక్తో చితములగు ఇతర విషయములను గూర్చియు చక్కని వ్యాసములు గలవు. సినిమా విషయములందు అభిరుచిగల వారికీపత్రిక మిక్కిలిఉపయోగకరముగ నుండగలదు. సాలుచందా రు 1—8—0. విడిపత్రిక రెండుఅణాలు. విలాసము: దిపిక్చర్ మన్‌త్లీ, 316, మింట్ స్ట్రీటు, మదరాసు.



వివాహవిషయమున పురుషుల దౌర్జన్యము:—

"పురుషుడు తన చిత్తానుసారము కావలసినందరు భార్యలను స్వీకరించవచ్చును. తనచర్యను సమర్థించుట కారణ మనేక కారణాంతరములను చూపుచుండును. భార్య రోగియని కొందరు, బిడ్డలు లేరని కొందరు, మాతలిదండ్రుల కిష్టములేనిపిల్లయని మరికొందరు; కట్నమివ్వలేదని కొందరు. అట్టిదియుండుటేమి చస్తేనేమను వారు వారివిషయమున స్త్రీలట్లన్న నెట్లుండునో గమనించదగును. వారిచర్యలకు తగినట్లుపురాణేతిహాసాదులు సైతము కథలనుకట్టి ఘోషించుచున్నవి. వారాయాధారముల నందుకొని కృష్ణునకు 8 గురు భార్యలులేరా, సుబ్రహ్మణ్యున కిరువురులేరా, శివునకిరువురులేరా, దశరథునకు 60 వేలమంది యుండిరికారా అని చండాల పురాణములనుండి కథలను సూచింతురుకాని అట్టినీతినియమము భార్యకేగాని పురుషునకులేదా? భార్యగతించిన రెండల పురుషుడొంటరిగనుండజాలనప్పుడు పురుషుడుగతించిన వానిభార్యమాత్ర మెట్లుండగలదు? పురుషునకు ద్వితీయవివాహము కాస్త్రీయమగునేని స్త్రీలకు సైతమట్టి యవకాశముండవలయును. బిడ్డలులేదని పురుషులు వేరుపెండ్లి చేసికొందురుకాని, బిడ్డలయాశ పురుషులకన్న స్త్రీలకే మెండు. కావున ఆపురుషునివలన బిడ్డలు కలుగలేదని భార్య మరొకపురుషుని చూచుకొనవలసినదేనా? కావున స్త్రీ పురుషులందు ఇట్టి యక్రమ నియమములకుగురిగాక నైతికజీవన మొనరించునప్పుడే సంఘమును దేశమును చక్కబడును. కాని పురుషులయందిట్టి యక్రమాధిక్యాభిమానముండుట వలననే స్త్రీలు తమకును విడాకులస్వాతంత్ర్యముండవలె ననుచున్నారు. ఇందువలన హిందూసంఘమే నాశనమగునని కొందరనుకొందురు. కాబట్టి వారి యక్రమభావమే వారి కీ సందేహమునకు కారణమగుచున్నది. చెడుదారి పోయిన స్త్రీని తొలగించుటకు పురుషునకు చట్టమవసరమైనపుడు అట్టిచర్యగల పురుషుని సంబంధమునుత్యజించుకొనుటకు స్త్రీకి సైత మట్టిచట్ట మవసరముకాదా?"

—ఇంద్రాణీ బాలసుబ్రహ్మణ్యము సతి.

డైవోర్సు:—

"డైవోర్స్ మనదేశములోగూడ నాచరణలో నుంచబడిన మనదేశముగూడ ఇతరదేశములవలెనే భ్రష్టము చెందునవియు కావున దేశమట్టి భ్రష్టత్వమొందకుండుటకై అనేకులు పురుషులు డైవోర్స్ మాకక్కరలేదనుచున్నారు. చంచలస్వభావురాలగు స్త్రీ తనూపాకోఅకు పతియెంత సద్వర్తనగలవాడైనను డైవోర్సుచేసి చిక్కులపాలగును అని కొందరు బుద్ధిమంతులు తలచుచున్నారు. డైవోర్సునకు అనుమతి నొసంగువారు కోర్టువారు తగినంతనిర్ధారణ చూసినగాని డైవోర్స్‌నకు కోర్టువారంగీకరింపరు. అదియుగాక తరమభర్తలను మార్చుకొన్నచో స్త్రీకి సౌఖ్యమా? అందుచే నేమాత్రపు తెల్విగల యిల్లాలయినను తీరనిసరి వచ్చినప్పుడుగాని

డైవోర్సుకోరునా? కోరినను కోర్టువారంగీకరింతురా? అదియుగాక మనము ఒక అద్దెయింటిలో ప్రవేశించి వార మనుకొందము. ఆయింటియందు చిక్కులున్నను ఎట్లోగడపుకొని అక్కడనే కాలముపుచ్చుదుము గాని యీయిల్లుగాదని ఆయిల్లు-ఆయిల్లుగాదని యీయిల్లు తిరుగ మార్చుచుందుమా? తీరావచ్చితిమిగదా కష్టమో, సుఖమో, యిక్కడనే గడుపుకొందము అను నుద్దేశ్యముతో నుందుము. అట్టిచో, భర్తను మార్చు విషయములో నేమియు నాలోచింపక యిచ్చవచ్చినట్లు రోజునకొకతూరి భర్తలనుభార్య మార్చుననుటయు తత్కారణమున డైవోర్సుగూడ దనువాదనలు కారణవిహీనమైనవి. పిడుగులెపుడో యొక్కటిరెండుబడునని వానపలదంచుకోరువారుందురా? డైవోర్సుమూలమున ఏఒకరిద్దరో తుంటరితనముగా వర్తించిరనియు వర్తింతురేమోయనియు డైవోర్సు మాకు వద్దనుటలో నేమిఅర్థమున్నది? హిందూసంఘములో ఒకరిద్దరు నాస్తికులున్న హిందూసంఘమే చెడ్డదా? అట్లూహించుట చిన్నతనపు టాలోచనలుగావా? ఉదారబుద్ధితో నాలోచించిన డైవోర్సుయొక్క యావశ్యకత గాన్పించుచుండుటలేదా?-కాని డైవోర్సు నొసగుటయందు మాత్రము జాగరూకతో నొసంగవలెను. డైవోర్సు కోరువారిలో 2/3 భాగము స్త్రీలు. అనిన స్త్రీలు డైవోర్సుకోరుటకు పురుషులు తావొసగుచున్నా రన్నమాట. అతికష్టములపాలగు స్త్రీపురుషులకు సహాయము చేయుకొఱకే, డైవోర్సుఅనిన చిక్కేమి? స్త్రీ, పురుషునివశమునుండి యింకొకనివద్దకు బక్షివలె నెగిరిపోవునేమో యను జంకేల? పురుషుడు స్త్రీకితాననిన అతిప్రేమ కల్గునట్లు తానుప్రవర్తించి డైవోర్సు న్యాయశాస్త్రములో నున్నను ఆచరణలోనికి రాకుండునట్లేల చేయరాదు? అట్టిదంపతు లెంతటి ధన్యులో కదా!"

—మద్దూరి హనుమంతరావు.

విజ్ఞప్తి:—

"స్త్రీకి బట్టలకు మితిమీరినధనము వ్యయమగుచున్నది. పీరిమూలమున కన్నతల్లిదండ్రులు వైవాహిక ఖర్చులకన్న పీరిదుస్తులకై అపారమైనధనము వ్యయపరచి అనేకమగుఇడుమలపాలగుచున్నారు. ఇదియంతయు మీరు చూచుచున్న విషయమే. మగవాడు ఎట్లుండినమండగలడు గాని స్త్రీ అట్లుండనొల్లదు. వస్త్రాలంకారములో స్త్రీ ముందంజవేయుచున్నది. కోట్లకొలంది పైకము ఇతర దేశములకు పోవుచున్నది. యువతీమణులారా! ఇట్టి అభాగ్యదేవతను వెంటనే విడనాడుడు. కడుపారభుజించి చల్లనితావున కేగి నిర్మలమనస్సుతో ఈయంశములు జ్ఞప్తికితెచ్చుకొన్నచో అందులోనిమిడియున్న రహస్యమార్గము మీకే బోధపడగలదు. ఇందుకై పరుల సహాయమక్కరలేదు. ఎవరియంతట వారే యోచించవలసిన అంశము. ఈరహస్యమార్గమువెంబడి మనము నడచినయెడల క్రమక్రమముగ మనము దానిని రాజబాటగ నొనరించి మనమందరము దీనిఫలితమును గ్రహించి సుఖించుటయేగాక ముందురాబోవు వారలకుకూడ మార్గదర్శకులమై వారినిగూడ దీనిఫలితముల నొందజేసి సుఖపెట్టినవారమగుదుము. ఇది కేవలము మనలాభముకొరకై కాన్పించినను అపారమైనదేశసేవయును జేయుచున్నవారమును అగుదుము. ఇట్టి శుభకార్యమువలన మనకు ఇహమందును, పరమందునుకూడ ముక్తి లభించును. మనముసుఖపడి మనతండ్రులను ఇరుగుపొరుగువారలనుగూడ సుఖపెట్టినవారమగుదుము. భారతమాత మనకు సమస్తమునొసగుచున్నది. అవి మనము ఉపయోగములోనికి తెచ్చుకొనవలెను. ఇది మనకార్యము. మనము అనుదినము చాలకాలము వృథాగా గడుపుచున్నారము. మనము కండ్లుతెరచి ఒళ్లువంచి దినమునకు ఒకగంట చొప్పున రాట్నము చేబూనినయెడల ప్రతియువతియును తనకు సంవత్సరమునకు కావలసినదుస్తులను తయారు చేసుకొనవచ్చును. చేయుదురా?"

—విజయలక్ష్మి.

# గ్రంథపరిచయము

**మదవతి:—**

కలాకల్పవల్లీగ్రంథమాలలో ఆరవకుసుమము. వ్రాసినది శ్రీమతి ప. రాజ్యలక్ష్మమ్మగారు. 1926-వ సంవత్సరమున శ్రీవైఖానసముద్రాక్షరశాలయందు ముద్రితము. దొరకుచోటు: శ్రీమాన్ భీమగ్వర డి. రంగాచార్యులువారు, ఈగావారిపాలెము. గ్రంథము డెమ్మీసైజున 180 పుటలు. ఇయ్యది వైయాకరణపంచాననుని గీర్వాణగ్రంథమున కనువాదము. ప్రేమశృంగారములను మేళవింపజేసి తుదకు పతివ్రతామాహాత్మ్యమునుజాటుటయే యీగ్రంథోద్దేశము. కంచుకోత్సవము, అననుకూలదాంపత్యమాదిగాగల సాంఘికదురాచారములను ఖండించును. స్త్రీపునర్వివాహము, రజస్వలానంతరవివాహములను సిద్ధాంతీకరించుటచే నియ్యది స్త్రీలకుపయుక్తమగు గ్రంథమేయగును. దీనినాంధ్రీకరించుటలో రచయిత్రిజూపిన స్వాతంత్ర్యము సాహసమనకతప్పదు. స్వాతంత్ర్యాభిలాషయే ముఖ్యోద్దేశముగా ఈయుద్గ్రంథమును నాంధ్రీకరించి ఆంధ్రలోకమున కర్పించిన శ్రీరాజ్యలక్ష్మమ్మగారెంతయు ప్రశంసార్హులు.

—తుర్రా వేంకటసుబ్బారావు చౌదరి.

**శారదావ్యాకరణము:—**

మొదటిభాగము. రెండు మూడు తరగతులకు ఉపయోగించునట్లు పెక్కు ఉదాహరణములతోను, అభ్యాసములతోడను వ్రాయబడినది. ప్రాథమికపాఠశాలలయందు వాడదగినది. క్రౌనుసైజున 36 పుటలు. వెల అ 0—3—0. గ్రంథకర్త ఏకుమళ్ల రాజగోపాలరావుగారు బి. యె; యెల్. టి. చిరునామా: 124. వెల్లాళవీథి, పరశువాకము, వేపేరిపోస్టు, చెన్నపురి.

**సర్వోదయము:—**

మానవాదర్శగ్రంథమండలి ౧-వ పుష్పము. **John Ruskin's "Unto the last"** అను గ్రంథము మీద గాంధిమహాత్ముడు వ్రాసినగుజరాతీగ్రంథమునకు ఆంధ్రానువాదమీగ్రంథము. అనువాదకుడు:బుద్ధపురాణ, మానవజీవితాది గ్రంథకర్త; బౌద్ధవాఙ్మయబ్రహ్మ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు.సత్యాన్వేషణపరులు చదువదగినగ్రంథము. చిన్నసైజున సుందరముగముద్రింపబడినది. గ్లేజుకాగితము. 76 పుటలు. వెల అ. 0—2—0. దొరకుచోటు: తిపిర్నేని లక్ష్మీనారాయణగారు, మానవాదర్శగ్రంథమండలి, అంగలూరు, కృష్ణాజిల్లా.

**శ్రీ సరస్వతీశతకము:—**

మీర్జాపురము ఎస్టేటు రాజభవనము గవర్నెస్ అగు శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు రచియించినది. భక్తిప్రధానమయిన శతకము. శ్రీడి. రాజశేఖరంగారు ఈగ్రంథమునకు పీఠిక వ్రాసినారు. శైలిధారాళము. చిన్నసైజున 64 పుటలు. వెల అ. 0—2—0. లభించుతావు: శ్రీ సరస్వతీభవనము, క్రొత్తపేట, నూజవీడు, కృష్ణాజిల్లా.

**భారతేతిహాసములు:—**

ప్రథమభాగము. శ్రీపిఠాపురము మహారాణీవారి గోషాస్కూలులో ఉపాధ్యాయినియగు జాలూరి తులశమ్మగారిచే రచియింపబడినది. ఇందు అపక్రీతుడు, ఉదంకుడు, గరుత్మంతుడు, జరత్కారుడు, కపోతము, నాడీజంఘుడుఅను ఆరుకథలు భారతమునుండి గ్రహింపబడి బాలబాలికల కుపయుక్తముగనుండునట్లు వ్రాయబడియున్నవి. ఈగ్రంథపీఠికలో శ్రీమతి టి. వి. రంగనాయకమ్మగారు బి. యె; యెల్. టి ఇట్లు

వ్రాయుచున్నారు: "ఇవి నీతిదాయకములగుటయేగాక చదువుటకు మిక్కిలి రమ్యముగను, మనోహరముగను ఉన్నవి. ఉన్నతాశయములు, ఉత్కృష్టభావములు, విచిత్రకథాసంవిధానములు వీనియందలి విశేషములు." కావున విద్యాశాఖాధికారు లీగ్రంథమును పోషింతురుగాక! క్రౌనుసైజు: గ్లేజుకాగితములు: 84 పుటలు. వెల రు 0—8—0. గ్రంథప్రతులు దొరకు విలాసము: జాలారి తులశమ్మగారు, టీచరు, ఘోషాస్కూలు, పిఠాపురము, తూర్పుగోదావరిజిల్లా.

ఉన్మత్తరాఘవము:—

ఏకాంకము. ప్రేక్షణకము. భాస్కరుని సంస్కృతకృతికిఁ దెనుఁగుసేత. అనువక్త ఆకిరి శ్రీరామశర్మగారు. కళానిధిగ్రంథమాలలో మూడవగ్రంథము. ఒకానొకవనము. దూర్వాసుడు తపస్సు చేసికొనుచుండెను. తీవ్రతపశ్శంకియగు ఇంద్రుడు అచ్చరను బంపెను. నలభకోపుడగు దుర్వాసుడు ఈవనమునకువచ్చు స్త్రీలెల్లరు లేళ్లు అగుదురని శపించెను. ఇది జరిగి ఎన్నోవత్సరములైనను త్రేతాయుగమునకూడ ఆశాప మావనమున అనువర్తమానమగు చుండెను. జానకి ఆవనమునకు విహరింపరాగా హరిణియయ్యెను. జానకినిగానక రాముడున్మత్తుడయ్యెను. అప్పటిరాముని ప్రదర్శించు నాటకముగావున దీని కున్మత్తరాఘవమని పేరువచ్చెను. అగస్త్యుని దయవలన సీత యథారూపముబొందెను. చదువదగియున్నది. క్రౌనుసైజు: గ్లేజుకాగితములు: 32 పుటలు: వెల తెలియదు.

కడగండ్లు:—

గ్రంథకర్త కొసరాజు రాఘవయ్యచౌదరిగారు. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారీగ్రంథమునకు తొలిపలుకులు వ్రాసియున్నారు. అందు శ్రీవారిట్లు వ్రాసిరి: 'కడగండ్లు గీతములు జమీందారిరయితులను వారి నిద్రావస్థనుండి మేలుకొలుపుటకు దగియున్నవి. సరళభాష, మృదుశైలి, గంభీరభావములు గేయములను హృదయరంజకము చేయుచున్నవి.' ఈవాక్యములతో మేము పూర్తిగ నేకీభవించుచున్నాము. గ్రంథకర్తగారు పాడగా ఈపాటలు కొన్ని వింటిమి. మిక్కిలి హృద్యముగనున్నవి. నిరక్షరాస్యులగు రైతులలో ప్రబోధము కలిగించుట కీగ్రంథమునందలి పాటలు పరమప్రయోజనకారులుగనుండును. క్రౌనుసైజున 20 పుటలు. గ్లేజుకాగితములు. సుందరమగు అచ్చు. తిరుతని యందలి జమీన్‌రైతుమహాజనసంఘపక్షమున శ్రీయుత బి. కె. పార్థసారథినాయుడు బి. ఏ; బి. ఎల్ గారి ద్రవ్యసహాయమున ప్రకటింపబడినది.

యోగచికిత్స:—

ఇది శ్రీయుత చల్లా లక్ష్మీనారాయణశాస్త్రిగారిచే హిందీనుండి తెనిగింపబడినది. శక్తి యెటువంటిది, ప్రకృతికారుణ్యము, శక్త్యాకర్షణ, మనోబలమహిమ, మనోక్రియలు, వ్యాయామము మొదలగువిషయములను గూర్చి తేటతెనుగున నెల్లరకు సుగమమగునట్లు వ్రాయబడినది. క్రౌనుసైజు: గ్లేజుకాగితములు: 28 పుటలు. వెల రు 0—6—0 అణాలు. ప్రకృతిచందాదారులకు రు 0—5—0 అణాలు. గ్రంథప్రకాశకులు: మేనేజరు, ప్రకృతికార్యాలయము. బెజవాడ.

రసమంజరి:—

అలంకారశాస్త్రము. కవి తాడూరి లక్ష్మీనరసింహారావుపంతులుగారు. సంస్కృతమున భానుమిశ్రకవి రచియించిన రసమంజరికిది తెనుఁగుసేత. యథోచితములగు ఒకటి రెండు మార్పులు మాత్రము చేయబడినవి. శాస్త్రనిర్వచనము వచనమునను, ఉదాహరణము పద్యమునందును ఈయబడినది. నాయికానాయక నిరూపణము విపులముగను చక్కగను ఉన్నది. డెమ్మిసైజున 56 పుటలు. గ్లేజుకాగితములు. వెల 0—6—0 అణాలు. గ్రంథకర్తపేర రాజమహేంద్రవరము వ్రాసిన బడయగలరు.

# డైరి

## జూలై

20:—మద్రాసు స్త్రీలస్వదేశిసంఘసహాయార్థము శ్రీవల్లినాటకము వాల్‌టాక్సుథియేటరునందు ప్రదర్శించిరి.

:—అనంతగిరి పేరనార్యకవిగారి భార్య శ్రీమతి సీతాలక్ష్మాంబగారు అనంతపురముతాలూకా సనప గ్రామమున మరణించిరి.

21:—మైలాపూరు కాంగ్రెసుసంఘపు యాజమాన్యమున శ్రీమాధవపెరుమాళ్ ఆలయమువద్దజరిగిన బహిరంగ సభకు శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారధ్యక్షతవహించిరి.

22:—ఇంగ్లండుచుట్టును వేయిమైళ్లు విమానములో చుట్టివచ్చుటకు జరుగుచున్న పోటీలో తండ్రియు, కూతురును పాల్గొనిరి.

23:—శ్రీమతి రుక్మిణి లక్ష్మీపతిఅమ్మగారు ఆర్కోణమునందు కాంగ్రెసుసభలో ఉపన్యసించిరి.

24:—భారతజాతీయ వాలంటీరుదళస్థాపకురాలు శ్రీమతి కా. కామాక్షీఅమ్మాళ్ గారు కాంగ్రెసుప్రచారము నిమిత్తము వేలూరువెళ్లిరి.

—కోటకులో జిల్లాకాంగ్రెసుసంఘకార్యదర్శినియగు శ్రీమతి చిత్రాదేవిగారిని 108-వ సెక్షనుక్రింద అరెస్టుచేసిరి. సంధియనంతరము ఆప్రాంతములందు అరెస్టుచేయబడిన స్త్రీప్రచారకురాలీమెయే.

25:—ఎగ్మూరు పాంథియను గార్డెన్సులో శ్రీమతి ఎస్. వి. రాఘవనుసతిగారి అధ్యక్షతను మద్రాసు స్త్రీలు బహిరంగసభజరిపి శారదాచట్టముయొక్క సవరణను నిరసించిరి.

26:—శ్రీమతి లీలాదేపిగారు (డాక్టరు జి.టి. రెడ్డిగారిభార్య) నర్సారావుపేటలో బెంచిమేజస్ట్రీటుగ నియమింపబడిరి.

27:—ఏలూరు పురపాలకసంఘమువారు సమావేశమై ఏలూరుస్త్రీలక్లబ్బునకు టి. యస్. నెంబరు **653, 660** నందు **2685** చతురపుగజముల స్థలములనొసగుచు తీర్మానించిరి.

28:—సింధుహైదరాబాదులో శారదాఆక్టు నుల్లంఘించినందులకు పెండ్లికుమారునికి, తండ్రికి 20 రూపాయలును, పురోహితునికి 10 రూపాయిలును జరిమానా విధింపబడెను.

29:—శ్రీమతి దిగుమర్తి జానకీబాయిగారికి విశాఖపట్టణపౌరులు ఆమెభర్త దిగుమర్తి వేంకటరామస్వామి గారు మచలీపట్టణము ఆంధ్రజాతీయకళాశాలకు ప్రిన్సిపాలుగా నియమింపబడి వెడలు సందర్భమున వీడ్కోలుపత్రమును సమర్పించిరి.

30:—మద్రాసునగరములో కల్లు వేలంపాటల పికెటింగుకు శ్రీమతి రుక్మిణిలక్ష్మీపతిగారు నాయకత్వము వహించిరి.

—రాజకోటనుండి సుల్తాను అను మహమ్మదీయ కన్యవచ్చి బొంబాయి ప్రధానరాజధాని మాజిస్ట్రేటు ఎదుట ఈక్రింది వాఙ్మూలము నొసగెను: "రాజకోట నానివాసస్థలము. నాతండ్రి మహమ్మదీయుడు. సుల్తాను అను పేరు నాకుండెను. నేనుతండ్రినివదలి బొంబాయికివచ్చినాను. రాజుఅను హిందూకంసలి వానిని ప్రేమించితిని. మహమ్మదీయమతమునువదలి హిందూమతము స్వీకరించి సావిత్రీబాయి అని పేరును మార్చుకొనినాను. రాజునువివాహమాడితిని." మాజిస్ట్రేటుగారు వాఙ్మూలమును తీసికొనెను. సావిత్రీబాయి తనభర్తతో కోర్టువదలిపోయెను.

31:—పశ్చిమగోదావరిజిల్లా తాడేపల్లిగూడెముతాలూకా కల్లువేలంపాటలప్పుడు శ్రీమతులు సత్తిరాజు శ్యామలాంబ, దామరాజు లక్ష్మమ్మ, శృంగారకవి లక్ష్మీనరసమ్మ, భోగరాజు వీరవెంకమ్మ, కొచ్చర్లకోట త్రిపురాంబ, పసల అంజలక్ష్మమ్మగార్లు పికెటింగుచేసిరి. గతవత్సరముకంటె నాటికి రు 83లు తగ్గిపోయెను.

## ఆగష్టు

1:—లవణసత్యాగ్రహము ప్రారంభించినప్పటినుండియు కాకినాడయందుండి దేశీయోద్యమమున పాల్గొనుచున్న మహారాష్ట్ర దేశవాసిని శ్రీమతి సీతాబాయిగారు తిరిగి తమదేశమునకు వెడలుసందర్భమున దేశసేవికాసంఘమువారు ఆమెకు వీడ్కోలొసంగిరి.

:—కడపలో శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు ఉపన్యసించిరి.

2:—ఉత్కళ మహిళామహాసభ బాలసూరునగరమున శ్రీమతి కుంతలకుమారీదేవిగారి అధ్యక్షతను ప్రారంభమయ్యెను.

3:—

4:—

5:—ముదుకలట్టూరు వీధులలో 10, 6, 6 మానికల ఉప్పు అమ్ముటకు పోవుచుండగా పోల్టు సబ్ఇనస్పెక్టరు 3 రు స్త్రీలను అరెస్టుచేసెను. వారు జామీనుమీద విడుదలచేయబడిరి.

6:—బొబ్బిలి కల్లుపాటలప్పుడు ఎక్సైజుఅధికారులును, నౌకరులును దుకాణదారులను ఆఫీసుప్రాకారములోనికి గొనిపోయి వేలములో పాల్గొనజేయ ప్రయత్నపడిరి. కాని దుకాణదారుల తల్లులు, అక్కచెల్లెండ్రువచ్చి ఏడ్చుచు కల్లుదుకాణములగు తగ్గకొనరాదని బ్రతిమాలిరి. అందుచే వారు మానుకొనిరి. దుకాణముల విక్రయము వాయిదావేయబడెను.

:—మద్రాసు విశ్వవిద్యాలయపట్టప్రదానమహోత్సవము శ్రీమతి ఎలినార్ మాక్ డొగల్ కన్యగారి ఆచార్యకమున జరిగెను.

7:—కాకినాడలో రామారావుపేటయందు శ్రీమతి బులుసు భద్రమ్మగారియధ్యక్షతను జరిగిన స్త్రీల బహిరంగసభలో శ్రీమతులు పెంమారి కృష్ణవేణమ్మ, బారు సత్యవతి, మంత్రిప్రగడ బంగారమ్మ, బాలాంత్రపు శేషమ్మ, గుమ్మిడిదల దుర్గాబాయమ్మగార్లుఉపన్యసించిరి.

8:—

9:—దువ్వూరి సుబ్బమ్మగారు మచిలీపట్నము హిందూకాలేజీలో స్త్రీవిద్యనుగురించి ఉపన్యసించిరి.

10:—శ్రీకంఠంపాటి పెదనాగమ్మగారను స్త్రీ 110 ఏండ్లు జీవించి ఏలూరుతాలూకా పునుకొల్లుగ్రామమున మరణించెను. ఈమె ఆమరణాంతము మిక్కిలి ఆరోగ్యముగనుండెను.

11:—శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు అమలాపురములో స్త్రీలప్రత్యేకసభలో ఉపన్యసించిరి.

12:—

13:—నందిగామతాలూకా వేములపల్లిఅగ్రహారమునందు బండారు రాజయ్యగారు సంజువ్యాధివలన బ్రతుకరనెడు దిగులుతో ఆయన ధర్మపత్ని పుల్లమ్మగారు బావిలోదూకి చనిపోయిరి.

14:—రాజమండ్రి శ్రద్ధానందఘాటులో దువ్వూరి సుబ్బమ్మగారు ప్రస్తుత రాజకీయపరిస్థితులనుగూర్చి ఉపన్యసించిరి.

15:—ఇచ్ఛాపురము తాలూకా కల్లుదుకాణములవేలముపాటల పికెటింగుకు శ్రీమతి ఆదుర్తి లక్ష్మిబాయిగారు నాయకత్వమువహించిరి.

16:—సోర్నాపూరు గ్రామపునర్నిర్మాణసభ శ్రీమతి రుక్మిణి లక్ష్మీపతిగారియధ్యక్షతను జరిగెను.

17:—

18:—

19:—




**ఫలాహారపుగది పాఠశాల: పశువులకొట్టము ఫలాహారపుగది:—**

ఇరువదిమూడుజిల్లాలుగల పెద్దరాష్ట్రమగు మదరాసురాజధానికంతకును స్త్రీల కొఱకైన ట్రెయినింగుకళాశాల మదరాసునగరమునందొక్కటియేయున్నది. ఆయొక్కటియు కూడ స్థలసంకోచమునకు గుఱియైయున్నది. ఈలేడీవిల్లింగ్డన్ ట్రెయినింగుకాలేజీ ప్రిన్సిపాలు 1930-31-వ సంవత్సరపు నివేదికలో విశేషమైన ఇబ్బందికి కారణమగుచున్న స్థలసంకోచమును గూర్చి ఇట్లు చమత్కారముగ వ్రాసియున్నారు: "మేము చేర్చుకోకలిగిన సంఖ్యకు రెట్టింపు ధరఖాస్తులువచ్చినవి. సంవత్సరము పొడుగునను చీటికిమాటికి ఉపాధ్యాయవర్గము నందలి బదలాయింపులవలన కలిగిన ఇబ్బంది స్థలసంకోచమువలన కలిగిన ఇబ్బందిముందు పరిగణింపరానిదగుచున్నది. స్థలముచాలక మేము మునుపు ఫలాహారములు తినుటకుపయోగించు గదులలో ఇప్పుడు తరగతులు పెట్టుచున్నాము. బండ్లు, గుఱ్ఱములు నిలుపులాయములను ఫలాహారమందిరములుగ వాడుచున్నాము. వానినికూడ క్లాసుగదులుగ వాడవలసిన అవసరమువచ్చునేమో?" ఒక్కగానొక్కటియైన ఈరాజధానిస్త్రీల బోధనాభ్యసన కళాశాలను ఇట్టి శోచనీయపరిస్థితులయందు నుంచుట మదరాసు ప్రభుత్వమువారికి కీర్తికరముగానిది. ఈవ్యయకర్తనదినములలో ప్రభుత్వమువారీశోచనీయపరిస్థితి తొలగించుటకు పూనుదురా?

**ఏరాయియైననేమి దంతములూడగొట్టుకొనుటకు:—**

బొంబాయిప్రభుత్వమువారు కొంతకాలమునకు క్రితము వ్యభిచారనిరోధకచట్టమును గావించిరి. దాని నిప్పుడు వారు అమలులోనికి గొనివచ్చుచున్నారు. మున్ముందు విదేశస్థులు నిర్వహించుచున్న వ్యభిచారగృహముల నిరోధము ప్రారంభమైనది. బొంబాయి పోలీసు అధికారులు విదేశస్థులు నిర్వహించుచున్న ప్రతివ్యభిచారగృహమునకునుపోయి అందలి స్త్రీలను మూటముల్లెకట్టుకొని పట్టణమువదలి పోవలసినదిగ హెచ్చరించినారు. అందుమీద ఆస్త్రీలలో చాలభాగము బొంబాయిని వదలిపోయినారు. మిగిలినవారు వ్యభిచార

గృహనిర్మూలనచట్టము అమలులోలేని కలకత్తా, కరాచిపట్టణములకు వలసపోవుటకై ప్రయత్నించుచున్నారు. విదేశస్థులు నిర్వహించు వ్యభిచారగృహములు తొలగింపబడిన పిమ్మట పోలీసువారు దేశీయులు నిర్వహించు వ్యభిచారగృహములపై దృష్టిపోనీచు నున్నారు. దేశీయులు నిర్వహించు వ్యభిచారగృహములందలి స్త్రీలుగూడ కలకత్తా, కరాచి పట్టణములకు వలసపోవుదురనియే నమ్మవలసియున్నది. బొంబాయిలో వ్యభిచారగృహ ములు నిర్మూలింపబడుచున్నవని సంతోషములేకుండ అవి ఇతర పెద్దపట్టణములకుచేరి అక్కడ అసలే హెచ్చుగనున్న వ్యభిచారగృహముల సంఖ్యను పెంచుచున్నవి. ప్రాంతిక ములగు చట్టములవలనగలుగు అరిష్టములిట్టివి.

**ఇట్టి వదాన్యులింకను గావలయును:—**

విక్రమపురమండలమందలి బ్రజ్రాజోగిని పట్టణనివాసియు, విశ్రాంతివేతనమునందు చున్న సబార్డినేటుజడ్జియు, రాయబహాదూరు బిరుదాంచితుడును అగు కామినీకుమారను ఖర్జీగారు బ్రజ్రాజోగినియందలి అనాథలగు పేదస్త్రీలకు—తమ్ముపోషించుటకు భర్తలుకాని పుత్రులుకాని లేనివారికి—సహాయమొనర్చుటకై రెండువేలరూపాయిలను విరాళమొసగెను. మఱియు ముఖర్జీగారు స్త్రీవిద్యాభిమానినియగు తమభార్య శ్రీమతి శ్యామనళినీదేవి పేరిట బాలికలకొఱకు ఒకప్రత్యేక పాఠశాలను బ్రజ్రాజోగినియందు నిర్మింపసంకల్పించిరి. ఊరూర నిట్టివదాన్యులు బయలుదేరుచో హిందూదేశస్త్రీల నేటిదుస్థితి అచిరకాలముననే తొలగి పోవగలదు.

**హృదయసంస్కారము కలిగింపని చదువెందుకు?:—**

కలకత్తాలో కూంభుటోలవీథిలో హార్డింజివిద్యార్థివసతిగృహముగలదు. న్యాయ శాస్త్రవిద్య నభ్యసించు విద్యార్థులందుందురు. ఈవసతిగృహమున కెదురుగ వైద్యశాలా లకు చెందిన ఎజ్రాఆసుపత్రిగలదు. అందు వైద్యము చేయించుకొను స్త్రీలు ఆయాసము తీర్చుకొనుటకుగాని, పచారుచేయుటకుగాని గదులనుండి వరండాలోనికివచ్చినచో వసతి గృహమునందలి న్యాయశాస్త్రవిద్యార్థులు చదువుగాని సంస్కారముగాని లేని పోకిరీవాండ్ర వలె ఈలలువేయుచు, చప్పట్లుకొట్టుచు, మారుపేర్లుపెట్టి పిలుచుచు, నవ్వుచు, ఇకిలించుచు, చెప్పరాని ఇతర అనుచితపుపనులుచేయుచు తోకలేనివానరులట్లు ప్రవర్తించుచున్నారు. కర్మసాక్షియెదుట పట్టపగలు ఇట్టి అనుచితపుకార్యములు జరుగుచున్నవి. సిగ్గుపడిఆరోగిష్టి స్త్రీలుగదులలోనే క్రుగ్గుచున్నారు. ఈవిషయములన్నియు పేపరులకెక్కినవి. ఇట్టిప్రవర్తన ఒక్క కలకత్తా విద్యావంతులలోనేగాదు. పలుతావుల సంఘటిల్లుచుండుట పలువురకు అనుభవపునరుక్తమే. స్త్రీని దేవిగతలంచు భారతదేశమున నేటియువకుల ఈప్రవర్తనము క్షంతవ్యముగాకయున్నది. చదువుచదివినను హృదయసంస్కారము కలుగనిచో మానవుడు పరిణామసిద్ధాంతముప్రకారము తనదగ్గఱబంధువుడగు—వానరుని దలపించుచునేయుండును.

**మద్రాసు కాన్వొకేషను ప్రసంగమున పట్టభద్రులకు హితవు:—**

ఈయేటిస్నాతకసభకు ఆచార్యపదవివహించిన శ్రీమతి ఎలినార్ మాక్ డౌగల్ కన్యగారు పట్టభద్రుల కీహితవు నొసంగిరి.

"విద్యార్థుల మనస్సులయందలి భావములన్నియు, విద్యార్థినుల మనస్సులనుగూడ సంచలింపజేయుచున్నవి. కాని వీరికంటె మాకు విశ్వవిద్యాలయమునెడల కృతజ్ఞత మెండు. ఏలననగా పురుషులు చేసిన కష్టములయొక్క ఫలితమును మేమనుభవించుచున్నాము. మాకు విశ్వవిద్యాలయము అన్నివిధముల సహాయము చేయుచున్నది. విద్యార్థినులును పట్టపరీక్షలలో ప్రథమస్థానము నలంకరించుట సంతోషప్రదము. పట్టభద్రులను వారియెడల దేశీయులుగూడ ఇట్టి అభిమానమునే చూపెదరుగాక! స్త్రీ పట్టభద్రులు దేశమునకు చేయగలుగు సేవ విశ్వవిద్యాలయమునకు ఫలితమగును. స్త్రీపట్టభద్రులు స్త్రీలకు చేయవలసిన సేవ అపరిమితముగాకలదు. భారతస్త్రీలకు తగినవిద్యను వారు ఏర్పాటుచేయవలెను. విదేశీయులుగాని దేశీయులలో పురుషులుగాని దానిని సరిగా నిర్ణయింపజాలరు. ఒకస్త్రీలే ఆసమస్యను పరిష్కరింపగలరు."

ఈవత్సరము వివిధములగు డిగ్రీలనందుకొనిన 153 స్త్రీలు ఈహితవును ఆచరణయందు బెట్టుదురేని దేశాభివృద్ధి కాగలదు.

**అజ్ఞాతయావనయగు విద్యార్థిని అపహరింపబడుట:—**

అమృతసరమున ప్రభుత్వమువారు బాలికలకొఱకు ఒకపాఠశాలను నిర్వహించుచున్నారు. అయితే అది ఊరికినడుమనగాని, సమీపమునగాని లేదు. దూరముగా విసిరివేసినట్లు ఎక్కడనో సివిలులైన్సుదగ్గఱగలదు. ఊరినుండి విద్యార్థినులను మోటారుబస్సులలో అక్కడికి గొనిపోవుదురు. పాఠశాల ఊరికిదూరముగ నుండుట అనేకవిషయములచే సమ్మతింపరానిదనియు దానిని త్వరలో ఊరిమధ్యకు మార్చవలెనియు ప్రజలు ప్రబలమైన ఆందోళనముచేసిరి. ప్రభుత్వమువారు వినిపించుకొనలేదు. ఇట్లుండ ఈనడుమ ఆపాఠశాలకు బాలికలను గొనిపోవు బస్సుడ్రయివరు ఒకవిద్యార్థినిని అపహరించుకొనిపోయినాడు. ఆవిద్యార్థిని అజ్ఞాతయావన. మర్యాదగల మహమ్మదీయకుటుంబమునకు చెందినది. ఆమె అపహరింపబడినది. ఇంతవఱకు అయిపులేదు. ప్రథమదశయందున్న స్త్రీవిద్య ఇట్టివానిచే ప్రబలాఘాతము నొందుననుట నిశ్చయము. చేరువశారెడుమేరలో పాఠశాల మొదలగు సౌకర్యములు ఉన్నప్పుడే బాలికలు చదువుకొనుటకు వసతులులేని హిందూదేశమున ఊరికిదూరమగు పాఠశాల, దానికి పోవుటలో ఇట్టి పోకిరీవాండ్రవలని అభిజాత్యభంగభయము మొదలగు తీవ్రప్రతిబంధకములు గలుగుచో ఇప్పుడిప్పుడే కొంచము కొంచముగ తలయెత్తుచున్న స్త్రీవిద్య కొనాకులువేయగలదు. అమృతసరమునిసిపలుసంఘమువారు దీనినిగూర్చి తీవ్రముగ నాలోచించుచుండుట లెస్సగనున్నది.

---

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.